# చతుర కతలు

- కర్లపాలెం హనుమంతరావు

స్వభాను సంవత్సరాన్ని అధికార భాషా సంవత్సరంగా ప్రభుత్వం ప్రకటించింది. శుభం! తెలుగూ, ఉర్దూలతో ఈ ఏడాదికెలాగో సర్దుకుపోవాలని అధికారుల్లకాదేశాలూ అందాయి.

తెలుగువాళ్ళందర్నీ తెలుగే మాట్లాడమని తేజా టీవీల్లాంటివి తెగ బతిమాలుతున్నాయి.

## తెలుగు తక్కువతనం

బస్సుల వెనకాల వెనకెప్పుడో తెలుగంకెలు వేశారు. తర్జనభర్జనల తర్వాత తెలుగుతల్లి విగ్రహంకింద తెలుగు తర్జుమా రాశారిప్పుడు. 'మొదటి భాషా ప్రయుక్త



రాష్ట్రంరా బాబూ మనది. బోర్డుల్లో కూడా అర్థమయ్యే తెలుగు ఉంటే బావుంటుంద'ని అధికార భాషా సంఘం ఆశ. ఉదాహరణకి బస్సులో స్త్రీలు కూర్చునేచోట 'మగాడివైతే కూర్చోకు' అని రాసుందనుకోండి. ఛస్తే ఏ మగాడూ ఆ సీట్లో కూర్చోడుగదా... అలా!

"ఎ.పి. గవర్నరుగారు హ్యాపీనేనా?" అని గవర్నరుగారిని మాజీ గవర్నరుగారు ఏదో మీటింగులో కనపడినప్పుడు సరదాగా అడిగారట.

"అంతా ఓకేనే. అయితే ఒకటే బావో లేదు. ప్రథమ పౌరుడినయివుండీ అధికార భాష రాదు. తెలుగు విశ్వవిద్యాలయం ఛాన్స్‌లర్ అయివుండీ తెలుగులో మాట్లాడే ఛాన్సులేదు" అని గవర్నరుగారు బాధపడ్డారు.

"తెలుగు తేలికేనే... నేర్చుకోవచ్చుగా... బొంబాయినుండి వచ్చిన బొద్దాడని పిల్లలు కూడా సినిమాల్లో ఎలా చెలామణీ అయిపోతున్నారో... చూడండి" అన్నారు మాజీ.

గవర్నరుగారికీ తెలుగు నేర్చుకోవాలని తెగ ఇదిగా ఉంది. కానీ 'యాభై ఆరు అక్షరాలు, ఎన్నో వత్తులు, దీర్ఘాలు, ద్విత్వాక్షరాలు... , చత్వారం పెరిగిపోతుందేమోనని భయం. 'మెలికలు తిరిగే భాషకి



నాలిక తిరుగుతుందా...' అని మథన.

"మీకేం... తాంబూలం వేసుకుని తమిళం మాట్లాడేస్తే తెలుగనుకుని పేపరు వాళ్ళేవో రాసుకుపోతారు" అన్నారు గవర్నరు మాజీతో.

"మీకూ గడ్డం అడ్డం ఉందిగా. సోంపూ లాంటిదేమన్నా చప్పరిస్తుండండి. గడ్డం కదలికని పట్టి పాఠం పోలికపట్టే పత్రికవాళ్ళున్నారక్కడ. అంతేకాదు కొత్తలో అందరి పరిస్థితీ అంతేనండీ. పాఠాలు చెప్పే ట్యూటరున్నాడు. పేరు పీటర్. ఆక్స్‌ఫర్డ్ తెలుగు పీఠంలో రిపీటర్. ఆయన్ని పెట్టుకోండి" అని సలహా ఇచ్చారు ఫైనల్‌గా.

పీటర్ వస్తూవస్తూనే పరవస్తు చిన్నయ సూరిలాగా ఫోజుపెట్టి 'ఓపందీ బుక్' **(open the book)** అన్నాడు. గవర్నరు గారికప్పటికే కొద్దిగా తెలుగు అర్థమవుతోంది. బాధపడుతూ, "పందీ... గిందీ... వద్దు. ఎదుటివారిని ఎలా పలకరించాలో తేలికైన తెలుగులో తెలపండి" అన్నారు హిందీలో.

"నమసతా... బగనర... నసత... అయినద" అన్నాడు పీటర్.

"అంటే...?"

"నమస్తే... బాగున్నారా? నాస్తా అయిందా? అనర్థం. తేలిగ్గా చెప్పమన్నారని వత్తులూ, దీర్ఘాలూ లేకుండా వట్టి అక్షరాల్లో చెప్పా తప్పా?" అనడిగాడు పీటర్.

"మరీ అంత తేలిగ్గా వద్దులెండి. కొద్దిగా బరువైనా ఫరవాలేదు. ఏదైనా షాపుకెళ్ళి ఎలా అడగాలో చెప్పండి?"

"ఒక అర్థరూప్యమునకు ఆకులుంబెట్టి శేషంబునకు వక్కలు బెట్టుడు" అనొచ్చు

"అంటే?"

"ఒక అర్థరూపాయికి తమలపాకులు పెట్టి... మిగిలినదానికి వక్కలు పెట్టమని అర్థం"

'ఇట్లా మాట్లాడితే వక్కలు పెట్టడు. చెక్కలు పెట్టి కొడతాడు'అనుకుని "మరీ తేలికకి... మరీ బరువుకి మధ్యస్థంగా... అందరికీ అర్థమయ్యే భాష మీ ఆక్స్‌ఫర్డ్ తెలుగూ స్కూల్లో ఏదీలేదా?"

"ఉంది. ఉదాహరణకి ఇది వినండి. 'ఎ.పి. సి.యమ్. పియ్యే పి.పి.రావు, యూ.పీ. యం.పీ. ఎక్స్ పి.ఆర్.వో., యస్.సి. ఐ.ఎ.ఎస్., ఏ వన్ ఆఫీసర్' అర్థమయ్యిందాసార్?"

"ఆంధ్రప్రదేశ్ చీఫ్ మినిస్టర్ పర్సనల్ అసిస్టెంట్ పి.పి. రావు ఉత్తరప్రదేశ్ యం.పీ.కి ఇదివరకు పబ్లిక్ రిలేషన్ ఆఫీసర్. షెడ్యూల్డ్ కేస్ట్. ఐ.ఎ.యస్. ఆఫీసరు. ఏ వన్ అంటే ఎక్సలెంటనేగా అర్థం. అరెరె... తెలుగింత తేలిగ్గా ఉంటుందా? ఇది నిజంగా నీ మదర్‌టంగేనా?" అనడిగారు గవర్నరుగారనుమానంగా.

"మదర్ ప్రామిస్. మా 'మదర్ సూపర్ స్పెషాలిటీ' హాస్పిటల్లో సేల్సు సైడ్ మాట్లాడి చూడండి' అంటూ ఫోన్ కలిపి ఇచ్చాడు. రంగు రంగు మంటుందా మదర్‌టంగ్. 'వెల్‌కం టూ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్... ఓపీలో వివిపీలకు బి.పి. ఫీ ఫ్రీ... వి.వి.ఐ.పీ.లకు ఇ.సి.జి. ఫీ ఫ్రీ., వి.వి.వి. ఐ.పి.లకు ఇ.ఎన్.టి ఎంట్రీ ఫీ ఫ్రీ...' రయ్యిమని లైన్ కట్‌చేసి "ఇది తెలుగా అన్నీ ఇంగ్లీషు ముక్కలేనే" అని ముక్కుమీద వేలేసుకున్నాడు గవర్నరుగారు.

"తెలుగువాళ్ళకు తేలిగ్గా అర్థమయ్యే భాష ఇదే సార్! తెలుగు భాషకు మొదట్లో నిఘంటువు రాసింది ఇంగ్లీషాయనే. పేరు సి.పి. బ్రౌన్. పూర్‌ఫెలోక్కూడా ప్యూర్ తెలుగు మాట్లాడడం నామోషీ ఇక్కడ. అచ్చతెలుగు అచ్చిరాదని పిచ్చినమ్మకం. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్‌గాని, ఇంట్లో మాత్రం వేస్ట్. తెలుగుదేశంలో కరణంలేదు. తెలుగు భాషలో వ్యాకరణం ఉండదు. వత్తుల్లేకున్నా వత్తి పలుకుతాడు పక్క రాష్ట్రం పక్కా భాషావాది. ఎన్ని వత్తులున్నా నత్తిగా పలకడం తెలుగు నాలుక ఫేషన్. వంకర్లు

తిరుగుతూ యాంకర్లు పలికే సంకర భాషం టేనే మోజు. పరాయిభాషెలాగున్నా ఎలా గోలా లాగడమే నేటి రివాజు. పరదేశం పోతేనే తెలుగుకి పరవశించిపోతాడు తెలుగువాడు. ఒక చెంపమీద కొడితే 'అమ్మా' అన్నందుకు, 'మమ్మీ' అననందుకు పిల్లాడి రెండో చెంప పగలగొడుతుందిక్కడి తల్లి. తెలుగు మూడోస్థానంలో కూడా లేని బడుల్లో తయారైన బడుద్ధాయిలు 'శ్రీనాథుడికి' పొట్టలో చుక్క ఉండాలంటే 'అరె ఆ రోజుల్లో కూడా కవులు చుక్కేసుకునేవారా సార్!' అని అడిగేరకం"

పీటర్‌గారి తెలుగు ఘోష ఎందుకో గవర్నరుగారికి బొత్తిగా నచ్చలేదు. కొత్త ట్యూటరు కోసం ప్రకటన పడింది. కోటి మంది అప్లయ్ చేశారు. తెలుగుమీద అభిమానంతో కాదు... గవర్నరుగారి దగ్గర పనిమీద మోజుతో.

సీసాలూ... చంపకమాలలులాంటివి వున్న తెలుగు పద్యం మద్యంకన్నా మత్తుగా ఉంటుంది. పాలమీగడకన్నా, పంచదారకన్నా, తేనెకన్నా, తీయని మామిడికన్నా తీయని తేటతెలుగు మాట మొరటా? పరాయిభాషా ముక్కల్ని ముక్కుమీద పెట్టుకుని బోరవిరుచు తిరిగే వదరుబోతులకి వృత్తాల్లోని నృత్యం, అలంకారాల్లోని అందం... సంధుల్లోని ఆనందం ఎలా అనుభవంలోకొస్తుంది.

చివరి వడపోతలో పదిమంది మాత్రం మిగిలారు. "బుధవారపు మధుసూదనరావు భీమాకీ బీమాకీ భేదం బోధపడక బాధపడ్డాడు" అనే వాక్యాన్ని ఎవరెన్ని తక్కువ తప్పుల్తో రాస్తే వారే గవర్నరుగారికి కాబోయే తెలుగు భాషా బోధకుడు. అదీ పరీక్ష.

ఆఫ్రికానుంచి వచ్చిన గోమ్స్ అందరికన్నా ముందున్నాడు. పెద్ద బాలశిక్ష శ్రద్ధగా చదువుకొన్నందువల్లే ఈ విజయం సాధించగలిగానని సగర్వంగా ప్రకటించుకున్నాడు.

"తెలుగు భాష నేర్చుకోవాలని ఎందుకనిపించింది? " అనడిగాడొక పేపర్ రిపోర్టర్. "యూ సీ... టెలుగూ ఈజే ఫన్నీ లాన్‌గ్వేజ్. ఇక్కడ 'గుఱ్ఱము'నకు కొమ్ములు ఉండును. గాడిదకు గుడి ఉండును అని విని పెద్దబాలశిక్ష చదివితిని" అన్నాడు ఆ గవర్నర్ బోధకుడు.

## నిజం చెబితే నమ్మరే!

ఒక్కొక్కసారి నిజం చెప్పినా ఎవరూ నమ్మరు.

రామయ్య, సీతమ్మ డెబ్బయ్యవ పడిలో పడ్డారు. పిల్లలు లేరు. వాళ్ళే ఒకళ్ళకొకళ్ళు తోడు. వాళ్ళ పెళ్ళయి ఆరోజుకి ఏభయ్యేళ్ళయింది.

"ఈ శుభసందర్భంలో మనం మొదటిసారి కలుసుకొన్న చోటుకువెళ్ళి కాస్సేపు కూర్చొని వద్దాం" అని ప్రపోజ్ చేశాడు రామయ్య.

సీతమ్మగారు సరేనంది.

ఇద్దరూ మొదటిసారి కలుసుకున్న స్కూలువైపు బయలుదేరారు. దారిలో ఒక చెట్టు దగ్గర ఒక పెద్ద మూట కనపడింది. కుతూహలంకొద్దీ మూట విప్పి చూశారు ముసలి దంపతులు. మూటనిండా కరెన్సీ! కళ్ళు జిగేల్‌మన్నాయి. కాళ్ళు వణికాయి రామయ్యగారికి. "ఎవరిదో ఇంత సొమ్ము. పాపం... పారేసుకున్నారు" అన్నాడు జాలిగా.

"ఈ క్షణంనుంచీ మనదే. మనకు దొరికిందిగా" అంది సీతమ్మ.

"పాపం సొమ్ము వంటికి పడదు, వద్దు" అన్నాడు రామయ్య. సీతమ్మ చెవికెక్కించుకోలేదు. స్కూలుకు పోకుండానే వెనక్కి వచ్చేశారు. మూటని అటకెక్కించింది సీతమ్మ.

మర్నాడు పోలీసులు వరసగా విచారణ చేసుకుంటూ సీతమ్మగారింటిక్కూడా వచ్చి కూర్చున్నారు.





"బ్యాంకు డబ్బు... ఒకచోటునుంచి ఇంకో చోటుకి మారుస్తుంటే దారిలో ఒక బండిల్ ఎక్కడో జారిపోయింది. మీకుగాని దాని విషయం ఏమన్నా తెలిస్తే చెప్పండి. తగిన పారితోషికం ఇస్తాము" అన్నాడు పోలీసాఫీసరు.

రామయ్య "మా ముసిలిదానికి ఆ మూట దొరికింది సార్! ఇంట్లో అటకమీద పెట్టింది" అన్నాడు నిజాయితీగా.

"ముసలాయనకి ఈమధ్యలో మతి చలించింది. ఆయన మాటలు ఆట్టే పట్టించుకోకండి బాబూ" అంది సీతమ్మ.

కాన్పేపిలాగే ముసలాళ్ళమధ్య తర్జనభర్జనలు జరిగాయి. విషయాన్ని వెంటనే సెటిల్ చేద్దామనుకొన్న పోలీసాఫీసరు రామయ్యవైపు తిరిగి "అసలు నిన్నేం జరిగిందో ముందునించి చెప్పండి" అనడిగాడు.

రామయ్య ఉత్సాహంగా అందుకున్నాడు. "నిన్న నేనూ మా ముసిలిది స్కూలుకు పోతున్నాం సార్..."

పోలీసులు రామయ్య వంక జాలిగాచూసి వెళ్ళిపోయారు.

ఒక్కోసారి నిజం చెప్పినా ఎవ్వరూ నమ్మరు.

---

## టికెట్ - ట్రిక్

సత్యం, శివం, సుందరం విశాఖ ఎక్స్‌ప్రెస్ ఎక్కటానికి స్టేషన్‌కొచ్చారు. ముగ్గురూ కలిసి ఒకే టికెట్ కొనడం చూసి అక్కడే ఉన్న ఉమ, సుమ, రమలకు ఆశ్చర్యం అనిపించింది. వాళ్ళు కూడా అదే ట్రైన్‌కి విశాఖ వస్తున్నారు. అందరూ ఏదో ఎంట్రన్స్ ఎగ్జామ్‌కి ఎటెండవుతున్నారు.

"ఏముంది... టీసీ రాగానే ఇద్దరు టాయ్‌లెట్స్‌లో దూరతారు కాబోలు" అంది రమ అసహ్యంగా మొహంపెట్టి.

"అలాగైతే ఆ ఒక్క టికెట్ కూడా కొనడమెందుకు? " అంది సుమ సందేహంగా.

"వాళ్ళనే అడిగితే పోలా!" అని చొరవగా ముందుకు వెళ్ళి "హాయ్" అంది ఆ ముగ్గురితో ఉమ.

ఉమ డౌటు విన్న సత్యం "చెబితే అర్థం కాదు, చూద్దురుగాని, మా కంపార్ట్‌మెంటే ఎక్కండి" అన్నాడు.





ముగ్గురబ్బాయిలూ, ముగ్గురమ్మాయిలూ ఒకే పెట్టెలో ఎక్కారు. బండి బయలుదేరిన పది నిమిషాలకి టి.సి. అటువైపునుండి టికెట్స్ చెక్ చేసుకుంటూ వస్తున్నాడు. బండి మెల్లగా ఊపందుకుని పరుగెడు తోంది. ఈ వేగంలో పక్క కంపార్ట్‌మెంట్‌లోకి మారడం కూడా కష్టం. అక్కడింకో టీసీ నిలబడి ఉన్నాడు. మగపిల్లలు ఏం చేస్తారో చూద్దామని కుతూహలంగా చూస్తున్న ఆడపిల్లలు షాక్ తిన్నారు. ముగ్గురు బాయిస్ గభాలున కూపేలోకి దూరారు. టీసీ వచ్చి తలుపు టక్...టక్



మని కొట్టాడు. గభాలున టికెట్టున్న చెయ్యి బైటికొచ్చింది. "సారీ సార్... బట్టలు మార్చు కొంటున్నాను, బైటికి రాలేను" అంది లోపలి గొంతు. "ఓకే... ఇట్సాల్ రైట్... టికెట్ ఉందిగా" అంటూ చెక్ చేసుకుని ముందుకు కదిలాడు టీసీ. ఉసూరుమన్నారు ఆడపిల్లలు అనవసరంగా మూడు టికెట్లు కొన్నందుకు.

తిరుగు ప్రయాణంలో మళ్ళీ ఆ సత్యం, శివం, సుందరం స్టేషన్లో కనపడ్డారు. తమాషాగా ఆడపిల్లలూ, వాళ్ళూ అందరూ ఒకే ట్రైన్‌కు వస్తున్నారు. ఈసారి ఆడపిల్లలూ ఒకటే టికెట్ కొన్నారు. మగపిల్లలు అసలు కొనలేదు.

"మళ్ళీ ఇదేం ఫిటింగ్..." అని ఆశ్చర్యపోయింది ఉమ.

"చెబితే అర్థంకాదు చూపిస్తాం. మా కంపార్ట్‌మెంట్ ఎక్కండి" అన్నాడు సత్యం.

యథాప్రకారం అందరూ ఒకే కంపార్ట్‌మెంట్‌లో సర్దుకున్నారు. పది నిమిషాల తర్వాత టీసీ బోగీ ఎక్కాడు. ఆడపిల్లలు ముగ్గురూ గభాలున ఒక కూపేలోకి దూరారు.

టీసీకన్నా ముందుగా శివం పోయి డోర్ టక్‌టక్‌మని కొట్టి 'టికెట్ ప్లీజ్' అన్నాడు టీసీలాగా.

లోపల్నుండి గాజులున్న ఒక చెయ్యొచ్చి టికెట్టిచ్చింది "సారీ సార్... బట్టలు మార్చుకుంటున్నాను, బైటికి రాలేను" అంటూ.

"నో ప్రాబ్లమ్... టికెట్టిచ్చెయ్యండి, చాలు" అంటూ టికెట్ లాక్కొని చక్కా పక్కబోగీలోకి దూరారు ముగ్గురు మగపిల్లలూ.

నిజంగానే టీసీ వచ్చి టికెట్టడిగితే ఆడపిల్లలు ఏం చూపిస్తారో తల్చుకున్న వాళ్ళకు నవ్వాగడంలేదు. ★

# చతుర ప్రపంచం

## కొత్త నక్షత్రం

సూర్యుడికి అతి దగ్గరగా ఉన్న నక్షత్రాలలో ఎస్‌ఓ 25300.5 + 165258 అనే నక్షత్రం మూడవదని ఖగోళశాస్త్రవేత్తలు భావిస్తున్నారు. వాస్తవానికి ఈ నక్షత్రాన్ని 2002 సెప్టెంబరులోనే తాము కనుక్కున్నామని

ఎస్‌ఓ 25300.5+165258 నక్షత్రం పాలిపోయిన ఎరుపు కాంతి పుంజాలతో ప్రకాశిస్తోందని ఖగోళశాస్త్రవేత్తలు అంటున్నారు. అనుకోకుండా దర్శనమిచ్చిన ఈ నక్షత్రం తమని సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసిందని బొన్నార్ట్ టీగార్డెన్ అంటున్నారు. బొన్నార్ట్ నాసాకు చెందిన గోడ్డార్ట్ స్పేస్ ఫ్లయిట్ సెంటర్‌లో పనిచేస్తున్నాడు.




వారు అంటున్నారు. సూర్యుడికి అతి దగ్గరగా ఉండే నక్షత్రాలలో ఇది మూడోస్థానాన్ని ఆక్రమించవచ్చునన్నది శాస్త్రవేత్తల అభిప్రాయం.

ఈ నక్షత్రం భూమికి 7.8 కాంతి సంవత్సరాల దూరంలో ఉండవచ్చునన్నది శాస్త్రవేత్తల అంచనా. ఒక కాంతి సంవత్సరం అంటే సుమారు ఆరు ట్రిలియన్ మైళ్లు ఉంటుంది. లేదా 9.5 ట్రిలియన్ కిలోమీటర్ల దూరంలో ఉండవచ్చు.

ఈ కొత్త నక్షత్రం స్థానాన్ని అంచనావేసే బాధ్యతకు వాషింగ్‌టన్‌లోని యు.ఎస్. నావికా పరిశోధనాశాల ప్రయత్నిస్తోంది. వీరు ఎస్‌ఓ 25300.5+165258 నక్షత్రం సూర్యుడుకి ఎంత దగ్గరలో ఉందో అంచనా వేసేందుకు ప్రయత్నిస్తున్నారు. తెల్లని కాంతి పుంజాలను విడుదలచేసే నక్షత్రాల కోసం అన్వేషిస్తున్న సమయంలో ఈ నక్షత్రాన్ని కనుగొనడం జరిగిందని బొన్నార్ట్ అంటున్నారు. ఈ నక్షత్రాలను హైప్రాపర్ మోషన్ ఆబ్జెక్ట్సు అని అంటారు. ఈ నక్ష




త్రాలను కనుక్కోవడం అంత సులభమేమీ కాదు. ఈ నక్షత్రాలు కొంతకాలంపాటైనా ఏ ప్రాంతంలోనైతే నిశ్చలంగా ఉన్నాయో ఆ ప్రాంతాన్ని పరిశీలించాలి. నక్షత్రాలు ఆ ప్రాంతాన్ని వదిలి పక్కకు జరిగితే చుట్టూ నిశ్చలంగా ఉన్న పరిసరాల ఆధారంగా నక్షత్రాల ఉనికిని శాస్త్రవేత్తలు గుర్తిస్తారు. ఇందుకుగాను కాలిఫోర్నియాలోని పాసడోనా ప్రాంతంలో గల నాసా జెట్ ప్రొపెల్షన్ లాబొరేటరీ (జెపిఎల్)లో ఏర్పాటుచేసిన ఎన్ఇఎటి అనే ప్రోగ్రాంద్వారా కొత్త నక్షత్రాల గుర్తులను పరిశీలిస్తుంటారు.

మామూలు వారికి అబ్బో అంత కష్టమా అని అన్పిస్తుంది. కానీ ఖగోళశాస్త్రవేత్తలకి మాత్రం ఈ పరిశోధనలు ఎంతో ఆసక్తికరంగా ఉంటాయి.

---

## కోట దాటని కబుర్లు

ఈరోజుల్లో మతసామరస్యం గురించి ఎందరెందరో ఉపన్యాసాలు ఇస్తున్నారు. ఉద్వేగంతో కబుర్లు ఎన్నో చెప్తున్నారు. అయితే




వీరిలో మతసామరస్యాన్ని త్రికరణశుద్ధిగా పాటిస్తున్నవారు, అమలుపరుస్తున్నవారు బహుకొద్దిమంది మాత్రమే!

కబుర్లతో కోటలు దాటించకుండా, ఆచరణలో చూపుతున్న వారిలో యం. అబ్దుల్ గులామ్ ఒకరు. ఈయన ఒక ముస్లిమ్ ప్రొఫెసర్. హిందు, ముస్లిమ్‌లు సోదరభావంతో కలిసి మెలిసి ఉండాలనీ, మతమౌఢ్యాన్ని విడనాడాలనీ ఆయన చెప్తూ ఉంటారు. తాను చెప్పే మాటలను ఆచరిస్తారు.

హిందూ దేవాలయాల్లో భగవద్గీతను గురించి బహుచక్కటి ప్రసంగాలను వినిపిస్తారు. ఆయన ప్రవచనాలు వినడానికి అనేకమంది హిందువులు ఆయా దేవాలయాలకు వచ్చి, ఆసక్తిగా ఆయన ప్రసంగాన్ని విని, అభినందిస్తున్నారు. రామనాథపురంలోని కోదండ రామస్వామి ఆలయంలో రెండు సంవత్సరాలనుంచీ ప్రతీ గురువారం సాయంత్రం అబ్దుల్ గులాం ప్రవచనాలు ఇస్తున్నారు. ఎంతో భక్తిభావంతో పులకిస్తూ అబ్దుల్ గంభీరంగా కొంతసేపు, అతిమృదుమధురంగా మరికొంతసేపు గీత ప్రవచనాన్ని సాగిస్తూ ఉండడంవలన, భక్తులను ఇది ఎంతగానో ఆకర్షిస్తూ ఆనందింపజేస్తోంది.



# చతుర

సంపుటి: 26
సంచిక: 7
ఆగస్ట్ 2003
307వ సంచిక

ఆమె పేరు బంతి. ముద్దబంతిలా ముగ్ధమనోహరంగా వుండే ఆమె అమాయక ఆంతర్యపు అడుగు పొరల్లో అలవోకగా దాగిన కోరిక... రెండు తాళిబొట్లు.

స్త్రీల మెడలను అలరిస్తూ అప్పుడప్పుడు బయటపడి పైటపై నిలిచే ఆ తాళిబొట్టు తన మెడను వరించేదెప్పుడా అని ఆమె చంద్రునికై చకోరిలా ఎదురుచూసేది.

తాళిబొట్టు మీద మోజేగాని పెళ్లంటే ఏమిటో తెలియని ఆ చిన్నారిని... ఆకుచాటు పిందెలా అమ్మానాన్నలే లోకమనుకునే ఆ అమాయకురాలిని అనూహ్య ప్రపంచానికి పరిచయం చేసిన పరిస్థితులెలాంటివి? అమ్మ పైటపై అప్పుడప్పుడు అద్భుతంగా దర్శనమిస్తూ వచ్చిన తాళిబొట్టు ఆమెను వరించిందా?

విధి విరచించే వినూత్న జీవన సంఘటనలకు విశిష్టాక్షర రూపం అత్తలూరి విజయలక్ష్మి రచన

'నేనెవరిని?'

ఈ నెల చతుర సమగ్ర నవల.

# నేనెవరిని?

-అత్తలూరి విజయలక్ష్మి

నేను...

ఎవరిని?

నా ఉనికి ఏంటి?

నా స్థానం ఎక్కడ?

ఈ సమాజానికి, ఈ ప్రపంచానికి నేనేవిధంగా ఉపయోగపడగలను?

నేనీభూమ్మీదకు ఎందుకు వచ్చాను? ఏం సాధిస్తాను? ఏం సాధించాలి?

అసలు నేనెవరిని? నాకేం కావాలి?

అవును నేనెవరిని?

నేనొక హిమవన్నగాన్ని,

నేనొక శీతలపవనాన్ని,

నేనొక ఇసుకరేణువును...

నేనొక ధూళి శకలాన్ని,

నేనొక నీటిబిందువుని,

నేనొక ప్రవహించేనదిని...

నేనొక అగ్నిపర్వతాన్ని,

ఈ సృష్టికి మూలం నేను... సృష్టిలో ఆనందానికి కారణం నేను... సృష్టిలో అరాచకాలకూ కారణం నేను...

ఈ ప్రపంచంలో శాంతికి, అశాంతికి నిలయం నేను... ప్రేమకీ, ద్వేషానికీ మధ్య వారధిని నేను...

నేను ఈ సమస్తవిశ్వాన్ని ఆవరించిన ఓ పరమాద్భుతశక్తిని...

అయినా నేనో శాపగ్రస్తను...

ఎందుకయ్యానలా? నేనలా అవడానికి కారకులు ఎవరు? నేనేనా?... అయితే, ఎందుకలా అయ్యాను?

చివరికి ఏం సాధించాను?

ఇంతకీ ఎవరీనేను? నా పేరేంటి?

★ ★ ★

"మధూ! కొంచెం పప్పేయనా... ఏంటా తినడం? సరిగా తిను. కింద మెతుకులేరు. అలా అన్నం కిందపడేస్తే, అన్నపూర్ణకి కోపం వస్తుంది" సన్నగా మందలిస్తూన్న అమ్మ స్వరం, కొద్దిగా వంగిన ఆవిడ మెడలోంచి ముందుకి పడి బరువుగా వేళ్లాడుతోన్న రెండు మంగళసూత్రాలు... కనురెప్పలు పైకెత్తి ఆ సూత్రాలవైపు చూశాను.

అమ్మ గొలుసు ఎంత బాగుందో! ఆ గొలుసు చూస్తే వెంటనే నా మెడలో వేసుకోవాలనిపిస్తుంది. ఆ మాటంటే అమ్మ తిడుతుంది.

అసలెప్పుడూ ఆ గొలుసుని అమ్మ జాకెట్టు లోపలే వేసుకుంటుంది. ఇలా వంగినప్పుడు మాత్రం ముందుకి జారుతుందా గొలుసు. అలా జారినప్పుడు నా దృష్టి ఆ గొలుసుమీదే ఉంటుంది. గొలుసు కన్నా దానికి వేళ్లాడే ఆ సూత్రాలు నాకిష్టం. ఎంత బాగుంటాయో. మరీ చిన్నప్పుడు ఒక్కసారి ఆ గొలుసు వేయమని నేను ఏడిస్తే అమ్మ ఒక గిల్టు గొలుసు తీసుకొచ్చి నా మెడలో వేసింది. సన్నగా గొంతువరకు ఉన్న ఆ గొలుసు నాకసలు నచ్చలేదు. బలవంతంగా లాగి తెంపేసి, అమ్మ గొలుసే వేయమని మారాం చేశానని అమ్మ కొట్టింది కూడా.

ఆ తరవాత "తప్పమ్మా... ఇది నువ్వు వేసుకోకూడదు. పెద్దయ్యాక, పెళ్లయ్యాక వేసుకోవాలి" అని చెప్పింది.

అప్పటినుంచి నేను ఎప్పుడు పెద్దదాన్ని అవుతానా అని ఎదురుచూస్తున్నాను. ఒక్కో ఏడాది గడుస్తున్నకొద్దీ నేనెంత పెద్దదాన్ని అవాలో, ఎప్పుడు ఆ గొలుసు వేసుకోవాలో అని ఎదురుచూడడం నా దినచర్యలో భాగం అయింది.

చిన్నప్పటినుంచీ అమ్మా, నాన్నా కబుర్లు చెప్పుకుంటుంటే, నేను అమ్మ ఒళ్లో కూర్చుని ఎన్నోసార్లు ఆ గొలుసుతో ఆడుకున్నాను. వాటిమీద నాకున్న ఆసక్తినీ, ఇష్టాన్నీ చూసి అమ్మా, నాన్నా నవ్వుకోవడం ఎన్నోసార్లు చూశాను. వాళ్లలా నవ్వుతూ నా ఇష్టాన్ని తేలిగ్గా తీసిపారేస్తుంటే ఉడుకుమోత్తనంతో ఏడ్చిన రోజులు కూడా ఉన్నాయి.

ఇప్పుడు నాకు పదేళ్లు. నేనిప్పుడు నాలుగో తరగతి చదువుతున్నాను. ఈ





ఏడాది పరీక్షలైపోతే ఐదో తరగతికి వస్తాను. అంటే ఇంకా కొంచెం పెద్దదాన్ని అవుతాను. అప్పుడు నేనీ గొలుసు వేసుకో వచ్చా

అలా అనుకొంటే నాకు నవ్వొచ్చింది. ఎందుకంటే నాకిప్పుడిప్పుడే తెలుస్తోంది ఆ గొలుసు నేనెందుకు వేసుకోకూడదో.

నేనెంతో అభిమానించి, ముచ్చటపడే ఆ గొలుసుకున్న డాలర్లని మంగళసూత్రాలం టారని, అవి వివాహసమయంలో ఆడపిల్ల మెడలో మగపిల్లాడు కడతాడని, అలా కట్టాక ఇంక జీవితాంతం ఆ గొలుసు మెడ లోంచి తీయకూడదని అమ్మ వివరించింది. అయితే అమ్మ చెప్పిన విషయాలేకాక మరెన్నో విషయాలు కూడా నాకా సూత్రాల గురించి తెలుస్తున్నాయి.

అంతేకాదు... పెళ్ళి గురించి కూడా నాకి ప్పుడు ఎన్నో విషయాలు అర్థం అవుతు న్నాయి.

అమ్మ స్వరం మళ్ళీ వినిపించింది. "త్వర గాకానీ, అలా దిక్కులు చూస్తావేం అన్నం తినేటప్పుడు... చూడు టైం ఎంత అయిందో... నీ వలన రోజూ నాన్నగారి క్కూడా లేటవుతోంది"

"మధూ! త్వరగా రావాలి. నిన్ను స్కూలు దగ్గర దింపి వెళ్ళాలంటే నువ్వు త్వరగా తెమలటం నేర్చుకోవాలి" నాన్న కూడా అమ్మతోపాటే నన్ను మందలించారు.

కంచంలో మిగిలిన రెండు ముద్దలు గబ గబా నోట్లో కుక్కేసుకుని, గ్లాసులో నీళ్లతో కంచంలోనే చేయి కడుక్కుని లేచాను.

"ఎన్నిసార్లు చెప్పినా ఈ చెడ్డ అలవాటు మానవు. ఇంకోసారి ఇలా కంచంలో చేయి కడిగితే వాత పెడతాను" అమ్మ కోపంగా అంటోంది. అదేం వినకుండా, బ్యాగ్ భుజాన వేసుకుని "నేను రెడీ నాన్న గారూ..." అన్నాను.

నాన్న నవ్వుతూ "కనీసం తిన్నది గొంతు లోకి దిగాలా వద్దా? వెళ్ళి మంచినీళ్లు తాగిరా" అన్నారు.

"ఊహు... ఒద్దు. స్కూల్లో తాగుతాను"

"ఒకే నిర్మలా... వెళ్లొస్తాం" అన్నారు నాన్న.

"జాగ్రత్తగా వెళ్లండి" అమ్మ గుమ్మందాకా వచ్చింది.

"టాటా..." నాన్న సైకిలుమీద వెనకాల సీటుమీద కూర్చుని చేయి ఊపాను.

అమ్మ కూడా చేయి ఊపింది.

నాన్న సైకిలు పరిగెత్తించారు.

ఇది మా దినచర్య.

మా స్కూలు ఓ మాదిరి కాన్వెంటు. ఇంగ్లీషు మీడియమే. కానీ, మా పక్కింటి రాధావాళ్ళ స్కూలులా ఉండేదికాదు మా స్కూలు. రాధావాళ్ళ స్కూలు మిషనరీ స్కూలు. మాది తెలుగువాళ్ళ స్కూలు... ఫీజులు తక్కువట. అందుకే ఇందులో చేర్పించారు. మా ఊరి పేరు ముక్కిపల్లె... పల్లెంటే పల్లెకాదు. దాదాపు అన్ని సౌక ర్యాలూ ఉన్నాయి. మా ఊళ్లో షుగర్ ఫ్యాక్టరీ ఉంది. నాన్న ఆ ఫ్యాక్టరీలో పనిచే స్తున్నారు. అమ్మ ఇంటి దగ్గర నాకూ, నాతో పాటు మరో నలుగురు అమ్మాయిలకు సాయంకాలం పూట చదువు చెప్తుంది.

మా ఇంట్లో మేం ముగ్గురమే. కొన్నిరో జుల తరవాత తమ్ముడు వస్తాడని చెప్పింది అమ్మ. మా ఇంటికి అమ్మమ్మ, తాతయ్య, మామ్మ, తాతయ్య, మావయ్యలు, అత్తలు, బావలు, బాబాయిలు ఎవరూ వచ్చేవాళ్లు కాదు. మా పక్కింటి శాంతీ వాళ్లింటికి ఎప్పుడూ ఎవరో ఒకళ్లు వస్తుండేవాళ్లు. చుట్టాలతో సందడిగా ఉండేది వాళ్లిల్లు. శాంతీ, నేనూ ఒకే స్కూలు. వారంలో మూడు, నాలుగుసార్లు ఏవేవో కొత్తకొత్త వస్తువులు తీసుకొచ్చి చూపించి మా మావయ్య తెచ్చాడనో, బాబాయి తెచ్చాడనో చెప్తుండేది. వాళ్ల అమ్మమ్మ దానికి బోలె డన్ని సున్నుండలు, జంతికలు, మిఠాయిలు తెచ్చిస్తుండేది. ఓ ప్లాస్టిక్ డబ్బాలో అవి

స్కూలుకి తెచ్చుకుని, మాకెవరికీ పెట్టకుండా చాటుగా తింటూ ఉండేది శాంతి. దాన్ని అలా చూస్తుంటే నాకు అనిపిస్తుండేది నాకెవరూ ఎందుకు లేరు? వాళ్లెవరూ ఇలా నా కోసం బహుమతులు, మిఠాయిలూ ఎందుకు తీసుకురారు? అని.

ఓరోజు అమ్మని అడిగాను. "అమ్మా! మనింటికి తాతయ్యలు, అమ్మమ్మ, మామ్మ ఎందుకు రారు? నాకు మావయ్యలు, బాబాయిలు లేరా? " అని.

అమ్మ కన్నీళ్లు పెట్టుకుంది. "ఇంకెప్పుడూ నన్నలా అడక్కు తల్లీ. అందరూ ఉన్నారు. కానీ నేనే పాపిష్టిదాన్ని. అందర్నీ బాధపెట్టి, అందరికీ దూరం అయ్యాను" అంది.

అమ్మ ఏం చేసింది? ఎందుకు వాళ్ళంతా దూరం అయ్యారు? అని నాకు తెలుసుకోవాలని ఎంతగా అనిపించినా అమ్మ ఏడ్చింది కాబట్టి ఆ సంగతి రెట్టించి అడగలేకపోయాను.

కొన్నాళ్లకి నాకు తమ్ముడు పుట్టాడు. తెల్లగా, ముద్దుగా, బొద్దుగా ఉన్న తమ్ముడిని చూస్తుంటే నాకు స్కూలుకి కూడా వెళ్ళాలనిపించేది కాదు. వాడి పేరు పేరి లక్ష్మయ్య ధర్మతేజ... పెద్ద పేరుని పొట్టిగాచేసి, తేజ అని పిలుస్తారు అమ్మా, నాన్నా... నేను మాత్రం తమ్ముడనే అంటాను.

తమ్ముడికి మూడేళ్ళు వచ్చాయి. నేను ఆరోతరగతిలోకి వచ్చాను. వచ్చే ఏడాది తమ్ముడిని కూడా నాతోపాటు స్కూలుకి తీసికెళ్లచ్చని చెప్పింది అమ్మ. ఏడో తరగతి పబ్లిక్ పరీక్షలని తమ్ముడితో ఆడుకోవడం తగ్గించి బాగా చదువుకోమని చెప్పింది. నాన్న నాకు లెక్కలు, ఇంగ్లీషు కష్టంగా ఉందని నేనంటే మా స్కూలు మాష్టరుగారితో మాట్లాడి ట్యూషను పెట్టించారు. రోజూ స్కూలు అయిపోగానే రెండు గంటలసేపు ట్యూషను చెప్పించుకుని ఇంటికి వెళ్ళాల్సివస్తోంది. రోజంతా తమ్ముడికి దూరంగా ఉండడం, ఇంటికి వచ్చాక మళ్లీ చదువు. ఇలా వాడితో ఆడుకోడానికి నాకు టైమే ఉండడం లేదు.

ఓరోజు నేను ఉదయాన్నే లేచేటప్పటికి నాకు బాగా కడుపునొప్పి మొదలైంది. నొప్పితో మెలికలు తిరుగుతూ గట్టిగా ఏడ్చాను. అంతేకాదు... నాలో ఏదో తెలియని, ఓ అసహ్యాకరమైన మార్పు వచ్చింది. అమ్మ నన్ను దూరంగా కూర్చోబెట్టింది. శాంతీ వాళ్ళమ్మని పిలిచి ఏదో సలహా అడిగింది. ఆవిడ వెళ్లి ఇంకా చాలామంది ఆడవాళ్లను పిలుచుకుని వచ్చారు. నాకు తెలిసీ, మొట్టమొదటిసారిగా మా ఇంటికి చుట్టపక్కలవాళ్ళు వచ్చారు.

వాళ్లందరూ కలిసి నువ్వులు, కొబ్బరి, బెల్లం దంచి ఉండలుగా చేసి నాకు పెట్టారు. అమ్మ ఒళ్లంతా పసుపు రాసుకోమని నాకు పసుపిచ్చి, లంగా, ఓణీ ఇచ్చి వేసుకోమంది. తెల్లటి దుప్పటి పరిచి, నాలుగువైపులా తమలపాకులు, వక్కలు పెట్టి హారతిచ్చి, పాటలు పాడి ఏదో హడావుడి చేశారు. ఓ పక్క కడుపునొప్పితో నేనేడుస్తుంటే వాళ్ళలా నవ్వుతూ, కబుర్లు చెప్పుకుంటూ సంబరం చేసుకోవడం నాకసలు నచ్చలేదు. అమ్మమీద బాగా కోపం వచ్చింది. శాంతీ వాళ్ళమ్మ నా వైపు నవ్వుతూ చూసి అంది "నిర్మలా నీ కూతురిక పెళ్ళికి ఎదిగింది. జాగ్రత్త సుమా..."

పెళ్లి అన్నమాట వినగానే నా కళ్లముందు మళ్ళీ గొలుసు, దానికి వేళ్లాడే రెండు సూత్రాలు కదిలాయి. అక్కడ ఉన్న అందరాడవాళ్ళ మెడల్లోనూ అదే రకం గొలుసు, అవే సూత్రాలు, అచ్చు అలాగే ఊగుతూ కనిపించి నా కడుపునొప్పి ఇట్టే మాయం అయినట్టు అనిపించింది. నాకు అమ్మ పెళ్లి చేస్తే ఆ గొలుసు వేసుకోవచ్చునన్న ఊహ నాకెంతో సంతోషాన్నిచ్చింది.

అలా ఆ మూల నన్ను పదకొండురోజులు కూర్చోబెట్టారు. ఆ పదకొండురోజులు పెసరపప్పు కలిపిన బియ్యంతో అన్నం వండి,





అందులో బెల్లం వేసి తినమన్నారు. తినలేకపోయాను. బోలెడన్ని స్వీట్లు కూడా పెట్టారు కానీ తినలేకపోయాను.

ఎలాగైతేనేం మొత్తానికి నాకు స్నానం చేయించారు. కొత్త పరికిణీ కొంది అమ్మ. దానిమీద తెల్ల ఓణీ వేసింది.

సాయంత్రం చుట్టుపక్కల ఆడవాళ్లంతా పేరంటానికి వచ్చారు.

వస్తూనే నా బుగ్గలు చిదిమి "ఏవే అప్పుడే పెద్దదానివయ్యావా" అంటూ ఏదేదో మాట్లాడసాగారు. అమ్మ చాపపరిచి అందర్నీ కూర్చోబెట్టింది. కుర్చీమీద తెల్ల ధోవతి కప్పి, నాకు పూల జడవేసి, తయారుచేసి ఆ కుర్చీలో కూర్చోబెట్టారు.

"బంధువులెవరూ రాలేదా నిర్మలా" అడిగింది గీతా వాళ్ళమ్మ. ఆవిడ పేరు కాత్యాయని.

అమ్మ సమాధానం చెప్పకుండా లోపలికెళ్ళి రోలూ, రోకలీ తెచ్చింది.

"అదిసరే నిర్మలా... అమ్మమ్మకానీ, బామ్మకానీ రాలేదేం! పిల్ల పెద్దమనిషైతే వాళ్ళు రాకపోవడం ఏంటి? అసలు బట్టలు అమ్మమ్మ తేవాలిగా" అంది రాధా వాళ్లమ్మ. ఆవిడ పేరు పార్వతి.

అమ్మ బలవంతంగా నవ్వుతూ అంది. "వాళ్లు రాలేకపోయారు. డబ్బులు పంపించారు"

"అలాగా... అయినా నువ్వు ఈ ఊరొచ్చి మూడేళ్లయింది. ఒక్కసారన్నా వాళ్లు రావడం, మీరు వెళ్ళడం జరగలేదేం. కొంపతీసి వాళ్ళందర్నీ కాదని మీరిద్దరూ లేచిపోయి వచ్చారా ఏం?"

శాంతీ వాళ్ళమ్మగారు కల్పించుకుని అన్నారు. "ఈ రోజుల్లో పిల్లల ఆలోచనలతో, పెద్దల ఆలోచనలు కలవడంలేదులే పార్వతీ! అయినా పెద్దవాళ్ళకి పంతాలు, పట్టింపులూ కానీ, పెళ్ళిచేసుకుని నూరేళ్లూ కలిసి బతకాల్సినవాళ్ళ ఇష్టాఇష్టాలు గమనించకపోతే ఎట్లా? అయినా ఇప్పుడవన్నీ ఎందుకు? జరగాల్సిన వేడుక చూడండి" అంటూ నువ్వులు దంచడం ప్రారంభించింది. దాన్ని చిమ్మిలి అంటారుట.

చిమ్మిలి దంచుతూ వాళ్ళంతా ఏవో పాటలు పాడారు. అమ్మ నా ఓణీలో చిమ్మిలి ఉండలు, మిఠాయి ఉండలు పెట్టింది.

ఎవరూ చూడకుండా అమ్మ మధ్యమధ్య కళ్లు తుడుచుకుంటూ, బలవంతంగా నవ్వుతూ తిరుగుతోంది. అదేం గమనించని ఆడవాళ్లంతా నా దగ్గరకు వచ్చి నాకు హారతులిచ్చి, స్వీట్సు, జాకెట్టు గుడ్డలు ఇచ్చారు. కొందరు స్టీలు గ్లాసులిచ్చారు. వాళ్లంతా నా చుట్టూ నిలబడి బొట్లు పెట్టి, పసుపులు పూసి, అక్షింతలు వేసి ఆశీర్వదిస్తుంటే నా దృష్టి వాళ్ళ మెడలో ఉన్న గొలుసుమీదే ఉంది. అందరిమెడల్లో ఆ గొలుసు, అమ్మ మెడలో ఉండే గొలుసు. దానికి వేళ్ళాడుతున్న రెండు సూత్రాలు. కనీసం ఆ గొలుసు నాకు ఇప్పుడన్నా వేయచ్చుగా అనిపించింది. నా పక్కకొచ్చి, జడలో పూలు సరిచేస్తున్న అమ్మ చేయి అందుకుని, రహస్యంగా అడిగాను. "అమ్మా! ఇప్పుడన్నా ఆ గొలుసు నాకు ఒక్కసారి వేయవచ్చుగా"

"నీ తలకాయ, నోరు మూసుకో" అంటూ నా నెత్తిమీద మొట్టింది.

"ఏంటిట..." ఆడవాళ్ళంతా అడిగారు.

అమ్మ నవ్వింది ఏం మాట్లాడలేదు.

మా పక్కింటి అత్తయ్యగారు అమ్మని రెట్టించింది. "ఏవిటమ్మా నిర్మలా... ఏమంటోంది నీ కూతురు? ఏం కావాలట"

అమ్మ నవ్వుతూ "దానికి పిచ్చి ఈ మంగళసూత్రం పిచ్చి" అన్నది.

వాళ్ళంతా ముక్కుమీద వేలేసుకుని "ఓసినీ! నీకప్పుడే పెళ్ళిమీద మక్కువైందిటే... నీ ఇల్లు బంగారం కానూ... అదెంతసేపు? చూస్తుండగానే పెళ్లి అవుతుంది. పిల్లలూ పుడతారు. చేస్తాంలే తొందరపడకు" అన్నారు.

నాకు సిగ్గేసింది. ఛీ, ఛీ పిల్లలు పుట్టడం

ఏంటి? పిల్లలు పెద్దవాళ్ళకు పుడతారు. నాకు ఆ గొలుసు ఇస్తే చాలు అనుకున్నాను. పైకి మాత్రం ఏం అనలేదు.

అందరికీ అమ్మ స్వీటు, మిక్చర్ పెట్టింది. అందరూ వెళ్ళిపోయారు. ఇంట్లో బోలెడన్ని స్వీటు పాకెట్లున్నాయి. తమ్ముడు అదేపనిగా తినేస్తున్నాడు. నాకు మాత్రం సయించలేదు.

ఆ తరువాతనుంచి నన్ను అందరూ కొత్త దానిలా చూడసాగారు. అమ్మ నాకు గౌన్లు కుట్టించడం మానేసింది. పరికిణీలు, పంజాబీ డ్రెస్‌లు కుట్టించింది. నాకు మొత్తం నాలుగు జతల బట్టలున్నాయి. అందులో రెండు పంజాబీ డ్రెస్‌లూ, రెండు పరికిణీలు... గౌన్లు పాతబడ్డాయి. అవి ఇంట్లో ఉన్నప్పుడు వేసుకోమంది అమ్మ.



★ ★ ★

అది వేసవి కాలం.

మా పరీక్షలైపోయాయి. స్కూళ్ళకు సెలవులిచ్చారు. నా స్నేహితురాళ్లంతా సెలవులకి వాళ్ళ తాతగారి ఊరు వెళ్తున్నామని చెప్పి వెళ్ళిపోయారు.

ఈమధ్య అప్పుడప్పుడు చుట్టుపక్కల వాళ్ళు అమ్మని పలకరిస్తున్నారు. అమ్మ మాత్రం వాళ్లడిగిన ప్రశ్నకి క్లుప్తంగా సమాధానం చెప్పి ఇంట్లోకి వచ్చేస్తుంది.

ఆరోజు గీతావాళ్ళక్క పెళ్లి. వాళ్ళు మాక్కూడా శుభలేఖ ఇచ్చారు.

శాంతీ వాళ్లింట్లో అందరూ పెళ్ళికి వెళ్తున్నారు. నాకూ వెళ్ళాలనిపించింది. అమ్మతో అన్నాను. "అమ్మా మనమూ పెళ్లికి వెళ్దామే"

అమ్మ మౌనంగా ఉండి తరవాత అంది. "పెళ్లికి వెళ్లాలంటే మంచి చీర కూడా లేదు ఎలా వెళ్తాను? పైగా వెళ్ళిన దగ్గర్నించీ వాళ్లందరి ఆరాలు భరించలేను"

"నేను వెళ్తానే" అన్నాను.

"ఒక్కదానివే వెళ్తావా? " అడిగింది అమ్మ.

"శాంతీ వాళ్లింట్లో అందరూ వెడుతున్నారుగా... నేనూ వాళ్లతో వెడతాను"

"సరే నీ ఇష్టం. తయారవు" అంటూ అమ్మ నాకు పెద్దమనిషి అయినప్పుడు కొన్న పట్టుపరికిణీ తీసిచ్చింది.

అది కట్టుకుని, గిల్టు గొలుసు వేసుకుని, శాంతీ వాళ్లతో కలిసి పెళ్లికి వెళ్లాను.

షామియానా కట్టి, బోలెడన్ని కుర్చీలు వేశారు. కొబ్బరిమట్టలతో కళ్యాణమంటపం కట్టారు. శాంతి వాళ్లక్కకి పూలజడ వేసి, పట్టుచీర కట్టారు. తిలకంతో కల్యాణం బొట్టు, కళ్లకు కాటుక, బుగ్గమీద నల్ల చుక్క, చేతులనిండా గాజులు, కాళ్లకు పారాణితో వాళ్లక్క ఎంతో అందంగా ఉంది. వాళ్లక్క మెళ్లో బోలెడన్ని నగలున్నాయి. మంగళసూత్రం కోసం చూశాను. కనిపించలేదు.

శాంతిని రహస్యంగా అడిగాను. "శాంతీ! మంగళసూత్రం లేదేం అక్కకి"

శాంతి నావైపు వెర్రిదాన్ని చూస్తున్నట్టుగా చూసింది. "అప్పుడే కడతారా? పందిట్లోకి వెళ్ళాక సన్నాయి మోగేటప్పుడు బ్రాహ్మణుడు మంత్రాలు చదివేటప్పుడు కడతారు" అంది.

"అలాగా!" అనుకున్నాను.

"తరవాత కాస్సేపటికి మంజరి అక్కని గంపలో కూర్చోబెట్టి, పందిట్లోకి తీసికెళ్ళారు. పెళ్లికొడుక్కీ, అక్కకీ మధ్యలో తెల్లటి బట్టను అడ్డంగా పట్టుకున్నారు. ఆ బట్ట కిందనుంచి అక్కా, పెళ్ళికొడుకూ తలమీద ఏంటో పెట్టుకున్నారు. దాన్ని జీలకర్రా, బెల్లం అంటారుట. తరవాత ఆ బట్ట తీసేశారు. ఇంకేవో తంతులు జరుగుతున్నాయి. బ్రాహ్మడు మంత్రాలు చదువుతున్నాడు. కాస్సేపటికి పెళ్ళికొడుకు లేచి, అక్క మెడలో మంగళ సూత్రం కట్టాడు. ఆ దృశ్యాన్ని రెప్పవేయకుండా చూస్తూ ఉండిపోయాను. రెండు సార్లు పసుపు రాసిన రెండు దారాలకు విడి విడిగా కట్టిన తాళిబొట్లను మంజరి అక్క మెడలో కట్టి మూడు ముళ్లు వేసిన ఆ దృశ్యం చెరిగిపోనంత గాఢంగా నా మనసులో ముద్రవేసింది. పెద్దవాళ్లంతా వాళ్ల మీద అక్షింతలు వేశారు. పూలరేకుల్లా రాలి పడుతోన్న ఆ అక్షింతలు కొన్ని నా తలమీద కూడా పడ్డాయి. వాటి స్పర్శ నాలో ఏవో చిత్రమైన అనుభూతులను కలగచేసింది. ఆ తరవాత వాళ్ళిద్దరూ బోలెడన్ని తలంబ్రాలు పోటీపడి పోసుకున్నారు. ఏం జరిగినా నా కళ్లముందు పెళ్లికొడుకు వంగి, అక్కమెడలో మంగళసూత్రం కట్టిన దృశ్యం మాత్రం పదిలంగా, మధురంగా నిలిచిపోయింది.

సాయంత్రానికి అందరం భోజనాలు చేసి ఇళ్లకు మళ్లాం... ఇంటికి వచ్చాక అమ్మతో జరిగిన సంగతంతా చెప్పాను. మంగళ సూత్రం కట్టిన ఆ మధురమైన సంఘటన వర్ణించి చెప్పాను. అమ్మ నావైపు విచిత్రంగా చూసింది. "నీకెందుకే అదంటే అంత ఇష్టం. అది కట్టుకోవడంతో అయిపోదు. దాన్ని నిలబెట్టుకోవడానికి ఎంత సహనం కావాలో తెలుసా! యుక్తవయసు వచ్చిన ఆడపిల్లకు భవిష్యజ్జీవితంలో రక్షణనీ, గౌరవాన్నీ ఇస్తుంది. పదిమందిలో గుర్తింపునిస్తుంది. స్థిరమైన చక్కటి సంసారాన్ని ఇస్తుంది. దాంతోపాటే ఎన్నో బాధ్యతలను కూడా ఇస్తుంది. అది అలంకారంగా వేసుకునేది కాదు. దాన్ని మంగళసూత్రం అంటారు" అంది అమ్మ.

అలాగా! అంత గొప్పదనం ఉందా ఆ మంగళసూత్రంలో అనుకున్నాను.

సెలవులిచ్చిన వారం రోజులకి శాంతీవాళ్లు కూడా వాళ్ల తాతగారి ఊరు వెళ్ళిపోయారు. గీత వాళ్లక్కతోపాటు మూడు నిద్రలకు వెళ్ళింది.

నేను ఇంట్లో ఉండిపోయాను తమ్ముడితో ఆడుకోవడం తప్ప వేరే కాలక్షేపం లేక, నాకు చాలా విసుగ్గా ఉంది. కానీ ఏం చేయను? ఆరోజు తమ్ముడు, నేను మధ్యాహ్నం అన్నం తిని వరండాలో కూర్చుని ఆడుకుంటున్నాం. నాకు వాడితో ఆడుకోవడం విసుగ్గా అనిపించింది. వాడికే ఆటా చేతకాదు. ఎంతసేపటికీ గోలీలు తీసుకొచ్చి ఆడమంటాడు. నాకేం వస్తుంది గోలీలాట. అయినా నాకు ఆ ఆటంటే ఇష్టం కూడా లేదు. శాంతి ఉండి ఉంటే మేమిద్దరం పచ్చీసన్నా, వైకుంఠపాళి అన్నా ఆడుకునేవాళ్ళం.

శాంతి వాళ్ల తాతగారి ఊరు కాకినాడ అని చెప్పింది. కాకినాడంటే ఎక్కడుందో, ఎంత దూరమో! రైలులో వెళ్లాలిట. రైలు... నేను పుట్టాక ఒక్కసారి కూడా రైలెక్కలేదు. మా ఇంటికి స్టేషన్ దగ్గర. అప్పుడప్పుడు నాకు రైలు శబ్దం వినిపిస్తూ ఉంటుంది. అలా వినిపించినప్పుడల్లా నాకు ఊరెళ్లాలని పిస్తుంది. కానీ ఎలా వెళ్తాం? మాకు ఊరికి వెళ్ళాలంటే ఎవరూ లేరు.

ఎవరూ లేకపోతే ఏం? ఏదో ఒక ఊరు వెళితే బాగుండు. ఎలాగన్నా నాక్కూడా ఏదన్నా ఊరు వెళ్లాలనిపించింది. ఎప్పుడు చూసినా ఇక్కడే అమ్మా వాళ్ళ దగ్గరే ఉండాలి. ఎన్నో సెలవులొచ్చాయి. నన్నెప్పుడూ అమ్మా, నాన్నా ఏ ఊరూ తీసికెళ్ల లేదు. ఈసారన్నా వెళ్ళాలి. నాకేం తోచటం లేదు. నిద్రలేవడం, చద్దన్నం తినడం, స్నానం చేయడం, అమ్మ ఏదన్నా పనిచెబితే






# స్పైడర్ రోబోట్

అమెరికాలోని 'నాసా' రోదసి ప్రయోగశాలలో అద్భుతమైన ఓ సాధనానికి రూపకల్పన చేశారు. దానిపేరు 'స్పైడర్ రోబోట్'. ప్లానెట్స్, కోమెట్స్, ఆస్టరాయిడ్‌ల పరిశోధనకు ఈ సాలీడు గొప్పగా ఉపయోగపడుతుంది. అది చంద్రునిపై గల మట్టిని చంద్రమండలం నుంచి తీసుకురాగలదు.

ఇది అప్పుడే చంద్రమండలనుంచి మట్టిని తెచ్చి శాస్త్రజ్ఞులకు అందచేసింది. ఈ రోబోట్‌కు 6 కాళ్ళు ఉన్నాయి. యాంటినాలు అమర్చబడ్డాయి. ఇది ఎదుర్కొనే అవరోధాలను ఆ యాంటినాలు తొలగిస్తాయి. దానికి అమర్చబడిన అనేక కెమేరాలు రోదసిలోని పరిసర ప్రాంతాలను చక్కగా చిత్రీకరించి తమలో భద్రపరుస్తాయి.

చేయడం, వరండాలో గచ్చకాయలాడు కుంటూ వీధివైపు చూస్తూ గడపడం.

"రాధా వాళ్లు తిరుపతి వెళ్ళారు. నన్ను కనీసం తిరుపతన్నా తీసుకెళ్లవచ్చుగా అమ్మా వాళ్ళు అనిపించింది. నాకు ఏదన్నా ఊరు వెళ్ళాలన్న కోరిక మెల్లిగా ప్రారంభమై రెండు రోజులకి బాగా తీవ్రం అయింది. ఎలాగైనా ఊరెళ్లాలి. ఏదో ఒక ఊరెళ్లాలి అని నిర్ణయించుకున్నాను. "అమ్మా" గట్టిగా పిలిచాను.

అమ్మ మధ్యాహ్నం భోజనాలయ్యాక చాపేసుకుని, తలకింద ఎత్తుగా దిండు పెట్టుకుని పడుకుని, పుస్తకం చదువు కుంటూ ఉంటుంది. ఆరోజు కూడా అలాగే పడుకుంది.

నేను గావుకేక పెట్టేటప్పటికి "ఏవిటే ఏమైంది" అంటూ ఉలిక్కిపడి లేచింది అమ్మ.

నేను పరిగెత్తుకుంటూ అమ్మ దగ్గరికి వెళ్లి, అమ్మ పక్కన చతికిలపడి అడిగాను. "మనంకూడా ఊరెడదాం"

"ఏ ఊరు?" అమ్మ అయోమయంగా అడిగింది.

"తాతగారి ఊరు..."

అమ్మ కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. ఏం మాట్లాడుకుండా చీరచెంగుతో కళ్లు తుడుచుకుని అంది. "వెళ్లు... వెళ్ళి ఆడుకో తమ్ముడేం చేస్తున్నాడు? ఆడించు వాడిని కూడా"

"నేనేం ఆడించను. నాకు బోర్ కొడు తోంది. నా ఫ్రెండ్స్ అంతా ఊరెళ్ళారు. నేనూ వెళ్ళాలి. వెడదామమ్మా" అన్నాను గారంగా.

అమ్మ నావైపు జాలిగా చూసింది. "ఏ ఊరు వెళ్దాం తల్లీ. మనకెవరున్నారు? ఎవరూ లేరు"

"ఎందుకు లేరు. తాతయ్యా వాళ్లున్నా రుగా. వెడదాం"

"నాకంత అదృష్టం లేదే... విసిగించ కుండా వెళ్ళి ఆడుకోమ్మా"

"ఏం? ఎందుకు లేదు. అయినా తాతగా రింటికి వెళ్ళడానికి, అదృష్టానికీ సంబంధం ఏవిటి?"

"ఊరెళ్ళాలంటే డబ్బులు కావాలి. నాన్న గారి దగ్గర ఇప్పుడు డబ్బులు లేవు"

"నాకు తెలియదు. ఊరెళ్లాలంతే..." మొండిగా అంటూ ఏడవడం మొదలుపె ట్టాను. అమ్మ ఒక్క నిమిషం నావంక నిస్స హాయంగాచూసి, లాగిపెట్టి చెంపమీద కొట్టింది. "చంపేస్తాను. వెధవ్వేషాలేయకు. వెళ్లు... వెళ్లి ఆడుకో... రాను, రాను మొండి దానిలా తయారవుతున్నావు. సిగ్గులేదూ... పెద్దదానివయావు, అణకువగా ఉండాలి"

"పెద్దదాన్ని అయ్యానా?" నేను క్షణం కూడా ఆక్కుండా అన్నాను, "అయితే నాకు పెళ్లిచేయి. అప్పుడు వెళ్లచ్చుగా ఊరికి"

అమ్మ తెల్లబోయి చూసింది. "పెళ్లా... నీకేం పిచ్చిపట్టిందా? నువ్విట్లా తయార యావేంటి?" అంది.

"ఏం? నాకేమైంది? పెళ్లిచేయరు, ఊరికి తీసుకువెళ్లరు...ఎప్పుడూ ఇంట్లోనే ఉండాలా? నాకు బోర్ కొడుతోంది. మీరు తీసికెళ్లకపోతే నేనొక్కదాన్నే వెడతాను. తాతగారి అడ్రస్ ఇవ్వు... వెతుక్కుంటూ వెడతాను"

అమ్మ విసురుగాలేచి, నారెక్కపుచ్చుకుని లాగి, ఆ చెంపా, ఈచెంపా వాయించింది. రౌద్రంగా నావైపు చూస్తూ బర బరా ఈడ్చు కెళ్లి ఓ మూల కూలేసి, "నోరు మూసుకుని ఇక్కడ కూర్చో... చంపేస్తాను అతిగా వాగా వంటే...రాస్కెల్" అంటూ తిరిగి అవతలికి వెళ్లిపోయింది. ఏమనుకుందో చదువుతున్న పుస్తకం మూసి, చాపచుట్టి మూలకి పెట్టి, దిండు కూడా తీసేసింది. మౌనంగా పాత బడిన ఇనపకుర్చీలో కూర్చుని తల టేబుల్ మీద పెట్టుకుంది.

అమ్మ కొట్టిన దెబ్బలకి నాకు ఏడుపు రాలేదు. ఊరెళ్లాలన్న పంతం హెచ్చింది.



అమ్మకి చెప్పకుండా వెళ్లాలి అనుకున్నాను. అమ్మవైపే తదేకంగా చూస్తూ కూర్చు న్నాను. కొన్ని క్షణాల తరువాత అర్థమైంది. అమ్మ ఏడుస్తోంది. కుమిలి కుమిలి ఏడు స్తోంది. భుజాలు ఎగిరిపడుతున్నాయి. సన్నగా వెక్కిళ్లు వినిపిస్తున్నాయి.

నేను అలాగే నిశ్చేష్టురాలినై చూస్తూ కూర్చుండిపోయాను. అమ్మ ఎందుకు ఏడు స్తోందో నాకర్థం కాలేదు. బొమ్మలా కదల కుండా అలాగే చూస్తూ కూర్చున్నాను. అలా ఎంతసేపు గడిచిందో తెలియదు. బైట సైకిల్ శబ్దం వినిపించింది. నాన్న వచ్చారు. నేను రివ్వున కూర్చున్న చోటు నుంచి లేచి బైటకి పరిగెత్తాను. సైకిల్ స్టాండ్‌వేసి లోపలికి వస్తోన్న నాన్న దగ్గరకు పరిగెత్తుకెళ్లి ఏడుస్తూ అన్నాను "నాన్నా అమ్మ ఏడుస్తోంది"

నాన్న ఖంగారుగా చూశారు "ఎందుకు? ఏమైంది? "

"అమ్మ నన్ను కొట్టి తనేడుస్తోంది"

"నిన్ను కొట్టిందా? ఎందుకురా? ఏం చేశావు? " నాన్న నన్ను దగ్గరగా తీసుకుని నా కళ్లు తుడుస్తూ అడిగారు.

నేనేం మాట్లాడలేదు. నాన్న అలా ఓదా ర్చుస్తుంటే నాకు బాగా దుఃఖం వచ్చింది. అప్పటిదాకా అమ్మ నన్ను కొట్టినందుకు, ఊరికి తీసికెళ్లనందుకు కోపంగా ఉన్నా నేమో, నాన్న ఓదార్పుతో నా కోపం దుఃఖంగా మారింది.

నాన్న నన్ను తన దగ్గరగా పొదువుకుని అమ్మ దగ్గరకి నడిచారు. అమ్మ ఏడుస్తూ ఏడుస్తూ అలాగే ఆ టేబుల్ మీద ఒరిగి పోయి నిద్రపోతోంది. నాన్న చాలా సున్ని తంగా అమ్మ భుజం మీద చేయివేసి ఎంతో ప్రేమగా, మృదువుగా "నిర్మలా" అని పిలి చారు.

అమ్మ ఉలిక్కిపడి లేచింది. "మీరా? ఎంతసేపైంది వచ్చి? " అడిగింది చీర చెంగుతో చెంపలమీద, కళ్లపక్కన కట్టిన కన్నీటి చారికల్ని తుడుచుకుంటూ.

"ఇప్పుడే వస్తున్నాగానీ ఏంటి? ఏమైంది? మధుని ఎందుకు కొట్టావు? "

అమ్మ ఏం మాట్లాడకుండా వంటగదివైపు వెళ్లి గ్లాసుతో మంచినీళ్లు తీసుకొచ్చి నాన్న కిస్తూ అంది "కాళ్లు కడుక్కోండి కాఫీ ఇస్తాను"

నాన్న గ్లాసందుకుని మంచినీళ్లు తాగి "బాబేడీ" అని అడిగారు.

నేను ఉలిక్కిపడ్డాను. నా దుఃఖంలో, నా కోపంలో నేను తమ్ముడి సంగతే పట్టించుకో లేదు. "వాడేడీ? " అమ్మ కూడా ఖంగారుగా చూస్తూ "బాబూ తేజా" అని పిలిచింది.

నేను పరిగెత్తుకుంటూ వరండాలోకి వెళ్లాను. వరండాలో బోర్లాపడుకుని నిద్రపో తున్నాడు. వాడి చుట్టూ గోలీలు పడి ఉన్నాయి. పాపం! వాడొక్కడే గోలీలతో ఆడుకుని పడుకుని నిద్రపోయాడు. నాకు జాలేసింది. నా వెనకాలే వచ్చిన అమ్మ వాడి దగ్గరకి వెళ్లి ఒంగి వాడినెత్తుకుని గదిలోకి నడుస్తూ కోపంగా నావైపు చూస్తూ అంది "పసివెధవ! చూడు ఎలా గచ్చుమీద పడి నిద్రపోతున్నాడో. నీకు బాగా దెబ్బలు పడాల్లే. గారం ఎక్కువైంది"

నేను బిక్కమొహంతో నాన్నకేసి చూశాను.

"ఏం జరిగింది నిర్మలా! ఇవాళ మీ ఇద్ద రికీ ఏమైంది? " నాన్న అమ్మ వెనకాలే నడుస్తూ అడిగారు. అమ్మ తమ్ముడిని నవారు మంచం మీద పడుకోబెట్టి నాన్న వైపు తిరిగింది.

"మీ కూతురికి కోరికలు ఎక్కువైపోతు న్నాయి"

నాన్న నా వైపు చూశారు అవునా అన్నట్టు.

నేను దుఃఖం ఆపుకుంటూ రోషంగా అన్నాను. "ఊరికి వెడదాం అన్నాను నాన్నా. తప్పా! నాక్కూడా శాంతిలాగా, గీత లాగా సెలవులకి తాతగారి ఊరెళ్లాలని అని





పించదా? "

అమ్మానాన్న ఒకరి మొహం ఒకళ్లు చూసుకున్నారు. అమ్మ వంటగదిలోకి వెళ్లిపోయింది.

నాన్న నన్ను దగ్గరగా తీసుకుని సన్నగా నిట్టూరుస్తూ అన్నారు "మనం అక్కడికి వెళ్లలేం తల్లీ. ఇంకేదన్నా ఊరు వెడదాంలే! నాలుగు రోజులాగు. జీతాలొచ్చాక వెడదాం"

తాతగారి ఊరు ఎందుకు వెళ్లలేమో తెలుసుకోవాలని ఉన్నా "ఇంకేదన్నా ఊరు వెడదాం" అని నాన్న చెప్పడంతో నాకు సంతోషం వేసింది. అప్పటికి దుఃఖం మర్చిపోయి హుషారుగా అడిగాను. "రైల్లో వెళ్దామా నాన్నా!"

నాన్న నవ్వారు. "నీకు రైలెక్కాలని ఉందా? "

అవునన్నట్టు గబగబా తలూపాను.

"అలాగే, తప్పకుండా రైలెక్కుదాం సరేనా? "

"తిరుపతి వెడదాం నాన్నా"

నాన్న మొహంలో మళ్లీ కళ తప్పింది. నీరసంగా అన్నారు "అలాగే వెంకటేశ్వరస్వామిని దర్శించుకుందాం"

నేను ఉత్సాహంగా అక్కడినుంచి వరండాలోకి వెళ్లిపోయాను. వరండాలో కుడిపక్క ఒక స్థంభం, ఎడంపక్క ఒక స్థంభం ఉంటాయి. ఆ రెండింటికీ ఆనుకుని కొంచెం వెడల్పాటి సిమెంటు అరుగు ఉంటుంది. ఆ స్థంభాలకి రెంటికీ కలిపి అమ్మ ఒక తీగ కట్టింది. ఆ తీగ ఆకులు వెడల్పుగా ఉంటాయి. దాన్ని మనీప్లాంట్ అంటారని చెప్పింది అమ్మ ఒకసారి. ఆ తీగ అలా ఉంటే మా చిన్న ఇల్లు ఎంతో అందంగా ఉంటుంది. గేటుకీ, వరండాకి మధ్య కొంచెం ఖాళీ స్థలం ఉంటుంది. ఆ ఖాళీ స్థలంలో ఎడంపక్క నుయ్యి, కుడిపక్క కనకాంబరం, గులాబీ, నక్షత్ర చామంతి మొక్కలుంటాయి. మా ఇల్లు బైటినుంచి చూసేవాళ్లకి పొదరిల్లులా అనిపిస్తుందిట. గీతవాళ్లమ్మ అంది మొన్న "చక్కటి పొదరిల్లమ్మా మీది. చవకగా కొట్టేశారు. పేరుకి పల్లెటూరేగానీ అద్దెలు ఏం తక్కువున్నాయి? అనంతలక్ష్మిగారు మంచావిడ కాబట్టి, ఇంత చవకలో ఇచ్చారీ ఇల్లు"

శాంతివాళ్ల నాన్నగారు, మా నాన్న మంచి స్నేహితులు. ఆ ఇంట్లో మేముంటున్నందుకు నాన్న నెలకి ఐదు వందలు శాంతివాళ్ల నాన్నగారికి ఇస్తుంటారు.

నాకు మా ఇల్లంటే ఇష్టమేకానీ ఎప్పుడూ అక్కడే ఉండాలంటే నాకు చాలా బోర్‌గా అనిపిస్తుంటుంది. అప్పుడప్పుడు కొన్ని రోజులు ఊరు వెళ్లి వస్తే మళ్లీ మా ఇల్లు కొత్తగా ఉంటుందిగా అనిపిస్తుంది. ఏదిఏమైనా నాన్నతో ఊరెళ్లడానికి ఒప్పించాను. నాకు చాలా సంతోషంగా ఉంది. శాంతికి, గీతకి నేనూ ఊరు వెళ్తున్నానని చెప్పాలనిపించింది. గిరగిరా తిరగాలనిపించింది. చివ్వున రెండు చేతులూ బార్లాచాపి గుండ్రంగా తిరగబోతూ చటుక్కున ఆగిపోయాను. లోపలినుంచి అమ్మ వెక్కిళ్లు వినిపిస్తున్నాయి. అమ్మని ఓదారుస్తున్న నాన్న స్వరం కూడా వినిపిస్తోంది. అమ్మ మళ్లీ ఎందుకేడుస్తోంది? నాన్న నన్ను ఊరు తీసికెడతానన్నందుకా? ఆగిపోయాను.

"ఊరుకో నిర్మలా! చిన్నపిల్ల దానికేం తెలుసు మన సమస్యలు. అయినా మన పెళ్లయ్యి పదేళ్లు దాటాయి. పంతాలూ, పట్టింపులూ ఇంకా ఉంటాయా చెప్పు. వాళ్లు కూడా పెద్దవాళ్లయ్యారు. కొంచెమన్నా కన్సిడరేషన్ ఉండదా? తప్పకుండా ఉంటుంది. వెడదాం. ఒక్కసారి వెళ్లి పిల్లలిద్దర్నీ చూపించి వద్దాం. అంతగా అవమానిస్తే భరిద్దాం. ఆదరిస్తే సంతోషిద్దాం. దీనికోసం దాన్ని కొట్టి నువ్వేడిచి ఎందుకు ఇంత రాద్ధాంతం చేయడం? "

"ఆc ఆc ఆదరించారుగా అదే ఊళ్లో ఏడేళ్లు ఉన్నాం. అవమానాలు భరిస్తూ, ఆకలిని భరిస్తూ ఎప్పటికైనా కోపం పోతుం

దని, ఆదరిస్తారని ఆశపడి. ఏమైంది? మధు పుట్టాక పిల్లని చూపించాలని తీసికెడితే ఏం చేశారు మా నాన్నగారు? మెడ పట్టుకుని బైటకి గెంటారు"

"వయసు పెరిగిన కొద్దీ, కోపం ఆవేశం కూడా తగ్గుతాయి నిర్మలా! ఈసారి తప్పకుండా ఆదరిస్తారు చూడు"

"ఏమో నాకు నమ్మకంలేదు. నాన్న పట్టుదల మనిషి. పైగా ఆయన చాదస్తం కూడా తెలుసు. వయసుతోపాటు చాదస్తం పెరుగుతుందిగానీ తరగదు. మిమ్మల్ని కులం పేరుతో అవమానిస్తే నేను సహించలేను. అన్నయ్యకూడా మూర్ఖుడు. మీకు తెలియందేముంది? పైగా ఇప్పుడు ఆ ఇంట్లో మరో వ్యక్తి ఉంటుంది మా వదిన. ఆవిడ జమీందారీ కుటుంబం నుంచి వచ్చింది. నేనూ, నా పిల్లలూ ఆవిడ కంటికి కనిపిస్తామా?

"ఇవన్నీ నువ్వు ఊహించుకుంటున్నావేమో వాళ్లు మారారేమో"

"ఏమో నాకు నమ్మకంలేదు" స్థిరంగా పలికింది అమ్మ స్వరం.

"పోనీ మా ఇంటికి వెడదాం మా నాన్న తప్పక మారి వుంటాడు."

అమ్మ ఆలోచిస్తూ అంది "నిజమే, మా నాన్నకి భయపడి కానీ పాపం ఆయనకేం అభ్యంతరం మనల్ని రానివ్వడానికి! ఇప్పుడాయన ఎన్ని ఇబ్బందుల్లో ఉన్నారో పాపం. ఒక్కసారి వెళ్లి ఆయన్ని చూసి మన దగ్గరకి తీసుకొచ్చేద్దాం పదండి. అన్నట్లు ఆయన ఇప్పుడు ఆ ఊళ్లో లేరుటగా! ఎక్కడున్నారో తెలుసా"

"తిరుమలలో ఉండి ఉంటారు. హోటల్ అక్కడేగా పెట్టింది. అడ్రస్‌దేం ఉంది. అక్కడికెళ్లాక అదే తెలుస్తుంది. వెళ్లి స్వామిని దర్శించుకున్నట్టు ఉంటుంది, నాన్నగారిని కలిసినట్టూ ఉంటుంది"

"అలాగే మీరన్నదే బాగుంది"

"హమ్మయ్య. ఇంక ఆ ఏడుపు మొహం కడుక్కుని చక్కగా, నీ సహజమైన, అందమైన నవ్వుతో రా! అలా పిల్లల్ని తీసుకుని సినిమాకి వెడదాం. కొత్త సినిమా వచ్చింది"

సినిమా మాట వినగానే నాలో హుషారు వచ్చింది. పరుగెత్తుకుంటూ పెరట్లోకి వెళ్లిపోయాను మొహం కడుక్కుని తయారవడానికి.

నేను తయారై తమ్ముణ్ణి లేపి తయారు చేశాను. అమ్మ మా అందరికీ అటుకులు పెట్టింది. అవి తిని చక్కగా తయారై సినిమాకి వెళ్లాం.

ఆ రాత్రి నిద్రలో నేను రైల్లో ప్రయాణిస్తున్నట్టు, తాతగారి ఊరికి వెళ్లి తాతయ్య ఒడిలో కూర్చుని కబుర్లు చెబుతున్నట్టు.... ఎన్నో కలలొచ్చాయి. తాతయ్య నాకు మంచి బట్టలు కొనిపెట్టినట్టు కూడా కలొచ్చింది.

అయితే అమ్మా వాళ్ల నాన్న మమ్మల్ని ఎందుకు రానివ్వరో అర్థం కాలేదు. ఆ సందేహం మనసులో తొలుస్తూ ఉండిపోయింది. ఆ సంగతి తెలుసుకుందామని మర్నాడు అమ్మ వంట చేస్తుంటే అమ్మ పక్కకి వెళ్లి కూర్చున్నాను.

"అమ్మా!" పిలిచాను నెమ్మదిగా.

నాన్న స్నానం చేస్తున్నారు. తమ్ముడు గోలీలాడుకుంటున్నాడు.

"అమ్మా!" మరోసారి పిలిచాను. అమ్మ నా ప్రశ్న విని తిడుతుందో, లేక మళ్లీ ఏడుస్తుందో అని భయంగా ఉంది నాకు. అయినా ధైర్యం కూడగట్టుకుని అసలా తాతగారికి ఎందుకు మేమంటే కోపమో తెలుసుకోవాలన్న పంతంతో మరోసారి పిలిచాను.

అమ్మ విసుగ్గా "ఏంటే నీ నసా. ఏంకావాలి నీకు? " అంది.

"మరి...మరి..."

"చెబుతే చెప్పు. లేకపోతే ఇక్కడ్నుండి వెళ్లు. వంటకానీకుండా నీగోలేంటి? నాన్నగారికి ఆఫీసు టైమవుతోంది"

"మరి... మరి... తాతగారికి మనమంటే ఎందుకు కోపం? " అడిగేశాను.





నాన్న అప్పుడే స్నానం పూర్తిచేసి, టవల్ కట్టుకుని, దేముడికి దణ్ణం పెట్టుకోడానికి వంటగదివైపు వచ్చారు. దేముడి ఫొటోలు వంటగదిలో గూట్లో ఉంటాయి.

"మధూ! నీకు నేనంటే పగేమన్నా ఉందా? ఎందుకే నన్నిలా వేధిస్తున్నావు?" అంది అమ్మ బాధగా.

దణ్ణం పెట్టుకుంటున్న నాన్న అమ్మవైపు ఆశ్చర్యంగా చూశాడు. "మళ్లీ ఏమైంది?"

"దాన్నే అడగండి" రుద్ధమైన కంఠంతో అంది అమ్మ.

నాన్న నా వైపు సీరియస్‌గా చూస్తూ అడిగారు. "ఏంటి మధూ! మళ్లీ అమ్మని ఏం అడుగుతున్నావు?"

నాకు ఇప్పుడు నిజంగానే చాలా భయం వేసింది. తాతగారి పేరు చెబితే వీళ్లెందుకింత గొడవచేస్తారు అనిపించింది. నాకు చెప్పచ్చుకదా ఏం జరిగిందో! ఒక్కసారి తెలుసుకుంటే మళ్లీమళ్లీ అడగనుకదా.

"ఏంటి? మాట్లాడవు. ఏమైంది?" నాన్న రెట్టించి మళ్లీ అడిగారు.

"ఏ... ఏం లేదు నాన్నగారూ! తాతగారికి మనం అంటే కోపం ఎందుకు? అని అడిగా"

నాన్న ఒక్కక్షణం మౌనంగా అయిపోయి దేవుడికి దణ్ణం పెట్టుకుని అవతలికి వెళ్లబోతూ "నాతోరా మధూ" అన్నారు.

నేను నాన్న వెనకాలే నడిచాను.

నాన్న ప్యాంటూ, షర్ట్ వేసుకుని కుర్చీలో కూర్చున్నారు. నాన్న రెడీ అయ్యేదాకా దిక్కులు చూస్తూ కూర్చున్నాను. నాన్న రెడీ అవడం అయ్యాక అన్నారు "ఇలారా"

నేను నాన్న దగ్గరగా నడిచి కింద కూర్చున్నాను.

"నీకు తాతగారి గురించి తెలుసుకోవాలని బాగా ఉత్సాహంగా ఉన్నట్టుందికదూ!"

అవునన్నట్టుగా తలాడించాను.

"చెప్తా విను"

నాన్న చెప్పడం ప్రారంభించారు. నేనో కథ వింటున్నట్టుగా వింటున్నాను. నా కళ్లముందు నాన్న చెప్తున్న కథలో పాత్రలన్నీ కదుల్తున్నాయి.

★ ★ ★

పేరిశాస్త్రిగారిది తిరుపతికి దగ్గరగా ఉన్న చిన్న పల్లెటూరు. ఒకప్పుడు ఆ ఊళ్లో బ్రాహ్మలు తప్ప మరో కులంవాళ్లు ఉండేవాళ్లు కాదని, తర్వాత తర్వాత కుల, మత భేదాలు విడనాడాలని పెద్ద ఉద్యమం రావడంతో ఇతర కులాల వాళ్లు కూడా ఆ ఊరికి వలస వచ్చి పొలమూ, పుట్రా, గేదెల్ని కొనుక్కుని, ఆస్తులు సంపాదించుకుని స్థిరపడ్డారని ఓ కథ ప్రచారంలో ఉంది. అలాంటి ఊళ్లో తాత, ముత్తాతల దగ్గర్నించీ స్థిరపడి ఉన్నారు పేరిశాస్త్రి దంపతులు. పేరిశాస్త్రి సంప్రదాయం పట్లా, ఆచారాలపట్లా అంతులేని గౌరవం ఉన్న వ్యక్తి. తరతరాలుగా వస్తున్న ఆచారాలను తు.చ. తప్పకుండా పాటించే నియమనిష్ఠాగరిష్ఠుడు. ఆయన భార్య అక్షరాలా ఆయన సహధర్మచారిణే. ఉదయాన్నే లేచి చన్నీళ్ల స్నానం చేసి తడిబట్ట కట్టుకుని వంట చేస్తే గానీ తినడాయన. ఆయన నియమాలకు నిష్ఠకీ భంగం కలక్కుండా కష్టమైన పనిని ఎంతో ఇష్టంగా చేసే ఇల్లాలు స్వరాజ్యలక్ష్మి. వాళ్లకి ఇద్దరాడ పిల్లలు, ఒక మగపిల్లవాడు. ఆడపిల్లలని హైస్కూలు చదువుతో చదువు మాన్పించి మగపిల్లవాడిని పట్నం పంపించి పైచదువులు చదివించాడు. పెద్దమ్మాయి నిర్మల రెండో అమ్మాయి విమల. అబ్బాయి పెద్దవాడు పేరు శ్రీనివాస్. నిర్మలకి బాగా చదువుకోవాలని ఉండేది. కానీ తండ్రికి భయపడి తన కోరిక పైకి వెల్లడించకుండా ఆయన ఆదేశించినట్టే హైస్కూలు చదువుతో చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టింది.

శ్రీనివాస్ మాత్రం తండ్రి గారాబంతో స్వతహాగా ఉండే పురుషాహంకారంతో పొగరుగా ఉండేవాడు. తిరుపతిలో డిగ్రీ చదువు



తూండేవాడు. రోజూ కాలేజీకి బస్సులో వెళ్లి వచ్చే శ్రీనివాస్‌కి అక్కాచెల్లెళ్లిద్దరూ వెళ్లేటప్పుడూ వచ్చాక కూడా సపర్యలు చేయాలి అది తండ్రి ఆజ్ఞ. అతనితోపాటే పక్కింటి లక్ష్మయ్య కొడుకు భాస్కర్ కూడా డిగ్రీ చదువుతుండేవాడు. అతనికి అక్కాచెల్లెళ్లు లేరు. ఇద్దరే అన్నదమ్ములు. భాస్కర్ పెద్ద వాడు. ఉద్యమం జరిగే రోజుల్లో తిరుపతిలో వ్యాపారం చేయడానికి, ఎక్కడినుంచో వచ్చి ఆ ఊళ్లో స్థిరపడ్డాడు లక్ష్మయ్య. అతనికి తిరుమలలో కొండమీద చిన్న హోటల్ ఉంది. అది నడుపుకుంటూ కొడుకులిద్దర్నీ బాగా చదివిస్తుండేవాడు. ఒకే స్కూల్లో చదువుకున్నా ఇరుగుపొరుగున ఉన్నా అతని కులం మీద ఉన్న చిన్నచూపుతో భాస్కర్‌తో మాట్లాడేవాడు కాదు శ్రీనివాస్. అనుకోకుండా కాలేజీ కూడా ఒకటే అయినా అక్కడా తనతో చాలా అవమానకరంగా ప్రవర్తించే శ్రీనివాస్ అంటే భాస్కర్‌కి చాలా కోపంగా ఉండేది. దానికి తోడు చెల్లెళ్లచేత అడ్డమైన సేవలు చేయించుకుంటూ వాళ్ల మీద పెత్తనం చెలాయించే శ్రీనివాస్‌ని చూస్తుంటే కంపరంగా ఉండేది. వాళ్లు ఏ తప్పూ చేయకపోయినా తన గొప్పతనం ప్రదర్శించుకోవడానికి అనవసరంగా వాళ్లని తిడుతూ, వాళ్ల మనసు కష్టపెడుతూ ఉండే వాడు శ్రీనివాస్. ఓ రోజు అలాగే తన ప్యాంటు సరిగా ఉతకలేదని నిర్మలని నానా తిట్లూ తిట్టాడు. అన్నగారి మాటలకి సున్నితమైన నిర్మల మనసు గాయపడింది. తల్లీ తండ్రి శ్రీనివాస్ ప్రవర్తన తెలిసి కూడా ఏమీ అనకపోవడం ఆమెకి మరింత బాధగా అనిపించింది. ఏం చేయలేక పెరట్లో కూర్చుని నిశ్శబ్దంగా ఏడుస్తూ ఉండిపోయింది. తమ ఇంటి గుమ్మంలోంచి నిర్మలను అలా చూసిన భాస్కర్‌కి ఆమె పట్ల అంతులేని జాలి ఏర్పడింది.

ఆ జాలితో ఓసారి కొంచెం చనువు తీసుకుని ఆమెతో అన్నాడు, "ఎందుకు నిర్మలా! మీ అన్నయ్యకి అంత అహంకారం? అతనొక్కడే కాలేజీలో చదవడంలేదు. ఈ రోజుల్లో ప్రతివాళ్లూ చదువుకుంటున్నారు. ఎందుకు మీ ఇద్దరితో సేవలు చేయించుకుంటూ పైనించి తిడతాడు. నాకేం నచ్చలేదు మీ అన్నయ్య ప్రవర్తన. నువ్వెలా భరిస్తున్నావో నాకర్థం కావడంలేదు"

నిర్మల నవ్వి ఊరుకుంది. "ఏం చేస్తాను" అన్నట్టుగా.

"నవ్వుతావేం? " కోపంగా అన్నాడు భాస్కర్.

"మరి ఏం చేయను? " అంది.

"ఏంటి ఏం చేయడం! ఇకనుంచీ మీ అన్నయ్య తిడితే ఊరుకోకు సమాధానం చెప్పు. ఈ రోజుల్లో ఆడపిల్లలు ఎవరు తిట్టినా ఊరుకోడంలేదు. మీకు మాత్రం వ్యక్తిత్వం లేదూ. ఆత్మాభిమానం లేదూ. అతనేం పోషిస్తున్నాడా? అసలు మిమ్మల్ని తిట్టే అధికారం అతనికెక్కడిది? " ఆవేశంగా అంటోన్న భాస్కర్‌వైపు చిత్రంగా చూసింది నిర్మల. ఇరుగు, పొరుగునే ఉన్నా ఎప్పుడూ ఇలా ఎదుటపడి మాట్లాడుకోలేదు. ఆ అవకాశం, అవసరం రాలేదు కూడా. స్కూలుకి వెళ్లేటప్పుడో, బైటికి వెళ్లేటప్పుడో ఎదురుపడినా తలవంచుకుని వెళ్లిపోయే భాస్కర్ ఇవాళ ఆవేశంగా మాట్లాడుతోంటే కళ్లప్పగించి చూస్తూ ఉండిపోయింది నిర్మల. అలా చూసినకొద్దీ అతనిలో ఏదో ఆకర్షణ కనిపించింది. అతని మాటలు, ఆ ఆవేశం ఆమెకి ఎంతో నచ్చాయి.

అతనిచ్చిన ధైర్యంతోటే ఓ రోజు కాఫీలో పంచదార ఎక్కువైందని గ్లాసు విసిరికొట్టిన అన్నగారిని మొదటిసారిగా ఎదిరించింది.

ఏం చేసినా తలవంచుకుని వెళ్లిపోయే చెల్లెలు తనని ఎదిరించడం భరించలేని శ్రీనివాస్ లాగి ఆమె చెంపమీద కొట్టాడు. ఆ దెబ్బకి ఆత్మాభిమానం దెబ్బతిన్న నిర్మల మరింత రెచ్చిపోయేలోగా తల్లీతండ్రీ వచ్చి నిర్మలనే కేకలేయడంతో నిస్సహాయంగా





ఏడుస్తూ వెళ్లిపోయింది.

ఆ అవమానం భాస్కర్‌తో పంచుకుని, తన హృదయభారం కొంచెం తగ్గించుకోవాలనుకుంది.

భాస్కర్ ప్రతిరోజూ పెరట్లో కూర్చుని లైటు వెలుగులో నోట్సు రాసుకుంటూ ఉంటాడు. నిర్మలా వాళ్ల పెరడుకీ, భాస్కర్ వాళ్ల పెరడుకీ ఒక కాంపౌండ్‌వాల్ ఉంటుంది. ఆ రోజు అతనితో మాట్లాడాలని చాలా కోరికగా అనిపించింది నిర్మలకి. ఇంట్లోవాళ్లంతా పడుకున్నాక నెమ్మదిగా దొడ్డితలుపు తీసుకుని పెరట్లోకి వచ్చింది. కాంపౌండ్‌వాల్ దగ్గరకి వెళ్లి తలవంచుకుని రాసుకుంటోన్న భాస్కర్‌ని చూస్తూ నెమ్మదిగా పిలిచింది "భాస్కర్"

భాస్కర్ ఉలిక్కిపడి, నిర్మలని చూసి పుస్తకాలు పక్కనపెట్టి లేచి కాంపౌండ్‌వాల్ దగ్గరగా వచ్చాడు.

"ఏంటి నిర్మలా! ఈ వేళప్పుడు ఇక్కడేం చేస్తున్నావు? " అడిగాడు ఆందోళనగా.

నిర్మల కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. గద్గద స్వరంతో అంది "మా అన్నయ్యని ఎదిరించమన్నావని ఇవాళ ఎదిరించాను. చూడు ఎలా కొట్టాడో" ఎర్రగా కందిన చెంప చూపించింది.

భాస్కర్‌కి చాలా బాధనిపించింది. "అయ్యో! ఎలా కందిపోయిందో. ఇంత మొరటు మనిషేం మీ అన్నయ్య. ఛీఛీ కనీసం చెల్లెలనైనా లేదా? " అంటూ చటుక్కున తన చేత్తో నిర్మల చెంప నిమిరాడు.

నిర్మలకి ఒక్కసారిగా ఒళ్లంతా జల్లుమంది. తానెన్నడూ ఎరగని ఓ చిత్రమైన మధురమైన పులకింత అణువణువూ నిండిపోగా, అన్నగారి చెంపదెబ్బ బాధ మర్చిపోయి, భాస్కర్ స్పర్శతో కలిగిన తీయని బాధతో సర్వం మరిచిపోయింది. అప్రయత్నంగా ఆమె కనురెప్పలు బరువెక్కి వాలిపోయాయి.

భాస్కర్ కూడా తన వేళ్లకి తగిలిన ఆమె చెంప నునుపుదనం, ఆ వెచ్చదనపు స్పర్శకి సర్వం మర్చిపోయాడు. అప్పుడప్పుడే యవ్వనంలోకి అడుగుపెట్టిన ఆ యువతీయువకులకు ఒకరిపై ఒకరికి అనురాగం ఏర్పరచుకోడానికి ఆ సంఘటన దోహదం చేసింది. శరీరం నిండా ఆ మధురమైన ప్రకంపనలు నిండిపోవడంతో ఆ చేయి కొన్ని క్షణాలు అలాగే ఉంచాడు. నిర్మల కూడా తీయమనలేదు. హఠాత్తుగా ఎవరో దగ్గిన శబ్దం వినిపించడంతో ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. నిర్మల సిగ్గుతో మొహం కందిపోగా కళ్లు వాల్చుకుని చివ్వున తిరిగి పరిగెత్తుకుంటూ లోపలికి వెళ్లిపోయింది.

భాస్కర్ కూడా కాంపౌండ్‌వాల్ దగ్గర్నించి జరిగి, తిరిగి పుస్తకాల ముందు కూర్చున్నాడేగానీ ఒక్కముక్క కూడా చదవలేకపోయాడు.

అప్పటినుంచీ నిర్మలా, భాస్కర్‌ల మధ్య ప్రణయం మొదలైంది. దొంగచాటుగా ఇద్దరూ ఎవరో ఒకళ్ల పొలాల్లోనో, సినిమా హాల్లోనో కలుసుకోడం కనీసం గంటసేపన్నా కబుర్లు చెప్పుకోడం, భవిష్యత్తుకోసం బాటలు వేసుకోడం వాళ్ల దినచర్యలో భాగమైంది. అమాయకంగా చెప్పిన పని చేస్తూ ఏ కర్టెను గుడ్డకో ఎంబ్రాయిడరీ చేస్తూ కూర్చునే నిర్మలలో చిత్రమైన మార్పు గమనించింది విమలొక్కతే. ఓరోజు అక్కగారిని నిలదీసింది.

నిర్మల ఏవీ దాచకుండా తనకూ, భాస్కర్‌కీ మధ్య జరుగుతోన్న ప్రణయగాధ అంతా చెప్పింది.

"అక్కా నీకసలు మతుందా? మీ పెళ్లికి నాన్న ఒప్పుకుంటాడనేనా? వాళ్లతో మాట్లాడడానికే ఇష్టపడని నాన్న, అన్నయ్యా ఈ సంగతి తెలిస్తే నిన్నూ అతడిని కలిపి పాతేస్తారు తెలుసా!" అంది విమల.

నిర్మల నిర్లక్ష్యంగా అంది. "ఎలా పాతేస్తారో చూస్తాను. ఏంటి? ఎప్పుడూ వీళ్ల చెప్పుచేతల్లోనే పడిఉండాలా? ఆడపిల్లల

క్కూడా అన్నిటా మగవాళ్లతో సమానహక్కు లున్నాయి. అవేం తెలీనీకుండా మనల్ని కూపస్థమండూకాల్లా తయారుచేశారు. నేను బాగా చదువుకోవాలనుకున్నాను. వద్దని స్కూలుఫైనలుతో చదువు మాన్పించారు. ఆఖరికి నా పెళ్లి కూడా వాళ్లిష్టమేనా? చచ్చినా ఒప్పుకోను. నేనెలాగైనా భాస్కర్‌నే పెళ్లిచేసుకుంటాను"

విమల ఆశ్చర్యంగా చూసింది. భయంగా కూడా చూసింది. "అమ్మో, నాన్నకి తెలిస్తే ఇంకేమన్నా ఉందా? ముందు ఈ విషయం తెలిసీ చెప్పలేదని తనని తిడతారు. అలా గని చెప్పడం కూడా సరికాదు. నీకెలా తెలుసు? ఎంతకాలంనుంచి సాగుతోంది? నాకెందుకు ముందు చెప్పలేదు? " ఇలాంటి ప్రశ్నలకి సమాధానం చెప్పాలి. అంతకన్నా ఈ విషయం తనకేం తెలీనట్టు ఉండడం మంచిది అనుకుంది విమల.

అయితే పల్లెటూర్లో ఇలాంటి విషయాలు మూడో కంట పడకుండా ఎంతోకాలం సాగవు. పేరిశాస్త్రి చెవుల్లోనేకాదు, కళ్లల్లో కూడా పడ్డారు చెట్టాపట్టాలేసుకుని తిరుగుతోన్న భాస్కర్, నిర్మలలు.

ఆయన అగ్నిహోత్రుడిలా మండిపడ్డాడు. ఇంటికి వచ్చిన నిర్మలని జుట్టుపట్టుకుని వంగదీసి పిడిగుద్దులు గుద్దాడు. ఆయన ఎందుకు కొడుతున్నాడో కూడా అర్థంకాని శ్రీనివాస్ కూడా అదే సమయంగా తన బలం కూడా చూపించాడు. స్వరాజ్యలక్ష్మి వచ్చి "అయ్యో, ఈడొచ్చిన ఆడపిల్లను అలా కొడుతున్నాడేంటండీ" అంటూ నిర్మల జబ్బ పట్టుకుని పక్కకి లాగడంతో ఒగరుస్తూ నిల బడ్డాడు పేరిశాస్త్రి.

"ఏమైందండీ? " ఏడుస్తూ అడిగింది స్వరాజ్యలక్ష్మి. ఏమైందో తెలిసిన విమల మాత్రం లోపల గదిలో బిక్కచచ్చిపోయి కూర్చుండిపోయింది.

నిర్మల వెక్కివెక్కి ఏడుస్తూ కుప్పకూలిపోయింది.

పేరిశాస్త్రి మండిపడుతూ అన్నాడు. "ఏమైందా? నీ కూతురు మన కులం, సంప్రదాయం, పరువు, ప్రతిష్ట అన్నీ మంట గలిపింది. ఆ ఇడ్డెన్లమ్ముకునే వెధవతో చెట్టా పట్టాలేసుకు తిరుగుతోంది"

శ్రీనివాస్ గట్టిగా అరిచాడు. "ఎవరు నాన్నా! ఆ భాస్కర్‌గాడితోటా? అవ్వ ఛీఛీ! మన పక్కన కూర్చుని అన్నం తినడాని క్కూడా అర్హతలేని వెధవ. వాడితో తిరుగు తోందా? ఏమే నీకు మగాడు కావాలనిపిస్తే నాకు పెళ్లిచేయండి అంటే మంచి సంబంధం చూసి పెళ్లిచేసేవాళ్లంగా"

నిర్మల మండిపడుతూ అరిచింది. "అన్నయ్యా! మర్యాదగా మాట్లాడు"

శ్రీనివాస్ ఉగ్రుడయ్యాడు. అసలే కోతి ఆపై కల్లుతాగింది అన్నట్టుగా తయార యాడు. నిర్మల దగ్గరకు నడిచి జుట్టుపట్టు కుని మెడవంచి "ఏంటే అరుస్తున్నావు. ఆడ ముం... అణిగి ఉండాలి. ఇట్లా అరిస్తే నీకు పెళ్లికాదు"

"ఇంకేంటిరా అయేది. దీనికింక పెళ్లీకాదు, ఏం కాదు. పరువు తీసిందిరా. మన గౌరవం మంటకలిపింది" పేరిశాస్త్రి వణికి పోతూ అన్నాడు.

"ఏమండీ చిన్నపిల్ల. ఏదో పొరపాటు చేసింది. నేను నచ్చచెపుతాను. నాన్నా వాసూ! వదలరా తప్పురా. ఆడపిల్లనల్లా కొట్టకూడదురా" స్వరాజ్యలక్ష్మి నిస్సహా యంగా అంటూ నిర్మలని విడిపించడానికి ప్రయత్నించింది.

కానీ శ్రీనివాస్ వదలకుండా మరింత గట్టిగా పట్టుకుని "ఏంటే ఏంటి మూడో కన్ను తెరుస్తున్నా! ఇంకోసారి వాడితో తిరు గుతావా? చెప్పు తిరుగుతావా? " అంటూ అరవసాగాడు.

నిర్మల బాధగా కెవ్వుకెవ్వుమని అరవసా గింది.

హటాత్తుగా వచ్చాడు భాస్కర్. వస్తూనే ఆవేశంగా అరిచాడు. "శ్రీనివాస్! వదు ల్తావా? లేదా? "





శ్రీనివాస్ చేయి నిర్మల జుట్టు వదిలి, భాస్కర్ వైపు తిరిగింది. పిడికిళ్లు బిగించి "ఏరా? మా ఇంట్లో అడుగు పెట్టడానికి నీకెంత ధైర్యంరా పో వెధవా. పోతావా పోవా" అంటూ మీది మీదికి వచ్చి భాస్కర్ చొక్కా కాలర్ పట్టుకుని బలంగా లాగాడు.

భాస్కర్ విసురుగా విడిపించుకుని "మీర సలు మనుషులేనా? ఆడపిల్లని అల్లా కొడ తారా? ఇదేనా మీ సంప్రదాయం? ఇదేనా మీ సంస్కారం? " అంటూ అరిచాడు.

"నువ్వెవడివిరా మా సంప్రదాయం గురించి మాట్లాడడానికి. నీకేం అర్హత ఉంది? పోరా ముందు నా ఇంట్లోంచి బైటికి నడువు. స్వరాజ్యం గోమూత్రం పట్టుకురా. ఈ గది శుద్ధిచేయి. వీడి పాదస్పర్శతో అప విత్రం అయింది నా ఇల్లు" అంటూ భాస్కర్ మెడ పట్టుకుని బైటికి ఈడ్చుకెళ్లసాగాడు పేరిశాస్త్రి.



నిర్మల ఆ అమా నుషత్వాన్ని భరించలే కపోయింది. ఎక్కడి నుంచి కలిగిందో అంత ధైర్యం గట్టిగా అరిచింది. "నాన్న గారూ అతడిని వదలండి"

పేరిశాస్త్రి నిర్ఘాంతపోయి చూశాడు. ఏనా డూ చెప్పింది వినడమేకానీ పన్నెత్తి ఒక్క మాట కూడా ఎదురుచెప్పని కూతురు అలా అరవడంతో ఆయనకి కొన్ని క్షణాలు ఏం జరుగుతోందో అర్థం కాలేదు.

నిర్మల మరింత ధైర్యం తెచ్చుకుని అంది. "అతని తప్పేంలేదు. నేనూ అతనూ ప్రేమించుకున్నాం. పెళ్లి చేసుకుంటాం"

అంతే నిర్మల చెంప పేలిపోయింది. ఆమె చెవులకున్న జూకా ఆ దెబ్బకి ఊడి కిందప డింది. ఎడం చెవి దిబ్బళ్లు పడినట్టుగా అయింది. చెంప భగభగ మండసాగింది. కళ్లనుంచి బొటబొట కన్నీళ్లు కారాయి. పెదాలు వణికాయి. ఆ దిగ్భ్రమలోంచి ఒక్క సారి తీవ్రంగా చూసింది శ్రీనివాస్‌వైపు.

"ఖబడ్దార్. ఇంకో మాట మాట్లాడావంటే నరికిపోగేస్తాను. పో లోపలికి" తర్జని చూపిస్తూ గట్టిగా అరిచాడు శ్రీనివాస్.

నిర్మల మౌనంగా అలా చూస్తూ క్షణంలో సగంసేపు ఏం జరిగిందో అందరూ గ్రహిం చేలోగా లాగిపెట్టి శ్రీనివాస్ చెంపమీద కొట్టింది. ఆ ఇంట్లో ఆ క్షణం భయంకర మైన నిశ్శబ్దం ఏర్పడింది. ఆ నిశ్శబ్దంలోంచి ఓ విప్లవాగ్ని కణం నిప్పులు విరజి మ్ముతూ జ్వాలలా పైకిలేచి దావాన లంలా వ్యాపిం చింది.

ఆ దావానలం ఇల్లంతా సెగతో, పొగతో నింపే సింది. రగులు తున్న ఆ సెగల మధ్య నుంచి పేరిశా స్త్రిగారి నిరంకుశ, కర్క శమైన ఆజ్ఞను ధిక్కరించి నిర్మల ఇల్లు దాటి, భాస్కర్ చేయి పట్టుకుని ఆ సంప్రదాయపు గడపదాటి బైటికి వచ్చింది. ఆమె వెనకే ఆ ఇంటి తలుపులు శాశ్వతంగా మూసుకు న్నాయి.

★ ★ ★

నాన్న చెప్పడం ఆపేశాడు.

నాకు సినిమా చూస్తున్నట్టుగా అనిపిం చింది. అమ్మ తాతయ్యని ఎదిరించి నాన్న కోసం ఇల్లు వదిలి వచ్చేసిందన్నమాట. ఎందుకు? నాన్నంటే అమ్మకి ప్రేమా?

అదే అడిగాను. "నాన్నా అమ్మకి మీరంటే ప్రేమనా? "

నాన్న నవ్వారు.

"లేకపోతే కన్నవాళ్లను ఎదిరించి నాతో ఎందుకు వస్తుందమ్మా? "

"అలాగా ఆ తరువాత ఏం జరిగింది? "

నాన్న నిట్టూర్చారు. "ఇద్దరం కలిసి మా ఇంటికి వెళ్లాం. కానీ మా నాన్న కూడా మమ్మల్ని ఇంట్లోకి రానివ్వలేదు. మా మీద ఆయనకి కోపం లేకపోయినా మమ్మల్ని రానిస్తే పేరిశాస్త్రిగారు వాళ్లని కూడా ఆ ఊళ్లో ఉండనివ్వరని భయపడ్డారు. అమ్మ ఏడ్చింది. "లోపలికి రానివ్వండి" అంటూ మొత్తుకుంది. కాని నాన్న వినలేదు. ఆయనకి పేరిశాస్త్రిగారంటే గౌరవంతోపాటు భయం కూడా ఉంది. వాళ్లు అగ్రకులం వాళ్లని, మేము చిన్న కులం వాళ్లమని వాళ్ల పట్ల అణకువగా, గౌరవంగా మెలగాలని చిన్నప్పట్నించీ చెపుతుండేవారు మానాన్న. అదే భావంతో మమ్మల్ని లోపలికి రానివ్వలేదు"

"ఆ తరువాత" కుతూహలంగా అడిగాను.

"ఇద్దరం తిరుమల వెళ్లి స్వామి సన్నిధిలో పెళ్లి చేసుకున్నాం. నా వేలికున్న ఉంగరం అమ్మి తాళిబొట్టు కొన్నాం. పూలదండలు కొన్నాం. పసుపుతాడుకి ఆ తాళిబొట్టు గుచ్చి ఆ స్వామి సాక్షిగా ఆమె మెడలో మూడు ముళ్లు వేశాను. ఆ తరువాత కొంతకాలం అక్కడే ఉంటూ చిన్నాచితకా ఉద్యోగాలు చేస్తూ ఏనాటికైనా అందరూ మమ్మల్ని అర్థం చేసుకుని ఆదరించకపోతారా అని ఆశపడుతూ తిరుపతిలో ఉన్నాం. కానీ అక్కడ కూడా శ్రీనివాస్ మమ్మల్ని ప్రశాంతంగా బతకనివ్వలేదు. నా ఉద్యోగం ఊడగొట్టించడం, నేను కనిపించినప్పుడల్లా అవమానించడం అదీ చేసేవాడు. ఏడాది తిరిగాక నువ్వు పుట్టావు. నిన్ను తీసుకుని మీ తాతగారింటికి వెళ్లాం. దాదాపు జుట్టుపట్టి ఈడ్చినంత పనిచేశారు. మీ అమ్మమ్మగారు మాత్రం ఆవిడ గాజులు మీ అమ్మకిచ్చి "ఇవి అమ్మి ఈ డబ్బుతో ఎక్కడికన్నా వెళ్లి వ్యాపారం చేసుకుంటూ బతకండి తల్లీ" అని బతిమాలారు.

ఆ తరువాత మా ఇంటికి వెళ్లాం. రెండు రోజులు మాత్రం అక్కడ ఉన్నాం. కానీ మీ తాతగారు మేమక్కడ ఉంటే మా నాన్నని ఊరు విడిచి వెళ్లాల్సి వస్తుందని బెదిరించారు. మేము మళ్లీ తిరుపతి వచ్చేశాం. నీకు రెండేళ్లు వచ్చిందాకా అక్కడ ఉండి తరువాత విజయవాడ వచ్చేశాం. కొంత కాలం అక్కడ ఉద్యోగాలకోసం ప్రయత్నించాం. కానీ అప్పుడే ఉద్యోగాలకు కరువు ఏర్పడింది. ఇద్దరం పిల్లలకు ట్యూషన్లు చెబుతూ కొంతకాలం గడిపాం. ఎంతో ప్రయత్నించిన మీదట ఈ ఊళ్లో పంచదార ఫ్యాక్టరీలో నాకు ఉద్యోగం దొరికింది. ఇక్కడికి వచ్చాక అనుకోకుండా కోదండపాణి గారు నాకు స్నేహితులు అవడంతో ఈ ఇంట్లో మనకు ఆశ్రయం లభించింది. ఇక్కడ కూడా ఏడాది గడిచాక ఎవరి రాకపోకలు లేకపోవడంతో చుట్టుపక్కల వాళ్ల కళ్లు మనమీద పడ్డాయి. విమర్శల బాణాలు సంధించడం మొదలుపెట్టారు.

"ఎందుకు నాన్నా మనింటికి చుట్టాలు రాకపోతే వాళ్లకేం? " ఆశ్చర్యంగా అడిగాను.

నాన్న నిట్టూర్చారు. "మనం సంఘజీవులం తల్లీ! ఈ సంఘంలో రకరకాల మనుషులుంటారు. రకరకాల మనస్తత్వాలు ఉంటాయి. అందరినీ ఎల్లవేళలా కన్విన్స్ చేయలేం. ఎవరింటికైనా చుట్టాలు, పక్కాలు వచ్చి వెళుతుంటేనే వాళ్లు గౌరవనీయులుగా పరిగణించబడతారు. వంటరిగా ఉంటే వీళ్లలో ఏం లోపం ఉందో బంధువులు, అయినవాళ్లు వదిలేశారు అనుకుంటారు. అయితే కోదండపాణిగారికి మన గురించి అంతో ఇంతో తెలుసుకాబట్టి ఆ దంపతుల అండతో ఎలాగో నెగ్గుకొస్తున్నాం. కాని అప్పటినుంచీ మేము అటు ఆ తాతగారిం





టికి ఇటు ఈ తాతగారింటికి కూడా వెళ్ల లేదు. వాళ్లూ రాలేదు. ఇదమ్మా సంగతి. ఇప్పుడు చెప్పు మనం ఏ తాతగారింటికి వెడదాం?" నాన్న ఆ మాట అనడంతో నేను ఉలిక్కిపడ్డాను.

ఎటూ చెప్పలేక మౌనం వహించాను. నాకెందుకో ఒక్కసారి వెళ్లి తాతలని చూడా లని మాత్రం మనసులో బాగా ఉంది. కానీ ఇంతా విన్నాక వెడదాం అని ఎలా అనగ లను.

మేము అనుకున్న ప్రకారం నాన్నకి జీతాలు రాగానే తిరుపతి బయలుదేరాం. మా ఊరునుంచి తిరుపతికి నేరుగా రైలు లేదుట. విజయవాడదాకా బస్సులో వెళ్లి అక్కడినుంచి తిరుపతికి రైలులో వెళ్లాలిట. మా ఊళ్లో ప్యాసింజరులు తప్ప వేరే రైళ్లు రావని చెప్పారు నాన్న. బహుశా వాటి శబ్దమే మాకు అప్పుడప్పుడూ వినిపిస్తూ ఉంటుందనుకుంటా.

బస్సులో విజయవాడ వెళ్లాం. అక్కడ సాయంత్రందాకా గడిపి, సాయంకాలం తిరు పతి రైలెక్కాం. నేనూ, తమ్ముడూ కిటికీ దగ్గర కూర్చోడానికి దెబ్బలాడుకుంటుంటే మా ఎదురుగా సీట్లో కూర్చున్న ఓ పెద్దా యన తను జరిగి కిటికీ దగ్గర తమ్ముడిని కూర్చోపెట్టాడు.

మొదటిసారిగా రైలెక్కడంతో నాకు తమా షాగా అనిపిస్తోంది. నేనేదో సాధించేసినట్టు ఉద్వేగంగా ఉంది. పదేపదే నా పెదాల మీద సంతోషంతో కూడిన చిరునవ్వు విరు స్తుంటే ఆ నవ్వు మొహంతో నాన్నవైపు, అమ్మవైపు చూస్తూ తిరిగి కిటికీలోంచి బైటకి చూస్తూ కూర్చున్నాను. అమ్మానాన్న సన్నగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ల మాటలు నాకేం వినిపించడంలేదు. వినాలని కూడా నేననుకోలేదు. తమ్ముడు నిద్రపోయాడు. అమ్మ వాడిని ఎత్తుకుని పైన బెర్త్‌మీద దుప్పటి పరిచి పడుకోబెట్టింది. కాస్సేపటికి నాకూ నిద్రొచ్చింది.

తిరిగి అమ్మ తట్టి లేపుతోంటే మెలకువ వచ్చింది. "లే మధూ! స్టేషన్ వచ్చింది దిగాలి" అంది అమ్మ.

కళ్లు నులుముకుంటూ లేచాను. కిటికీ లోంచి ప్లాట్‌ఫాం కనిపిస్తోంది. బాగా జనం ఉన్నారు. పెట్టెలు, బెడ్డింగులు, బుట్టలు, తట్టలు దింపుతూ జనం కూడా దిగుతున్నారు. నాన్న పెట్టె పట్టుకుని మరో చేత్తో నా వేలు పట్టుకుని దిగారు. అమ్మ తమ్ముడిని భుజం మీద వేసుకుని ఓ చేత్తో ప్లాస్టిక్ బుట్ట పట్టుకుని దిగింది. అది రేణి గుంటట. మళ్లీ అక్కడినుంచి తిరుమలకి బస్సులో వెళ్లాలిట.

బస్సు బయలుదేరింది. పాములా మెలి కలు తిరుగుతూ బస్సు పైకిపోతోంటే వెనక్కి వెడుతోన్న దృశ్యాల్లో పెద్దపెద్ద లోయలు, విశాలమైన వృక్షాలూ, సన్నటి మెలికలు తిరిగిన రోడ్డు, భయంతో ఒళ్లు జలదరించింది నాకు. అయినా మనసులో గోవిందా గోవిందా అనుకుంటూ తమ్ముడిని కూడా అలాగే అనుకోరా అంటూ హెచ్చ రిస్తూ కళ్లు మూస్తూ తెరుస్తూ కూర్చు న్నాను. బస్సు కొండమీదికి చేరింది. నాన్న సత్రం మాట్లాడి, మమ్మల్ని సత్రానికి తీసికె ళ్లారు. అక్కడ స్నానాలు చేసి తయారై దేవుడి దర్శనానికి వెళ్లాలి అన్నారు నాన్న. అమ్మ నాకూ, తమ్ముడికీ స్నానాలు చేయిం చింది. గంట తరువాత అందరం తయారై దేవుడి దర్శనానికి వెళ్లాం.

పెద్దక్యూ ఉంది. దాన్ని ధర్మదర్శనం అంటారని చెప్పారు నాన్న. "దేవుడెక్కడుం టాడు నాన్నగారూ" అని అడిగాను.

నాన్న నవ్వారు. "దేవుడు ఎక్కడైనా ఉంటాడమ్మా" అన్నారు.

అలా చాలాసేపు క్యూలో వున్నాం.

"నాన్నా ఇంకా ఎంతసేపు ఈ క్యూలో" అన్నాను విసుగ్గా.

"తప్పమ్మా విసుగుండకూడదు. మనిషికి సహనం చాలా అవసరం. సహనం ఉన్న

వాళ్లకి క్షణాల్లో కనిపిస్తాడు దేవుడు" అన్నారు నాన్న.

"ఆకలేస్తోంది నాన్నా" జాలిగా అన్నాను.

"నువ్వేనా తిరుపతి వెడదాం అని గోల చేశావు. దర్శనం చేసుకోకుండా తింటామా? తప్పుకదా" అన్నారు నాన్న.

"అవునవును తప్పే. స్వామి దర్శనం కోసం కదా వచ్చాం" అనుకుని అలాగే నిలబడ్డాను.

ఇనుప ఊచలు అడ్డంగా కట్టిన సన్నటి దారిలో ఒకళ్ల వెనక ఒకళ్లు నుంచున్న ఆ క్యూ నింపాదిగా కదుల్తోంది అరగంటకో అడుగు చొప్పున.

"మధూ, గోవిందా, గోవిందా అనుకుంటూ కళ్లు మూసుకుని నిలబడమ్మా. త్వరగా దర్శనం అవుతుంది" అన్నారు నాన్న.

ఎవరో మమ్మల్ని తోశారు. "నడవండి, ఊ నడవండి" అంటూ అదిగో విగ్రహం అన్నారు నాన్న. ఆత్రంగా చూశాను.

నల్లగా, నిలువెత్తు విగ్రహం యావత్తూ బంగారు ఆభరణాలతో ధగధగ మెరుస్తూ. ఆ విగ్రహం చూడగానే భయం వేసింది. అప్రయత్నంగా కళ్లల్లో నీళ్లు చిప్పిల్లాయి. "స్వామీ మా తాతగారు కలవాలి. మమ్మల్ని వాళ్లింటికి తీసికెళ్లాలి" అనుకున్నాను మనసులో. మరోసారి చూడాలనుకునేలోగా వాలంటీర్లు తోసేశారు. ప్రసాదం తీసుకుని మేము బైటకి వచ్చాం.

బైటకి వచ్చాక నాన్న మమ్మల్ని ఓ దగ్గర కూర్చోబెట్టి ఎటో వెళ్లారు "ఇప్పుడే వస్తాను మీరిక్కడే ఉండండి" అంటూ.

అమ్మ, నేను, తమ్ముడూ అక్కడ నిలబడి అందర్నీ పరిశీలనగా చూస్తూ ఉండిపోయాం. భక్తులు చాలామంది గుండు గీసుకుని గుండుకి గంధం రాసుకున్నారు. కొందరు కోనేట్లో స్నానాలు చేస్తున్నారు. మరికొంతమంది ధ్వజస్థంభం దగ్గర కొబ్బరి కాయలు కొట్టి హారతులిస్తున్నారు.

"నాన్న ఎక్కడికెళ్లారమ్మా" అడిగాను.

"తాతగారి హోటల్ ఉందికదా! ఆయనున్నారేమో చూసిరావడానికి వెళ్లారు"

ఆ మాట వినగానే తాతగారిని చూడబోతున్నానన్న ఆనందంతో ఉద్వేగంగా ఎదురు చూస్తూ నిలబడ్డాను. తాతగారు ఉంటే బాగుండు. మమ్మల్ని వాళ్లింటికి తీసుకెడతారు. తప్పకుండా తీసికెడతారు. "వెంకటేశ్వరస్వామీ! తాతగారు ఉండాలి. తాతగారు ఉండాలి" నేను కళ్లు మూసుకుని స్వామిని స్మరించుకుంటూ ఉండిపోయాను.

నాన్న స్వరం వినిపించి కళ్లు తెరిచాను. నాన్న మొహం దిగులుగా ఉంది. దుఃఖాన్ని దిగమింగుకుంటూ అన్నారు అమ్మతో. "లేరు నిర్మలా! హోటల్ ఎత్తేశారిక్కడ. తిరుపతిలో పెద్ద భోజన హోటలు పెట్టారుట"

"అలాగా... పోనీలెండి కిందికెళ్లాక వాకబు చేద్దాం. తప్పకుండా కనిపిస్తారు" ధైర్యం చెప్పింది అమ్మ.

నాకు చాలా దిగులుగా, కోపంగా ఉంది.

అమ్మ వాళ్లందర్నీ అలా ఎదిరించి రాకుండా ఉండాల్సింది. అనవసరంగా వాళ్లతో గొడవపడింది. అయినా అమ్మానాన్నతో గొడవపడతారా ఎక్కడన్నా! అంత గొడవపడి ఏం సాధించింది? నాన్ననీ, తాళిబొట్టునీనా? ఈ రెండిటికోసం అమ్మానాన్నతో గొడవపడి, చెల్లాయినీ, అన్నయ్యనీ వదిలిరావడం ఏంటో? నేనూ అలాగే చేస్తానా? నాన్ననీ, అమ్మనీ తమ్ముడినీ వదిలేసి ఎవరన్నా అబ్బాయితో తిరుపతి వెళ్లి పెళ్లి చేసుకుంటానా? అమ్మో ఇంకేమన్నా ఉందా? అమ్మ అప్పుడప్పుడు నన్ను తిడుతుంది. మరీ కోపం వస్తే కొడుతుంది కూడా కానీ నేను లేకుండా బతకలేదు. నేను స్కూలునుంచి రావడం కొంచెం ఆలస్యం అయితే చాలు వీధిలోంచి ఇంట్లోకి, ఇంట్లోంచి వీధిలోకి తిరుగుతూ ఉంటుంది. మరి తాతయ్యకి అమ్మ మీద ప్రేమలేదా? కనీసం అమ్మమ్మకైనా ఉండచ్చుగా.




అమ్మమ్మ తాతయ్యకి నచ్చచెప్పి అమ్మనీ, మమ్మల్నీ ఇంటికి పిలిపించుకోవచ్చుగా. నా ఆలోచనలు అలా సాగుతోంటే నాన్న స్వరం విని ఆలోచనల్లోంచి బైటికి వచ్చాను.

"మనం వీలైనంత త్వరగా ఈ ప్రదేశం వదిలి వెడితే మంచిది. మీ వాళ్లెవరికంటా పడకుండా వెళ్లిపోతే మనసు కుదుటపడు తుంది" అన్నారు నాన్న.

నాన్న ఆ మాట అన్న దగ్గర్నించీ నాకు నిజంగానే అమ్మా వాళ్ల చుట్టాలు అంటే తాతగారు, అమ్మమ్మ, మావయ్య, పిన్ని ఇలా ఎవరో ఒకరు ఎదురైతే బాగుండు అనిపించసాగింది. మాకెదురుగా వస్తూ మావైపు తదేకంగా చూస్తున్న ప్రతివాళ్లలో మావయ్యనీ, పిన్నినీ వెతుక్కోవడం మొద లుపెట్టాను. శాంతి ప్రతి సెలవులకీ తాత గారి ఊరువెళ్లి, బోలెడు బట్టలు తెచ్చుకుం టుంది. ఊర్నికైతే వచ్చానుగానీ శాంతి చూపించుకున్నట్టు 'ఈ పరికిణీ మా తాత గారు కొనిచ్చారు. ఈ గాజులు మా అమ్మమ్మ కొనిచ్చింది' అంటూ చూపించుకో డానికి నాకేం లేవు. వాళ్లెవరూ మాకు కని పించలేదు. మేము వాళ్ల దగ్గరకి వెళ్లలేము. ఎంతకాలం ఇలా?

"ఏవిటే ఆలోచిస్తున్నావు. నీ పరధ్యానం మండా. సరిగా నడువు" అమ్మ మాటతో ఉలిక్కిపడి చూశాను. మేము సత్రం వైపు నడుస్తున్నాం.

మర్నాడు ఉదయమే స్నానాలు చేసి అలి వేలు మంగాపురం వెళ్లాం. అమ్మవారి దర్శనం, స్వామివారి దర్శనం అంత కష్టం కాకపోగా, చాలా త్వరగా అయింది. గాజులు, పసుపు, కుంకుమ కొంది అమ్మ.

ఆ తరవాత గోవిందరాజస్వామి గుడికి వెళ్లాం. దర్శనం అయాక నాన్న మమ్మల్ని గుళ్లోనే ఉండమని చెప్పి తను వీధిలోకి వెళ్లారు.

అమ్మ నాకూ, తమ్ముడికీ గుళ్లో కొన్న పులిహోర ప్రసాదాలు దొప్పల్లో పెట్టి ఇచ్చింది. పులిహోర ఎంతో బాగుంది. ఆ తరువాత దద్ధోజనం కూడా పెట్టింది.

నాకు నిద్ర వచ్చింది. తమ్ముడిని ఒళ్లో పడుకోబెట్టుకుని జోకొడుతూ అమ్మ స్థంభా నికి ఆనుకుని కూర్చుని ఏదో ఆలోచిస్తోంది.

నేను కూర్చున్న చోటే నేలమీదికి ఒరి గాను. నిద్రపట్టేసింది.

అమ్మానాన్నల మాటలు వినిపిస్తుంటే మెలకువ వచ్చింది.

"ఎంతపని జరిగింది? మా నాన్నగారు ఇంత దారుణంగా ప్రవర్తిస్తారనుకోలేదు" అంటోందమ్మ.

"హు... అగ్రకులం వాళ్లుగా. ఎలా ప్రవ ర్తించినా ఫర్వాలేదు నిర్మలా. పైగా ఊరు కూడా వాళ్లదే" నాన్న స్వరంలో కొంచెం నిష్టూరం ధ్వనించింది.

అమ్మ బాధగా అంది. "అంతమాటన కండి. ఏదీ ఎవరి స్వంతం కాదు. మా నాన్నగారి తరఫున నేను క్షమార్పణ చెప్తు న్నాను. మీ నాన్నగారిని మా నాన్నగారు అలా వెళ్లగొట్టకుండా ఉండాల్సింది. అయినా ఆయన మాత్రం ఎందుకంత భయపడాలి? నేను వెళ్లను అని మొండికేస్తే ఈయనేం చేసేవారేంటి? "

"ఆ ధైర్యమే మా నాన్నగారికుంటే కథే వేరుగా ఉండేది నిర్మలా. పోనీలే వదిలెయ్. ఇప్పుడెందుకా సంగతులు? "

"గుంటూరు అడ్రస్ తీసుకున్నారా? "

"వాళ్లకి తెలియదుట. నాన్నావాళ్లు వెళ్లి కూడా రెండేళ్లవుతోందిట. తమ్ముడికి ఏదో గవర్నమెంటు ఉద్యోగం వచ్చిందిట. ఇదంతా మాతోపాటు అప్పట్నించీ హోటల్ నడిపిస్తున్న కోదండం చెప్పాడు. అతని ప్పుడు పెద్ద లాడ్జి పెట్టాడు. కొంతకాలం నా న్నావాళ్లు హోటల్ తిరుపతికి మార్చారుట. ఆ తరవాత మీ నాన్నగారి పోరు ఎక్కువై ఊరినుంచి వెళ్లిపోడంతో హోటల్ ఎత్తేసి ఆ డబ్బులు తీసుకుని తమ్ముడికి ఎలాగా గుంటూరులో పోస్టింగ్ ఇచ్చారని వాడితో

వెళ్లిపోయారుట. ఆ తరువాత ఏ కబురూ తెలియదు అన్నాడు"

అమ్మ సన్నగా వెక్కిళ్లు పెడుతోంది.

"ఊరుకో నువ్వెందుకేడుస్తావు? " అన్నారు నాన్న.

"నా వల్లనేగా ఇదంతా జరిగింది. తండ్రీ కొడుకుల్ని విడదీసిన పాపం నాకు ఊరికే పోతుందా? భగవంతుడు నన్ను క్షమిస్తాడా? " అమ్మ ఏడుపు ఉధృతం అవుతుంటే నాన్న "ఊరుకో నిర్మలా! నేనెలాగైనా నాన్నావాళ్ల అడ్రస్ సంపాదిస్తాను. నీకెందుకు? తప్పకుండా మనం నాన్న దగ్గరకు వెళతాం సరేనా? ప్లీజ్ ఏడవకు. పిల్లలు లేచారంటే గాభరాపడతారు" అన్నారు.

నెమ్మదిగా అమ్మ వెక్కిళ్లు తగ్గాయి.

"పిల్లల్ని లేపు. ట్రెయిన్ టైం అవుతోంది. కాస్త ఎక్కడన్నా ఇడ్లీ తిని వెళదాం. పులిహోరతో కడుపు నిండిందోలేదో పిచ్చిసన్నాసులకి" అన్నారు నాన్న.

అమ్మ నా చేతిమీద తట్టి "మధూ! లేమ్మా" అంది.

నేను అప్పుడే మెలకువ వచ్చినట్టుగా లేచాను.

తమ్ముడిని భుజాన వేసుకుని బుట్ట పట్టుకుంది అమ్మ. నాన్న పెట్టె పట్టుకున్నారు. అందరం గుళ్లోంచి బైటకి నడిచాం. నేను ఒక్కసారి వెనక్కి తిరిగి మనసారా కోరుకున్నాను. "స్వామీ! వెంకటేశ్వరస్వామి నా కోరిక తీర్చలేదు, కనీసం నువ్వన్నా తీర్చవా"

కానీ నా కోరిక తీరకుండానే తిరుగు ప్రయాణం అయ్యాము.

నేను కోరుకున్నట్టుగా ప్రయాణం జరిగింది. కానీ తాతగారి దగ్గరకి వెళ్లాలన్న కోరిక మాత్రం నాకు తీరలేదు. వాళ్లెవరూ కనిపించలేదు కూడా.

★ ★ ★

మర్నాటినుంచి మామూలుగా మళ్లీ మా ఇల్లు, నాకు గచ్చకాయలు, తమ్ముడికి గోలీలు మిగిలాయి సెలవులైందాకా.

ఇరవై రోజుల తరవాత తిరిగి మా స్కూళ్లు తెరిచారు. మా ప్రోగ్రెస్ రిపోర్టు ఇచ్చారు. నాకు ఫస్ట్ ర్యాంక్ వచ్చింది. అమ్మానాన్నా చాలా సంతోషించారు. అమ్మ నన్ను దగ్గరకి తీసుకుని ముద్దు పెట్టుకుంటూ అంది "నువ్వు పెద్ద డాక్టర్‌వి అవాలిరా! అప్పుడు... అప్పుడు నేను గర్వంగా మానాన్న దగ్గరకి వెళతాను. నువ్వు డాక్టర్‌వి, తమ్ముడు ఇంజనీరు కావాలి. ఇది నా కల" అంది ఓ రకమైన స్వరంతో.

"మీ అమ్మ కల నిజంకావాలి మధూ. అందుకు నువ్వే సహకరించాలి" అన్నారు నాన్న.

ఏడెలా ఉన్నా నేను డాక్టర్‌ని అయాక అమ్మ నన్ను తాతయ్య దగ్గరికి తీసికెళ్తుందన్న ఆశతో నమ్మకంగా చెప్పాను "తప్పకుండా అవుతానమ్మా! మరి నువ్వు కూడా నన్ను తప్పకుండా తాతయ్య దగ్గరకి తీసికెళ్లాలి"

అమ్మ కన్నీళ్ల మధ్య నవ్వింది.

★ ★ ★

నేను ఆరో తరగతిలోకి వచ్చాను. వర్షాకాలం ప్రారంభమైంది. ఆ వర్షంలో తడుస్తూ స్కూలుకి వెళ్లడం అంటే నాకెంతో ఇష్టం. ఈ సంవత్సరం తమ్ముడిని కూడా స్కూల్లో చేర్పించారు. రోజూ నన్నూ, తమ్ముడినీ నాన్న సైకిలుమీద స్కూలు దగ్గర దింపేస్తారు. సాయంత్రం పూట మాత్రం నేనూ, శాంతీ తమ్ముడి చేయి చెరోవైపు పట్టుకుని నడిచి ఇంటికి వస్తాం. స్కూలు మా ఇంటికి దగ్గరే. నడవచ్చు నేను తమ్ముడిని తమ్మూ అంటోంటే శాంతి అన్నదోరోజు. "పేరుపెట్టి పిలవచ్చుగా. తమ్ముడూ అంటావేం? " అని. అప్పట్నించీ నేను వాడిని తేజా అని పిలవడం మొదలుపెట్టాను.

తేజ ఒకటో క్లాసులో చేరాడు. రోజూ సాయంకాలాలు వాడిచేత, అ, ఆలు దిద్దించడం కూడా నా డ్యూటీ. నాకు వాడంటే ఇష్టమేకాబట్టి ఆ డ్యూటీ ఏమంత కష్టంగా అనిపించలేదు.




# రచయితలకు మనవి

- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.
- ★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే అయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్ట్‌లోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారం లోనే పంపబడుతుంది.

ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్,
హైదరాబాద్ 500 482.



శ్రీచంద్ర




ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చ లేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

అగస్ట్ చతుర నవల **'నేనెవరిని?'**

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

మా స్కూళ్లు తెరిచి అప్పటికి రెండు నెల లైంది. అమ్మకి ట్యూషన్‌కి మరో నలుగురు పిల్లలు కుదిరారు. సాయంత్రం అయ్యేసరికి మా ఇంటి వరండాలో పదిమంది పిల్లలని కూర్చోబెట్టుకుని అమ్మ ట్యూషను చెబుతూ ఉంటుంది. ఈమధ్య అమ్మ మధ్యాహ్నంపూట అప్పడాలొత్తి, కందిపొడి లాంటి పొడులేవో తయారుచేసి చుట్టుప క్కల వాళ్లకిచ్చి డబ్బులు తీసుకుంటోంది. సాయంకాలాలు ట్యూషన్లు చెబుతోంది.

అప్పడాలంటే నాకు చాలా ఇష్టం. అప్ప డాలపిండి అన్నా చాలా ఇష్టం.

ఆరోజు ఆదివారం మాకు సెలవురోజు. నాన్నక్కూడా సెలవే కానీ ఆఫీసుకి వెళ్లారు. వాళ్లాఫీసులో ఏవో గొడవలు అవుతున్నా యని ఈమధ్య నాన్న ఉదయాన్నే పెంద లాడే వెళ్లడం, ఆలస్యంగా ఇంటికి రావడం చేస్తున్నారు. దాదాపు నెల రోజులుగా ఇలాగే సాగుతోంది. అప్పట్నించీ అమ్మ అప్పడాల పని పెట్టుకుంది.

నాన్న ఉదయాన్నే కొంచెం అన్నం తిని వెళ్లిపోయారు. నేనూ, తేజా, అమ్మా పదిం టికి అన్నాలు తినేశాం. తేజను దగ్గర కూర్చోబెట్టుకుని పలకమీద అక్షరాలు రాసిచ్చి వాటిని దిద్దిస్తూ అమ్మ అప్పడాల పిండి తడిపి వరండాలో కూర్చుని వత్తు తోంది.

నాకు విసుగ్గా ఉంది. పుస్తకాలు పక్కన పడేసి అమ్మ దగ్గరకి నడిచాను.

"నేను నీకు సాయం చేస్తాను. కాసిని అప్పడాలు నేనూ వత్తనా?" అన్నాను.

"నీకేం వచ్చు? అయినా వద్దులే. నాలాగా నువ్వు కూడా అప్పడాలొత్తు కుంటూ బతకాల్సి వస్తుంది. వెళ్లి చదువుకో! నీకేం చెప్పాను. బాగా చదువుకుని డాక్టర్ అవాలని చెప్పలేదూ!"

"నాకు చదువుకోవాలనిపించడంలేదు. విసుగ్గా ఉంది. కాసేపిక్కడే కూర్చుంటా"

"అయితే తమ్ముడిచేత అక్షరాలు దిద్దించు"

"అబ్బా! ఇప్పుడేం చేయాలనిలేదు. నేను ఇక్కడే కూర్చుంటాను"

అమ్మ నావైపు విసుగ్గా చూసింది. "ఎందుకే నా ఎదురుగా ఉత్సవవిగ్రహం లాగా. వెళ్లి చదువుకోవచ్చుగా. ఊరికే కూర్చుని ఏం చేస్తావు?"

"ఏం చేయను? నాన్న ఆఫీసుకి వెళ్లి పిల్చుకురానా? మనం కూడా ఎక్కడికేనా వెళదాం"

అమ్మ కొంచెం కోపంగా అంది, "మధూ! నీకీమధ్య బాగా తిరుగుడు పిచ్చి పట్టు కుంది. ఏదో పోనీలే సెలవుల్లో సరదా పడ్డా వని తిరుపతి తీసికెళ్లామా? ఎంత ఖర్చైందో తెలుసా? అసలే నాన్నగారికి పోయిన నెల జీతం ఇవ్వలేదు. ఈ నెల కూడా ఇస్తారో లేదో తెలియదు. ఓ పక్క వాళ్ల ఫ్యాక్టరీలో గొడవలు అవుతున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో నువ్వు అక్కడికెడదాం, ఇక్కడికెడదాం అనడం బాగాలేదు. పిచ్చి పిచ్చి ఆలోచనలు మానేసి వెళ్లి చదువుకో"

"నాన్నకి జీతం ఎందుకివ్వలేదు?" అడి గాను.

"వాళ్ల ఫ్యాక్టరీలో నష్టం వచ్చిందిట. డబ్బుల్లేవుట అందుకని"

"మరైతే నాన్న పనెందుకు చేయాలి?"

"పనిచేయకపోతే జీతం ఎలా ఇస్తారు?"

"ఇవ్వడం లేదన్నావుగా"

"అలాగని పనిచేయడం మానేస్తే ఉద్యో గంలోంచి తీసేస్తారు. ప్రస్తుతం ఫ్యాక్టరీకి నష్టంవచ్చింది. అందుకే జీతం ఇవ్వలేదు. మళ్లీ లాభంవస్తే తప్పకుండా ఇస్తారు. అయినా నీకెందుకీ అనవసర విషయాలు? వెళ్లి చదువుకోమన్నానా?"

నాకు మాత్రం ఇవాళ అసలు చదువుకో వాలని లేదు. ఎప్పుడూ ఇంట్లోనే కూర్చోవా లంటే ఎంత విసుగో! అమ్మ అర్థం చేసుకో దేంటో? "కాసేపు గీతావాళ్లింటికి వెళ్లి ఆడు కుని వస్తాను" మొండిగా అన్నాను.

"సరే తల్లీ వెళ్లిరా. నీకేదో పురుగు తొలు

స్తోంది. వెళ్లు"

నేనూ, తేజా కలిసి గీతావాళ్లింటికి వెళ్లాం.

నేను వెళ్లేసరికి గీతా వాళ్ల తాతయ్య బైట వరండాలో పడక్కుర్చీలో పడుకుని రేడియో వింటున్నారు. నన్ను చూడగానే కొంచెం గట్టిగా కేకేసారు. "గీతా ఈ అమ్మాయి వచ్చింది చూడు నీకోసం. నీపేరేంటే" అన్నారు నాతో.

"మధుమతి" చెప్పాను.

"మధుబాల అని పెట్టుకోకపోయావూ. సరిపోయేది అంటూ ఇట్రారా దగ్గరకి" అన్నారు.

నేను ఆయన దగ్గరకి నడిచాను. గీత అప్పుడే లోపల్నించి వచ్చింది. నన్ను తాత గారు దగ్గరకి తీసుకుని బుగ్గలు చిదుముతూ అన్నారు "ఏం చదువుతున్నావు? మా గీత క్లాసేనా? "

"అవును తాతయ్యా" అన్నాను.

తేజ ఆయన లాల్చీ జేబులో ఉన్న పెన్ను లాక్కుని "తాతయ్యా ఇది నాక్కావాలి" అన్నాడు.

"తీసుకోరా" అంటూ తాతయ్య పెన్ను తీసి తేజాకిచ్చారు.

అది చూసిన గీత రివ్వున వచ్చి తేజ చేతిలో పెన్ను లాక్కుని "ఏయ్! ఇది మా తాతయ్యది. నీకెందుకు? ఇలా ఇవ్వు" అంటూ గదిమింది. తేజ బిక్కమొహం పెట్టుకుని ఏడుపు లంకించుకున్నాడు.

"పోనీలేమ్మా! వాడికివ్వు. నీకింకొకటి స్తాను" అన్నారు తాతయ్య.

"ఇవ్వను. నువ్వు వాడికా నాకా తాతయ్యవి"

"ఇద్దరికీనూ"

"ఎలా అవుతావు? వాడికి తాతయ్యలేడు. వాళ్ల తాతయ్య వీళ్లని దగ్గరకే రానివ్వరు. వీళ్లు వెళితే ఇంట్లోంచి వెళ్లగొడతారు. వీళ్లమ్మా, నాన్నా మంచివాళ్లు కాదని వాళ్ల తాతయ్య ఇంట్లోంచి వెళ్లగొట్టారు. దీనికసలు ఒక్క తాతయ్య కూడా లేడు. నువ్వు మా తాతయ్యవే" అంటూ తాతయ్య మెడ చుట్టూ చేతులు పెనవేసుకుని ఉయ్యాల ఊగింది గీత.

నాకు బాగా ఉక్రోషం వచ్చింది. "ఏం కాదు తాతయ్య తిరుపతిలో ఉన్నారు. మేము వెళ్లి వచ్చాం" అన్నాను కోపంగా.

"అలాగా! అయితే నీకు మీ తాతయ్య ఏం ఇచ్చారో చూపించు" వెటకారంగా అంది గీత.

నాకు బాగా ఏడుపొచ్చింది. తేజని తీసుకుని ఏడుస్తూ బైటకి వచ్చి ఇంటివైపు పరిగెత్తాను.

"అమ్మా... నాకు ఇప్పుడు తాతయ్య కావాలి" అన్నాను ఇంట్లో అడుగు పెడుతూనే.

అమ్మ తెల్లబోయి చూసింది. "ఏం జరిగిందే" అడిగింది కొంచెం ఆందోళనగా.

"గీత నన్ను నాకు తాతయ్యలేడని, తాతయ్యకి మనమంటే ఇష్టం లేదని, మనింటికి రారని, మనల్నీ వాళ్లింటికి రానివ్వరని ఏదేదో అంది. ఏమైనా సరే, తాతయ్యని రమ్మని ఉత్తరం రాయి" మొండిగా అన్నాను.

అమ్మ కాస్సేపు ఏం మాట్లాడలేదు. అప్పడాలు వత్తడం అప్పటికే పూర్తి అయింది. పేపర్లమీద అవన్నీ పేర్చి, గాలికి ఆరబెట్టింది. తరవాత ఖాళీ అయిన బేసిన్, అప్పడాలపీట, కర్ర తీసుకుని లోపలికి వెళుతూ "రా ఇలా" అంది నాతో.

నేను అమ్మని అనుసరించాను. అమ్మ మంచంమీద కూర్చుని, నన్నూ, తేజనీ దగ్గరకి తీసుకుని అంది. "మనం తాతగారి దగ్గరకి తప్పకుండా వెళదాం. కానీ, ఇవాళ కాదు. మీ ఇద్దరూ బాగా చదువుకుని పెద్దవాళ్లయాక వెళ్లాలి. అప్పుడు వాళ్లు మిమ్మల్ని చూసి గర్వపడాలి. ఆ తరవాత ఎట్టిపరిస్థితుల్లోనూ మనల్ని వాళ్లు వదులుకోరు. మీరు వాళ్ల దగ్గరే ఉందురుగాని"

"నాకూ, తేజకీ తాతయ్య బొమ్మలు కొని





వ్వాలి. బట్టలు కొనివ్వాలి. గీతకి నేనవన్నీ చూపించాలి" అన్నాను.

"తప్పకుండా కొనిస్తారు. ఇంకా చాలా చాలా కొనిస్తారు. నా తల్లికదూ. నువ్విట్లా చేస్తే నేనెట్లా తట్టుకోనే. అర్థంచేసుకోడానికి ప్రయత్నించాలమ్మా. నేనందుకే చెప్తాను. ఎవరిళ్లకూ వెళ్లద్దు. హాయిగా మనింట్లో మనం ఉండాలి అని. వినకుండా వెళ్లావు. చూడు ఏం జరిగిందో!"

అంటూ అలా నన్ను ఓదారుస్తూ అప్పటి కప్పుడు మా ఇద్దరికీ జంతికలు చేసి పెట్టింది అమ్మ.

సాయంకాలం నాన్న పొద్దుపోయాక వచ్చారు. నాన్న చాలా దిగులుగా కనిపించారు. బాగా గడ్డం పెరిగిపోయింది. నేను గమనించ లేదుకానీ, నాన్న తిరుపతి నుంచి వచ్చాక బాగా చిక్కిపోయారు కూడా. ఎందుకు? ఫ్యాక్టరీలో నష్టం వచ్చిందనా? పాపం నాన్నని నేను విసిగించకూడదు. నాన్నకి నేనేమన్నా సాయంచేయాలి అనిపించింది.

రాత్రి పదిదాటింది. తేజ నిద్రపోయాడు. అమ్మా, నాన్న కూడా పడుకున్నారు. నేనొక్కదాన్నే వరండాలో కూర్చుని చదువుకుంటున్నాను. లోపల్నించి కొంతసేపటికి అమ్మ ఏడుపు వినిపించింది. నాన్న అమ్మని ఓదారుస్తున్న స్వరం కూడా వినిపించింది.

నేను గుమ్మందాకా వెళ్ళి వాళ్లేం మాట్లాడుకుంటున్నారో వినసాగాను.

"బాధపడకు నిర్మలా. కష్టాలు ఎంతకాలం ఉంటాయి చెప్పు. ఎప్పటికీ మన దగ్గరే ఉంటాయా? వాటికీ మన మధుకిలాగా ఎప్పుడూ మన చుట్టూనే తిరగాలంటే విసుగురాదూ! అయినా, ఎంత. మహా అంటే ఇంకోనెల. అంతే. మళ్ళీ ఫ్యాక్టరీ పుంజుకుంటే మన జీతం మనకి వస్తుంది"

"ఏపూటకాపూట సరుకులకోసం వెతుక్కుంటూ బతుకుతున్న వాళ్లం మనం. వచ్చే జీతమే సరిగా సరిపోక అవస్థపడుతోంటే అసలు జీతం రాకపోతే ఎలా బతుకుతాం! ఈ ఊరునుంచి పట్నం వెళ్ళిపోదామండి. అక్కడ నాకూ ఏదన్నా ఉద్యోగం దొరుకుతుంది. ఎంతకాలం ఇలా?" అమ్మ స్వరం.

ఆ తరవాత ఇంకేమీ సరిగ్గా వినిపించలా

★ ★ ★

ఓ రోజు... నా జీవితంలో అత్యంత భయంకరమైన రోజది. అలాంటి రోజు నా జీవితంలో వస్తుందని, నేను అన్ని కష్టాలు, అంత దుఃఖం ఎదుర్కోవాల్సి వస్తుందని ఎన్నడూ ఊహించలేదు. నేను క్లాసులో కూర్చుని ఉన్నాను. ఇంగ్లీషు టీచరు పాఠం చెబ్తున్నారు. నేను చాలా శ్రద్ధగా వింటున్నాను. ఇంతలో శాంతి వాళ్ళ నాన్నగారు మా క్లాసులోకి వచ్చారు. శాంతి నా పక్కనే కూర్చుంది. నేను ఆయన్ని చూడగానే తనని మోచేత్తో పొడిచి అన్నాను. "శాంతీ! మీ నాన్నగారు"

శాంతి కూడా వాళ్లనాన్నను చూడగానే చటుక్కున లేచింది. అయితే, ఆయన దాన్ని పట్టించుకోకుండా క్లాసుటీచర్ దగ్గరకి వెళ్ళి

నెమ్మదిగా ఏదో మాట్లాడారు. ఆవిడ మొహంలో రంగులు మారాయి. "ఏసీ... అరే" అంటూ "మధూ ఇలారా" అంటూ నన్ను పిలిచారు.

నాకేం అర్థంకాలేదు. శాంతి వాళ్ళ నాన్న గారు వస్తే నన్ను పిలుస్తున్నారేంటి? తనని కదా పిలవాల్సింది.

నెమ్మదిగా లేచి ఒళ్లో ఉన్న పుస్తకాలు పక్కన బెంచీమీద పెట్టి లేచి టీచర్ దగ్గ రకు వెళ్లాను. "మీ మావయ్యగారితో కలిసి ఇంటికి వెళ్లు. పుస్తకాలు తీసుకుని వెళ్లు" అన్నారు టీచర్.

"ఎందుకు టీచర్? ఇంకా బెల్ అవలేదు కదా" అన్నాను అయోమయంగా చూస్తూ.

టీచర్ ఏం మాట్లాడకుండా సైగచేసింది పుస్తకాలు తీసుకుని వెళ్లు అన్నట్టుగా. నేను ఆయన్ని మావయ్యగారూ అని పిలుస్తుం టాను. ఆయనవైపు చూస్తూ "ఎందుకు మావయ్యగారూ. అమ్మ రమ్మందా" అని అడిగాను.

ఆయన కండువాతో కళ్లు తుడుచుకుని "అవునమ్మా రా త్వరగా వెడదాం" అన్నారు.

నేను పుస్తకాలు తీసుకుని "శాంతీ నేనిం టికి వెడుతున్నాను" అంటూ బయల్దేరాను. శాంతి కూడా మేమెందుకు వెడుతున్నామో అర్థంకాక నేనూ వస్తాను అంటూ పుస్తకాలు తీసుకుని మా దగ్గరకు వచ్చింది. ఆయన ఏం మాట్లాడకుండా మమ్మల్నిద్దరినీ వెంట పెట్టుకుని తేజ క్లాసుకి వెళ్లి వాడిని ఎత్తుకు న్నారు. వాడి పలకా, బలపం నేను పట్టుకు న్నాను. అందరం కలిసి ఇంటికి వెళ్లాం. మేము ఇంటికి వెళ్లేటప్పటికి వరండాలో చాపమీద నాన్న పడుకుని ఉన్నారు. ఆయన మీద మొహందాకా తెల్లటి దుప్పటి కప్పి ఉంది. నాన్న ముక్కులో దూది ఉంది. తలవెనుక ప్రమిదలో దీపం వెలుగు తోంది. అమ్మ నాన్న పాదాలమీద పడుకుని కుమిలి కుమిలి ఏడుస్తోంది. శాంతీ వాళ్ల అమ్మగారు అమ్మ పక్కన కూర్చుని ఆవిడా ఏడుస్తూ అమ్మని ఓదార్చడానికి ప్రయత్నిస్తు న్నారు. నాకేం అర్థం కాలేదు.

అమ్మ దగ్గరగా నడిచి "అమ్మా... నాన్న కేమైంది" అనడిగాను.

అమ్మ తలెత్తి, నన్ను గట్టిగా దగ్గరకి తీసు కుని బావురుమంది. అమ్మ ఏడుపు చూసి భయపడిన తేజ ఏడుస్తూ అమ్మ దగ్గరకి వచ్చి ఒళ్లో వాలిపోయాడు. మా ఇద్దర్నీ చెరోచేత్తో దగ్గరకి అదుముకుని "నాన్న, నాన్న మనకింక లేరుతల్లీ" అంటూ గట్టిగా ఏడవసాగింది. "ఇంకలేరు. మనకి ఆయన లేరు. మనం ఇంక ఎలా బతుకుతాము? ఏం చేస్తాము? ఆయనలేకుండా ఎలా బత కడం? " అంటూ వెక్కివెక్కి ఏడవసాగింది. ఆ వాతావరణం, కదలకుండా కట్టెలా పడి ఉన్న నాన్న ఇదంతా చూస్తే నాకు కూడా భయంతో ఏడుపువచ్చింది. గట్టిగా ఏడ వటం మొదలుపెట్టాను. పక్కింటివాళ్లు, ఎదురింటివాళ్లు అందరూ మమ్మల్ని ఓదార్చ డానికి ప్రయత్నించసాగారు.

"ఏడవకమ్మా నిర్మలా. ఏం చేస్తాం చెప్పు. చావు, పుట్టుకలు మన చేతుల్లో ఉన్నాయా? ఏడవకు. చూడు పిల్లలెలా బెంబేలు పడిపోయారో. నువ్వే ఇలా అయి పోతే ఆ పిల్లల్ని ఎవరుచూస్తారు. మనసు గట్టిచేసుకుని ఆ పిల్లలకోసం నువ్వు బత కాలి. ఏడవకమ్మా. నా తల్లి కదూ!" అంటూ ఓదార్చసాగారు. శాంతి వాళ్లమ్మ కూడా అమ్మని దగ్గరకు తీసుకుని ఎంతో ధైర్యం చెప్పడానికి ప్రయత్నించసాగింది. అయినా, అమ్మగానీ, నేనుగానీ, తమ్ముడు గానీ ఎవరం కూడా ఏడుపు ఆపుకోలేక పోయాం. నాన్న చనిపోయారు. నాన్న మాకింకలేరు. నాన్నమాతో మాట్లాడరు. సైకిలుమీద మమ్మల్ని ఎక్కడికీ తీసికెళ్లరు. ఈ విషయాలు జీర్ణం చేసుకున్నాక గట్టిగా "నాన్నా! నాన్నా! మాట్లాడు నాన్నా!" అంటూ నాన్నని కుదుపుతూ ఏడవసాగాను. నా ఏడుపు చూసిన శాంతి కూడా బావురు





మంది. వాళ్ళమ్మ ఒక్కక్షణం తెల్లబోయి నట్టు తలెత్తి, ఖంగారుగా నన్ను, తననీ దగ్గ రకు తీసుకున్నారు.

"చూడమ్మా నిర్మలా! పిల్ల భయపడిపో యింది. నువ్వు నెమ్మదించాలి. మనం మాత్రం పోమూ ఎప్పటికో అప్పుడు అందరం పోవాల్సినవాళ్లమే. ధైర్యం తెచ్చుకో వాలి. జరగాల్సింది చూడండి" అంటూ అందరూ అమ్మని బలవంతంగా లేవనె త్తారు. అమ్మ లేచినట్టే లేచి మళ్ళీ కుప్పకూ లిపోయింది.

నేనూ తేజా గట్టిగా "అమ్మా!" అని అరిచాం. ఆ తరవాత ఏం జరిగిందో నాకు తెలియదు.

తెలిసేటప్పటికి ఇంట్లో నేనూ, అమ్మా, తేజా మిగిలాం. రోజూ శాంతి వాళ్ళమ్మగారే నాకూ, తేజకీ అన్నం పంపిస్తున్నారు. అమ్మ క్కూడా దగ్గరుండి బతిమాలి తినేలాగా చూస్తున్నారు. అమ్మ నాతో కానీ, తేజతో కానీ మాట్లాడడంలేదు. అమ్మ స్వరంలో ఏదన్నా శబ్దం వస్తుందంటే అది ఏడుపు మాత్రమే అవుతోంది "నేనెలా బతకను? నేనెలా బతకను? " అంటూ ఏడుస్తోంది.

"తప్పదమ్మా... బతకాలి. ఈ పిల్లలకోసం బతకాలి" అంటూ ఆవిడ ఓదార్చసాగారు.

పదిరోజులు గడిచిపోయాయి. నాన్న మాకు శాశ్వతంగా దూరం అయిపోయా రన్న వాస్తవం నెమ్మదిగా అర్థం అవుతోంది. ఆరోజు చుట్టుపక్కల వాళ్లంతా వచ్చి అమ్మతో ఏదో మాట్లాడారు. తాతగారు వాళ్ళ అడ్రస్ ఇవ్వమన్నారు. "నా దగ్గరలే దండీ" అంటూ అమ్మ బావురుమంది.

"మరెలా? అల్లుడు పోయినట్టు మీ వాళ్లకి, కొడుకుపోయినట్టు వాళ్ల వాళ్ళకి కబురు చేయవా? మిగతా కార్యక్రమం జర గద్దూ" అన్నారంతా... అమ్మ ఏం మాట్లాడ లేదు.

అందరూ ఏదేదో అన్నారు. అమ్మ ఏడుస్తూ ఉండిపోయిందేకానీ, ఎవరికీ ఏం సమాధానం చెప్పలేదు.

శాంతి వాళ్ళమ్మగారే వాళ్లతో ఏదో మాట్లాడారు. అందరూ కలిసి అమ్మని ఎక్క డికో తీసుకెళ్లారు. అమ్మ తిరిగి వచ్చేటప్ప టికి ఆవిడ నుదుట బొట్టులేదు. మెడలో నాకిష్టమైన మంగళసూత్రం లేదు. చేతులకి గాజులు లేవు. జుట్టు విరబోసి ఉంది. తెల్ల చీర కట్టుకుని, చెంగు భుజం నిండా కప్పు కుని గదిలో ఓ మూల గోడకానుకుని కూర్చుని కుమిలి కుమిలి ఏడవసాగింది.

నేనూ, తేజా అమ్మదగ్గరే కూర్చుని అమ్మని ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నాం. అమ్మ మెడలో తాళిబొట్టు ఏమైంది? ఈ ఒక్క విషయం నాకర్థంకాలేదు.

సాయంత్రానికి శాంతివాళ్లమ్మగారు వచ్చి ఆ తాళిబొట్టు నా చేతికిచ్చి, "లోపల దాచు మధూ!" అన్నారు.

నా చేతుల్తో ఆ తాళి పట్టుకుంటే నాకు చేతులు వణికాయి. నాన్న చనిపోయారని తాళిబొట్టు తీసేశారు. ఇంతేనా తాళి అంటే. నాకేం అర్థంకాలేదు. అమ్మ మాటలు గుర్తొ చ్చాయి. ఇది మెడలో పడిన మరుక్షణం నుంచీ ఆడదానికి బాధ్యతలు పెరుగు తాయి. సహనం పెరగాలి. ఇవి వేసుకుంటే సమాజంలో గౌరవం, రక్షణ లభిస్తుంది. పదిమందిలో గుర్తింపు లభిస్తుంది.

మరి ఇప్పుడు. ఇవి తీసేసింది. ఇకనుంచీ అమ్మకి సమాజంలో రక్షణ లభించదా? గౌరవం లభించదా?

ఆ విషయం నాకు కొంతకాలానికిగానీ తెలియలేదు. అమ్మ నెమ్మదిగా బాధ దిగ మింగి కోదండపాణి మావయ్యని తనకే దన్నా ఉద్యోగం చూపించమని అడిగింది.

ఆయన "సరేనమ్మా ప్రయత్నిస్తాను" అన్నారు.

"మధూ! పిల్లల్ని రమ్మని చెప్పిరా నాన్నా. ట్యూషన్లు ప్రారంభిద్దాం. ఇప్పటికే చాలారో జులైంది" అంది.

నేను పిలుచుకురావడానికి వెళ్లాను. కానీ

వాళ్ళంతా ట్యూషన్లు మార్చుకున్నామని చెప్పారు. ఏడుస్తూ వెళ్ళి అమ్మతో చెప్పానీ మాట... అమ్మ షాక్ తగిలినట్టు ఉండిపోయింది.

ట్యూషన్లు లేవు... నాన్న లేడు... జీతం లేదు. ఇంట్లో డబ్బుల్లేవు... సరుకులు లేవు.

అమ్మ కళ్లల్లో కృష్ణా, గోదావరి నదులు. మా గుండెల్లో వేదన. మా కడుపులో ఆకలి. ఇదీ పరిస్థితి.

శాంతివాళ్లు కూడా మాకు సాయంచేయడంలేదీ మధ్య. నాన్న పోయాక కొన్ని రోజులు టిఫిన్లు, అన్నం, కూరలు వస్తుండేవి. అక్కడినుంచి ఈమధ్య అవేం రావడం లేదు. శాంతి వాళ్ళమ్మగారు కూడా ఎక్కువగా రావడంలేదు.

ఓరోజు నేను వాళ్లింటికి వెళ్లాను. బాగా ఆకలేస్తోంది. వాళ్లింటికి వెడితే నాకు ఏదో ఒకటి పెడతారు. అందుకే వెళ్లాను. శాంతి, వాళ్ళ తమ్ముడు క్యారమ్స్ ఆడుకుంటున్నారు. వాళ్ళమ్మగారు నన్ను చూసి మొహం చిట్లించుకుని లోపలికెళ్ళిపోయారు.

నేను శాంతిని పలకరిస్తూ తన పక్కనే కూర్చుని క్యారమ్సు ఆట గమనించసాగాను.

లోపలినుంచి శాంతివాళ్లమ్మ స్వరం వినిపించింది. "ఇంకా ఎంతకాలం ఈ గోల? ఇప్పటికే మూడునెల్లైంది అద్దె ఇచ్చి. అటు ఊరికే ఇల్లు ఇచ్చి, ఇటు తిండిపెడుతూ మనకేం ధనరాసులున్నాయా? ఇంక చేసింది చాలు... ఆవిణ్ణి పంపించండి"

"పాపం! ఆ పిల్లలతో ఎక్కడికెళుతుంది అనంతం" అంటున్నారు శాంతీ వాళ్ళ నాన్నగారు.

"ఎక్కడికన్నా చావమనండి. నాకెందుకీ తద్దినం? అసలే వయసులో ఉంది. మగాళ్ల కళ్లన్నీ ఆవిడమీదే ఉంటాయి. పిల్లకూడా ఎదుగుతోంది. వాళ్లని నేనెక్కడ కాపలా కాయను! నా వల్లకాదు. అయినా నాకేం చుట్టమా? పక్కమా? కొంతకాలం ఎవరన్నా సాయంచేయగలరు! అయినా వాళ్లకి పంతం ఉంటే ఈవిడకి కూడా ఎందుకీ పంతం? వెళ్ళి తల్లితండ్రులనో, మావగారినో బతిమాలుకుని, వాళ్ళ కాళ్లు పట్టుకుని వాళ్ళ అండలో ఉండడం ఆవిడకీ మంచిది. ఆ పిల్లలక్కూడా మంచిది. రేపు ఆ పిల్ల పెళ్ళిచేయాలన్నా, మగపిల్లాడిని వృద్ధిలోకి తీసుకురావాలన్నా ఎవరో ఒకళ్ల అండలేకపోతే ఏం చేయగలదీవిడ"

నాకు స్పష్టంగా వినిపిస్తున్నాయి వాళ్ళ మాటలు. వాళ్లు మాట్లాడుకుంటుంది అమ్మ గురించే అని అర్థమైపోయింది. అక్కడ ఒక్కక్షణం కూడా ఉండకుండా ఇంటికి వెళ్ళిపోయాను.

అప్పటికి అమ్మ బజారుకెళ్ళి సరుకులు తీసుకొచ్చి వంట చేస్తోంది.

అమ్మ దగ్గర డబ్బులెక్కడివో నాకర్థంకాలేదు.

నన్ను చూడగానే "తమ్ముడిని ఒక్కణ్ణీ వదిలి ఎక్కడికెళ్లావమ్మా" అంది.

నేనేం సమాధానం చెప్పలేదు. మౌనంగా అమ్మ దోసకాయ చెక్కు తీస్తోంటే ఆ చెక్కు తీసి చెత్తడబ్బాలో పడేశాను.

కాస్సేపటికి అమ్మ దోసకాయ పప్పుచేసి నాకూ, తేజకీ అన్నం పెట్టింది. "నువ్వు కూడా తినమ్మా" అన్నాను.

"తింటాలే మీరు తినండి" అంది.

"లేదు... నువ్వు తింటేనే నేనూ తింటాను" అన్నాను మొండిగా.

అమ్మ "మధూ" అంటూ ఏడ్చింది.

"తినమ్మా" అంటూ నా కంచంలో పెట్టిన అన్నంలో పప్పు కలిపి, ముద్ద అమ్మ నోటికి అందించాను.

మర్నాడు తెలిసింది నాకు అమ్మ నాకిష్టమైన తాళిబొట్టు అమ్మేసిందని. అది కూడా అలమరలో నేను దాచినచోటు చూస్తే కనిపించకపోతే అర్థంచేసుకున్నాను.

"మీరిద్దరూ రేపట్నించీ స్కూలుకి వెళ్ళండి. ఫీజు కడ్తాను" అంది మర్నాడు.

రెండునెలల ఫీజు కట్టలేదని హెడ్‌మి





స్త్రైస్ స్కూలుకి రావద్దంది మమ్మల్ని.
కానీ నాకు వెళ్లాలని లేదు. అదే అన్నాను "వద్దమ్మా. ఆ డబ్బుల్తో మనం తాతగారి దగ్గరకు వెళదాం"
అమ్మ కోపంగా చూసింది. "మళ్ళీ మొద లుపెట్టావా? "
"అది కాదమ్మా. ఇక్కడ మనల్ని ఎవరు చూస్తారు? ఈ ఇంటికి మనం అద్దెక ట్టాలా? డబ్బులు ఎక్కడినుంచి వస్తాయి? "
"నీకెందుకే ఈ విషయాలన్నీ నేను బతి కున్నాగా"
"అది కాదమ్మా" నేనేదో చెప్పబోయేలో పల కోదండపాణి మావయ్య వచ్చారు. వస్తూనే అమ్మని ఉద్దేశించి అన్నారు.
"ఆవేశపడకు నిర్మలా. మధు అనేది నిజం. నీకిప్పుడు వాళ్ల అవసరం చాలా ఉంది. పంతాలూ, పట్టింపులూ ఎల్లకాలం ఉండవు. వెళ్ళి వాళ్ల కాళ్లు పట్టుకుని బతి మాలి అక్కడే ఉండు. ఈ వయసులో నువ్వూ, ఎదిగిన ఈ పిల్లను పెట్టుకుని వంటరిగా ఉండడం మంచిదికాదు. మేము మాత్రం ఎంతకాలం మీకు తోడుగా ఉండ గలం!"
"అన్నయ్యగారూ" అమ్మ నిర్ఘాంతపోతూ పిలిచింది.
"అవునమ్మా... నీకీఊళ్లో ఉద్యోగం దొర కడం అసంభవం... వెళితే మీ నాన్నగారి దగ్గరకో, మావగారి దగ్గరకో వెళ్లు. లేదంటే నా స్నేహితుడు ఒకడు హైదరాబాదులో ఓ స్కూలు పెట్టాడు. వాడి అడ్రసు ఇస్తాను. అక్కడికెళితే ఏదన్నా ఉద్యోగం దొరకచ్చు ప్రయత్నించు"
ఇంతలో శాంతీవాళ్లమ్మగారు కూడా వచ్చారు. వస్తూనే అమ్మతో అందావిడ. "అవును నిర్మలా! ఈ ఊళ్లో నువ్వింక ఉండడం క్షేమంకాదు. అందరి కళ్లూ నీమీదే ఉంటాయి. ఇంతకాలం నీ తల్లీ, తండ్రి ఎవరు? అత్తా, మామలెందుకురారు? మీరెందుకు ఎక్కడికీ వెళ్లరు? బంధువులతో సంబంధాలు ఎందుకు లేవు? అనే ప్రశ్నల న్నిటికీ సమాధానంగా ఆ అబ్బాయి ఉండే వాడు. నీ మెడలో ఆ మంగళసూత్రం ఉండేది. ఇప్పుడు ఆ రెంటికీ నువ్వు దూరం అయ్యావు. ఈ పల్లెటూరువాళ్లకి కలిగే అనేక అనుమానాలకి, సందేహాలకి నువ్వు సమాధానం చెప్పలేవు. నేను మాత్రం ఎల్ల కాలం నిన్ను కాపాడగలనా చెప్పు. ఇంత కాలం ఎలాగో నిన్ను సమర్థిస్తూ వచ్చాను"
అమ్మ ఏడుస్తూ అంది "చాలు...చా లండి... చాలు... ఇంతకాలంనుంచీ స్వంత అక్కయ్యలా నన్ను ఈ జనాల ప్రశ్నల నుంచి, విమర్శలనుంచి కాపాడారు. మీర న్నట్టు ఇప్పుడు భర్తలేని, తాళిబొట్టులేని నేను ఓ పెద్ద ప్రశ్నగా మిగిలిపోతానీ ఊరు ప్రజలకి. కానీకానీ నాకు పట్నం వెళ్లేంత ధైర్యం లేదండి. ఆయన అండగా బతికానే కానీ నేను ధైర్యస్తురాల్ని కాను. నావల్ల కాదు"
"చూడమ్మా ధైర్యం ఆ భగవంతుడే ఇస్తాడు. పరిస్థితుల్ని సృష్టించే దేవుడు, వాటిని ఎదుర్కొనే శక్తి మాత్రం ఇవ్వడూ! తప్పకుండా ఇస్తాడు. ఆయన్ని నమ్ముకుని కొత్త జీవితం ప్రారంభించు"
అలా చాలాసేపు వాళ్లు అమ్మకి నచ్చచెప్పి, ఆఖరికి "మూడునెల్లనుంచీ అద్దె ఇవ్వకపో యినా మేమేం అనలేదు. ఇంకెంతకాలం చెప్పు. మాకు మాత్రం ఏం పెద్ద ఆస్తిపాస్తు లున్నాయి" అన్నారు.
అమ్మకి అప్పుడు అర్థమైంది. గాఢంగా నిట్టూర్చింది.
వాళ్లు వెళ్ళిపోయారు. అమ్మ కూర్చున్న చోటే ఆలోచిస్తూ మౌనంగా కూర్చుండిపో యింది. ఆవిడ కళ్లలోంచి ధారాపాతంగా కన్నీళ్లు వస్తున్నాయి.
అమ్మని చూస్తుంటే జాలేసింది. ఏడుపు కూడా వచ్చింది. నాకు ఆలోచనా జ్ఞానం పెరుగుతోందేమో. హఠాత్తుగా అమ్మదగ్గ రకి నడిచి, కళ్లు తుడుస్తూ అన్నాను.



"అమ్మా... ఏడవకమ్మా... ధైర్యంగా ఉండు. నాన్నగారికి దణ్ణంపెట్టుకుందాం. ఆయన మనకి ధైర్యం ఇస్తారు. పదమ్మా. మనం గుంటూరు వెడదాం. తాతగారిదగ్గ రకు. ఆయన మనల్ని తప్పకుండా రానిస్తారు" అన్నాను.

అమ్మ ఆశగా చూసింది. "రానిస్తారా?" అంది.

"తప్పకుండా రానిస్తారు. నేను చెప్తాగా" అన్నాను.

"వెళ్ళి ఎక్కడ ఉంటామే! అడ్రసు దొరక్కపోతే ఏ ప్లాట్ ఫారంమీదో పడుకోవాలి. మీతో నేను ప్లాట్ ఫారమ్‌మీద ఉండగలనా! ఆఖరికి మీ బతుకులు రోడ్డుపాలు చేయనా?" ఏడుస్తూ అంది అమ్మ.

"ఏడవకమ్మా. నువ్వేడిస్తే నాకూ ఏడుపొస్తుంది. నాన్న ఇంక రారుకదామ్మా. మనకి ఆకలేస్తే మనమే సంపాదించుకోవాలి. తేజకి ఆకలేస్తే మనమే సంపాదించి పెట్టాలి. ఏడిస్తే ఎట్లామ్మా. ఏడవకు. నేను పెద్దదాన్ని అయ్యానుగా. ఒకవేళ తాతగారూ వాళ్లు గుంటూరులో మనకి కలవకపోతే హైదరాబాదు వెళదాం. అక్కడే ఉందాం. ఎక్కడన్నా పనిచేద్దాం అన్నాను" అమ్మ కళ్లు తుడుస్తూ.

"నా తల్లే!" అంటూ అమ్మ నన్ను గట్టిగా గుండెలకి హత్తుకుంది.

అలా అనుకున్న వారం రోజులకి మేము ముగ్గురం సామాను సర్దుకుని గుంటూరు బయలుదేరాం. వెళ్లేటప్పుడు అమ్మ ఇంట్లో ఉన్న ఇత్తడి బిందెలు అమ్మి వచ్చిన డబ్బు శాంతివాళ్లకిచ్చింది. "మిగతా డబ్బు ఎప్పటికైనా మనియార్డరు చేస్తాను. క్షమించండి ఇబ్బంది కలిగిస్తున్నందుకు" అంది.

ఆవిడ ఏం మాట్లాడలేదు. డబ్బు వద్దని కూడా అనలేదు. మౌనంగా తీసుకుంది.

మా ఊరునుంచి నేరుగా గుంటూరుకి బస్సుల్లేవు. విజయవాడ వెళ్ళి వెళ్లాలి. విజయవాడదాకా శాంతీ, వాళ్ళనాన్నగారు వచ్చారు. చిన్న కారు తీసుకొచ్చి మమ్మల్ని కారులో విజయవాడ తీసుకెళ్ళి, గుంటూరు బస్సెక్కించారు.

అమ్మ శాంతీ వాళ్ళ నాన్నగారికి నమస్కరిస్తూ, "మీ మేలు జన్మలో మర్చిపోను అన్నయ్యగారూ. బతికుంటే మళ్ళీ ఎప్పటికైనా కలిసి మీకు కృతజ్ఞతలు తెలియచేసుకుంటాను. ఉంటాను" అంది.

"అంతమాట అనకమ్మా. మీకు అంతా మంచి జరుగుతుంది. మీరు తప్పకుండా మీ వాళ్ల దగ్గరకు వెళతారు. ఒకవేళ ఏదన్నా సమస్యవస్తే నాకు జాబు రాయి. ఇదిగో ఇది హైదరాబాదులో మా స్నేహితుడి అడ్రసు. గుంటూరులో నీకు అనుకూల పరిస్థితులు లేకపోతే హైదరాబాదు వెళ్లు. పట్నంలో పట్టించుకునేవాళ్లుండరు" అన్నారు ఆయన.

"జాగ్రత్తమ్మా.... అమ్మకి సాయంగా ఉండు. నువ్విప్పుడు పెద్దదానివైనావు. అమ్మనీ, తమ్ముడినీ నువ్వే చూసుకోవాలి" అన్నారు నాతో.

"అలాగే మావయ్యగారూ" వినయంగా చెప్పాను.

అరటిపళ్లు కొనిచ్చారు.

బస్సు కదిలింది.

అమ్మ సీట్లో జారగిలబడింది. "అరటిపండు తినమ్మా" అంటూ పండు అందించాను.

"నాకేం వద్దు తల్లీ మీరు తినండి" అంది అమ్మ.

"నువ్వు తినకపోతే నేనూ తినను" అన్నాను.

"ఎందుకే విసిగిస్తావు?" అంటూ అమ్మ నిస్పృహాయంగా పండు తీసుకుని చాలాసేపు అలా చేతిలో పట్టుకుని ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. అమ్మ తిన్నదాకా నేనూ అలాగే చేతిలో పట్టుకుని ఉండిపోడంతో చివరికి అమ్మ పండు తింది.

రెండుగంటల తరవాత మా బస్సు





గుంటూరు చేరింది.

నా జీవితంలో నేను చేసిన రెండో ప్రయాణం అది.

బస్టాండులో బస్సు దిగి, సామాను కష్టంగా కిందికి దించాం. అమ్మ ఒక చేత్తో తేజ చేయి పట్టుకుని, మరో చేత్తో పెట్టె పట్టుకుంది. భుజానికి సంచీ తగిలించుకుంది. నేను రెండు చేతుల్లో రెండు ప్లాస్టిక్ బుట్టలు, భుజానికి ఒక సంచీ తగిలించుకున్నాను.

తిరుపతి వెళ్లేటప్పుడు నాన్న పెట్టె పట్టుకుంటే అమ్మ ప్లాస్టిక్ బుట్ట పట్టుకుంది. కానీ ఇవాళ నాన్న లేరు. నాకు బాగా ఏడుపొచ్చింది. అమ్మ చూడకుండా కళ్లు తుడుచుకుని నడవసాగాను. చేతులు నొప్పిపుడుతున్నాయి. సంచీ, బుట్టలు కూడా బరువుగా ఉన్నాయి. వాటిల్లో మా వంట సామాను ఒకదాంట్లో, మరో దాంట్లో మా బట్టలు, ఇంకొన్ని బట్టలు పెట్టెలో. అమ్మ సర్టిఫికెట్లున్న బ్యాగులోనే మా పుస్తకాలు కూడా పెట్టింది. ఆ సంచీ తనే మోస్తోంది.

మేమిద్దరం అలాగే బలవంతంగా కాళ్లీడ్చుకుంటూ బస్‌స్టాండ్ బైటకి వచ్చాం. అక్కడ కనిపిస్తోన్న హోటల్ దగ్గరగా నడిచాం.

అమ్మ నెమ్మదిగా సందేహిస్తూ, హోటల్ మెట్లు ఎక్కి, ప్రొప్రయిటర్ దగ్గరకి వెళ్లింది.

"ఎవరమ్మా ఏంకావాలి? " అడిగాడు ఆయన.

"ఈ ఊళ్లో లక్ష్మయ్య హోటల్ ఎక్కడ ఉందో చెప్పగలరా? "

"లక్ష్మయ్య హోటలా? ఏ పేట? " అడిగాడాయన.

"ఇక్కడే బస్టాండుకి దగ్గరలో ఉంటుందని విన్నాను"

"ఇక్కడెక్కడా ఆ పేరుగల హోటల్ లేదే" అంటూ "ఒరేయ్ చంటబ్బాయ్" అంటూ కేకపెట్టాడు. సర్వర్‌లందరిలోకి పెద్దవాడుగా అనిపిస్తోన్న సర్వర్ పరిగెత్తుకొచ్చాడు.

"ఇక్కడెక్కడన్నా లక్ష్మయ్య హోటల్ ఉందా? నువ్వుగాని చూశావా? " అడిగాడు.

"లక్ష్మయ్య హోటలా? " అతను అమ్మ వైపు తేరిపారచూస్తూ అడిగాడు.

అమ్మ దీనంగా అంది "అవునుబాబూ... ఆయన మా మావగారు" అందమ్మ.

"లక్ష్మీనివాస్ ఉంది గానీ, లక్ష్మయ్య హోటల్ లేదమ్మా" అన్నాడు.

'బాగా గుర్తుతెచ్చుకో బాబూ... పూర్తిగా శాకాహార హోటల్... ఈమధ్యే భోజన హోటలుగా మార్చారని తెలిసింది. ఇదివరకు వట్టి టిఫిన్ సెంటర్‌గా ఉండేది"

"మీరెక్కడినుంచి వస్తున్నారమ్మా? " అడిగాడు ప్రొప్రయిటర్.

"విజయవాడనుంచి"

"అరే పాపం... ఓ పని చేయండి పిల్లల్తో వచ్చారు. కాస్త టిఫిను తిని ఆ పక్క హాల్లో కూర్చోండి ఈ సామాను పెట్టుకుని సాయంకాలానికి కనుక్కుందాం"

అమ్మ కళ్లల్లో మెరుపు కనిపించింది.

"మీకిబ్బంది కదా బాబూ" అంది మొహమాటంగా.

"ఇబ్బందేంలేదమ్మా... రండి... లోపలికి రండి. చంటబ్బాయ్... వేడి వేడి ఇడ్లీ పెట్టు వీళ్లకి" మమ్మల్ని ఆహ్వానిస్తూ చంటబ్బాయికి పని పురమాయించాడు.

అమ్మ వెనకాలే మేము లోపలికి నడిచి హాల్లోకి వెళ్లాం. అక్కడ చెక్కబల్లలు ఉన్నాయి. సామాను ఓ మూలకి పెట్టుకుని, చెక్కబల్లమీద కూర్చున్నాం. చంటబ్బాయి మాకు అరిటాకుల్లో ఇడ్లీలు అల్లం పచ్చడి, నెయ్యి తీసుకొచ్చి ఇచ్చాడు. బాగా ఆకలిగా ఉన్నామేమో ఆవురావురుమంటూ తిన్నాం నేనూ, తేజా... అమ్మ కూడా కన్నీళ్లు తుడుచుకుంటూ రెండు ఇడ్లీ తింది "ఇంకా ఈ కాలంలో కూడా మానవత్వం మిగిలిఉంది ఎంత మంచి మనిషి ఈ హోటల్ ప్రొప్రయిటర్. మన ముక్కూ, మొహం తెలియకపోయినా ఆడవాళ్లం అని దయతలిచి

ఆశ్రయం ఇచ్చాడు" అంది.

అవును అనుకున్నాను. నాక్కూడా ఆయన చాలా మంచివాడిలా అనిపించారు.

ఇడ్లీలు తిన్నాక తేజ నిద్రపోయాడు. నేనూ ఆ బల్లమీద పడుకుని కాస్సేపటికి నిద్రపోయాను.

సాయంకాలానికి మెలకువ వచ్చేటప్పటికి బాగా చీకటిపడింది. అమ్మ మా పక్కన లేదు. నేనూ, తేజా మాత్రమే ఉన్నాం. వాడు వేలు నోట్లోపెట్టుకుని అమ్మా... అంటూ ఏడుస్తున్నాడు. నేను గట్టిగా అమ్మా అని పిలిచాను.

సమాధానం రాలేదు.

తేజని ఎత్తుకుని అమ్మా అని గట్టిగా పిలుస్తూ హాల్లోంచి బైటకి రాబోతుంటే అమ్మ గబగబా పరిగెత్తుకొస్తూ కనిపించింది.

"అమ్మా ఎక్కడికెళ్లావు? " అమ్మ దగ్గరకి నడిచి అడిగాను.

అమ్మ ఏం మాట్లాడలేదు. నోటికి చెంగు అడ్డం పెట్టుకుని పరిగెత్తుకుంటూ చెక్కబల్ల దగ్గరకి నడిచింది. కిందకూలబడి, బల్లమీద తలపెట్టుకుని వెక్కివెక్కి ఏడవటం మొదలు పెట్టింది.

నాకేం అర్థంకాలేదు. అమ్మ ఎందుకేడుస్తోంది. తాతగారి అడ్రస్ దొరకలేదనా?

"అమ్మా ఏమైందమ్మా ఎందుకేడుస్తున్నావు? " అడిగాను అమ్మ పక్కనే కూర్చుని భుజంమీద చేయివేసి.

అమ్మ వెక్కిళ్లు పెడుతోందేకానీ సమాధానం చెప్పలేదు.

"అమ్మా ఏడవకమ్మా చెప్పమ్మా, ఏమైందమ్మా తాతగారి అడ్రసు దొరకలేదా? నేను వెతుకుతానమ్మా. ఏడవకమ్మా"

అమ్మ చటుక్కున నానోరు చేత్తో మూసి, కళ్లు తుడుచుకుంటూ "పద తల్లీ ఇక్కడ ఇంకొక్కక్షణం కూడా ఉండద్దు. పద వెళదాం" అంటూ మూలగా పెట్టిన పెట్టె, బుట్టలు, సంచీ అన్నీ ఒక్కసారిగా పట్టుకుని, పద వెళ్దాం అంటూ అలాగే ఈడ్చుకుంటూ బైటకి వచ్చింది.

మేము మళ్ళీ వచ్చినదారినే బైటకి వెళ్ళాలి. అక్కడ ప్రొప్రయిటర్ మావైపు జాలిగా చూస్తూ అంటున్నాడు. "ఏంటో పిచ్చిది. కాస్సేపు కళ్లు మూసుకుంటే హాయిగా, దర్జాగా ఉండవచ్చుగా... పో...నీ ఖర్మ. నీ బతుకు బస్టాండే"

అమ్మ మాట్లాడకుండా వడివడిగా మెట్లు దిగి రోడ్డుమీదకి వచ్చి రిక్షా కేకేసింది.

రిక్షాలో సామాను ఎక్కించి నన్నూ, తేజనీ కూర్చోబెట్టి తనూ కూర్చుంది. "ఎక్కడికెల్లాలేటండి? " అడిగాడు రిక్షా అతను.

"ఏదన్నా ధర్మసత్రం ఉంటే తీసికెళ్లు తాతా" అంది అమ్మ.

"అట్టాగే తల్లీ" అంటూ రిక్షా తొక్కడం ప్రారంభించాడు.

అమ్మ సన్నగా ఏడుస్తూ గొణుక్కుంటోంది. నేను చెవులు రిక్కించాను.

"ఛీ వెధవ బతుకు... తాళిలేని ఆడదాని బతుకు పురుగుకన్నా హీనం అయిపోతుంది కాబోలు. ప్రతి వెధవ కన్నూ పడుతుంది. ఆయనుండి ఉంటే నాకీ కష్టాలుండేవా? ఎందుకు భగవంతుడా నామీద నీకింత నిర్దయ? నేనేం పాపం చేశాను? "

తాళిలేని ఆడదాని బతుకు హీనంగా ఉంటుందా? మరి అమ్మ తాళి వేసుకోవచ్చుగా. అసలెందుకు తీసింది? ఆరోజు పార్వతి పిన్నీ, అత్తయ్యా, ఇంకా వేరే ఆడవాళ్లు అందరూ కలిసి అమ్మ మొహానికి పసుపురాసి, బొట్టుపెట్టి, చేతుల్నిండా గాజులేశారు. సాయంకాలానికి అవన్నీ తీసేసి తీసుకువచ్చారు అమ్మని. అవన్నీ తీసిన దగ్గర్నించీ అమ్మ ఏదోలా ఉంది. భయం వేసేలా, జాలిగొలిపేలా ఉంది. అవన్నీ ఉంటే అమ్మ ఎంతో అందంగా ఉండేది. ముఖ్యంగా ఆ గొలుసు. వంగినప్పుడు ముందుకుపడి వేళ్లాడే ఆ తాళిబొట్టు... ఎంత అందంగా ఉండేది!




శాంతీ వాళ్ళమ్మగారు నాకిచ్చిన ఆ తాళి బొట్లు అమ్మ చేతికిస్తే అవి చూసుకుంటూ, "ఆయనుంటే దీని విలువ వేరు. ఆయన పోయాక దీని విలువ రూపాయిల్లో కొలవ డానికి ఉపయోగపడుతుందికదూ" అను కుంటూ ఏడ్చింది.

నాకిప్పుడదంతా గుర్తొచ్చింది. అసలు ఆ తాళి గురించి వివరంగా తెలుసుకోవాలని పించింది.

నేను ఆలోచనల్లో ఉండగానే రిక్షా సత్రం దగ్గర ఆగింది. మేం దిగి సామాను దింపు కుని లోపలికి వెళ్ళాం.

ఆ సత్రం యజమాని పాపాయమ్మ గారు... ఆవిడ జుట్టు తెల్లగా ఉంది. ఆవిడ మాత్రం నల్లగా ఉంది. లావుగా, ఎత్తుగా ఉంది. ఎత్తుపళ్ళు. నూనె రాసిన జుట్టు సన్నగా దువ్వి బిగుతుగా ముడివేసుకుంది.

మమ్మల్ని చూస్తూనే మా దగ్గర ఇరవై రూపాయలు వసూలు చేసింది.

భోజనానికి మరో ఐదు రూపాయలు తీసుకుంది. మేం స్నానాలు చేసి అన్నాలు తిని హాయిగా పడుకుని నిద్రపోయాం.

మర్నాడు అన్నదమ్మ... "ఏదెలా ఉన్నా ఈ సత్రంలో మనకి చోటు దొరకడం అదృష్టమేనే. ఆవిడని బతిమాలుకుని, తాతగారి అడ్రసు దొరికిందాకా ఇక్కడే ఉందాం... సుఖంగా, రక్షణగా ఉంటుంది"

అలాగే అన్నాను. తేజకి అక్కడ ఆడుకో డానికి సుఖంగా ఉంది. పెద్ద హాలు... ఆ హాల్లో పరుపు వేసుకుని ద్వారానికి కొంచెం దూరంలో గోడకి కూర్చుని ఉంటుంది పాపాయమ్మ.

మేము గుంటూరు వచ్చి వారం అయింది. సత్రంలో మాకు హాయిగా ఉంది.

"ఇంకా ఎన్నాళ్ళుంటారు, మీరెక్కడికి వెళ్ళాలి? " అడిగింది పాపాయమ్మ అమ్మని ఓరోజు...

అమ్మ కాస్సేపు మౌనంగా ఉండి తరవాత మా గురించి అంతా చెప్పింది. మొత్తం పరిస్థితి వివరించి మాకు తాతగారి అడ్రసు దొరికిందాకా అక్కడే ఆశ్రయం ఇవ్వవలసిం దిగా కోరింది అమ్మ. ఆవిడ మంచిదానిలా ఉంది. కష్టం, సుఖం తెలిసిన మనిషిలా అనిపించింది. వెంటనే ఒప్పుకుంది. "మాకు ఊరికే పెట్టక్కర్లేదు. నేనూ, నా కూతురూ కూడా ఏదన్నా పనిచేస్తాం" అన్నదమ్మ.

"అట్టాగే తల్లీ... ఆడకూతురివి కష్టంలో ఉంటే కాదు పొమ్మనే మనిషిని కాను. నీకెన్ని రోజులు ఉండాలనిపిస్తే అన్ని రోజు లుండు" అందావిడ.

మాకు చాలా సంతోషంగా అనిపించింది. "హమ్మయ్య ప్లాట్ ఫారమ్‌మీద ఉండే దౌర్భాగ్యం పట్టలేదు చాలు" అంది అమ్మ నిట్టూరుస్తూ.

రోజూ ఉదయం లేస్తూనే సత్రం ఊడ్చి శుభ్రం చేయడం, నీళ్ళు పట్టడంలాంటి పనులు చేస్తూ అమ్మ పాపాయమ్మ అభి మానం సంపాదించింది. నేనూ, తేజా ఆవి డని మామ్మగారూ అని పిలవడం మొదలు పెట్టాం. స్వంత మామ్మని పిలిచే అదృష్టం లేకపోయినా నాకో మామ్మ దొరికినందుకు నాకు చాలా ఆనందం కలిగింది.

పాపాయమ్మ నాక్కూడా కొన్ని పనులు చెప్పసాగింది. అమ్మ అంగీకారంతో నేనూ పనులు చేయడం ప్రారంభించాను. నా చదువు మధ్యలో, తమ్ముడి చదువు మొదట్లోనే కొండెక్కింది. ఇంక ఏం చదువుతాం? ఎలా చదువుతాం? డాక్టర్‌ని కాలేను. ఏవీ కాలేను. కానీ తాతగారు కలిస్తే మాత్రం చదువుకోవచ్చు

సత్రానికి రోజూ ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. రెండు రోజులుంటారు. వెళ్ళిపో తారు. మళ్ళీ వేరేవాళ్ళు వస్తుంటారు. పేరుకి ధర్మసత్రం అయినా అందరి దగ్గరా పదో, పరకో వసూలు చేస్తుంటుంది పాపా యమ్మ. ఒక వంటావిడ ఉంది. ఆవిడే అందరికీ వంట చేస్తుంటుంది.



పనిమనిషి లేకపోవడంతో అమ్మ తనంతట తనుగా పనిచేయడానికి ముందుకు రావడంతో పాపాయమ్మ చాలా తేలిగ్గా ఒప్పుకుంది. పైగా చిన్నపిల్లలతో నిస్సహాయ స్థితిలో తన దగ్గరకు వచ్చిన అమ్మ మీద ఆవిడకి చాలా జాలి కూడా కలిగినట్టుంది. రాత్రిపూట పడుకోడానికి, మా సామాను పెట్టుకోడానికి ప్రత్యేకంగా ఓ రూం ఇచ్చింది.

మేము గుంటూరు వచ్చి పదిరోజులైంది.

దేవుడు మామీద ఇంకా కొంచెం దయగా ఉన్నాడని, ఊరుకాని ఊళ్లో నా అన్నవాళ్లు కూడా లేకుండా ఏ ధైర్యంతో మాతో కలిసి మా అమ్మ తాతగారిని వెతకడానికి ఇక్కడికి వచ్చిందో కానీ పాపాయమ్మగారి సత్రంలో మాకు ఆశ్రయం దొరకడం అదృష్టం అని అమ్మ రోజూ రాత్రిపూట చాపమీదకి చేరగానే అనుకుంటూ ఉంటుంది.

ఆరోజు కూడా అలాగే అనుకుంటుంటే అడిగాను.

"అమ్మా... మనం తాతగారిల్లు ఇంకా ఎప్పుడు వెతుకుదాం? ఎన్ని రోజులు ఇక్కడ ఉంటాం? "

అమ్మ నిట్టూర్చింది. "వెతుకుదాం తల్లీ... ఊరు కొద్దిగా అలవాటైతే మనమే రోజొక గంటసేపు అలా వీధిలో తిరిగి ఆ వీధి ఎక్కడుందో తెలుసుకోవచ్చు. అందుకే ముందు ఈ ఊరు అలవాటు చేసుకుంటున్నాను..."

"తాతగారు కనిపిస్తారుకదమ్మా..."

"తప్పకుండా కనిపిస్తారు. ఈ ఊళ్లోనే ఉంటున్నారని ఖచ్చితంగా చెప్పారు మీ నాన్నగారు..."

"తాతగారి దగ్గరకు వెళ్లాక నేనూ, తేజా మళ్లీ బళ్లో చేరతాం కదూ? " ఆశగా అడిగాను.

అమ్మ చప్పున నన్ను దగ్గరకు తీసుకుని గుండెలకి పొదువుకుంటూ అంది "తప్పకుండా చేరతారు. నా రక్తం ధారపోసి అయినా మిమ్మల్ని చదివిస్తాను. చదువు మధ్యలో ఆపేసి, నా బతుకులా మీ బతుకు కానివ్వను."

మర్నాడు నేనూ, అమ్మా కలిసి బైటకి వెళ్లాం, తేజని పాపాయమ్మ దగ్గర వదిలి పెట్టి.

కాగితం మీద రాసిన ఎడ్రస్ చేతిలో పెట్టుకుని, ప్రతి కొట్టులో, ప్రతి హోటల్లో ఆ కాగితం చూపిస్తూ ఈ పేరు గల హోటల్ ఎక్కడుంది? అని అడుగుతూ సాయంత్రం దాకా ఊరంతా తిరిగాం. ఏమీ ఫలితం కనిపించలేదు. అసలా పేరుగల హోటల్ గుంటూరులోనే ఎక్కడా లేదన్నారు కొందరు. కొందరు మాకు తెలియదు అని నిర్లిప్తంగా చెప్పారు.

అమ్మ కన్నీళ్లు పెట్టుకుని వెనక్కి తిరిగింది. వచ్చి మాకిచ్చిన గదిలోకి వెళ్లి పడుకుంది.

పాపాయమ్మకి ఆరోజు మోకాళ్లకి మందు రాయడం, జావ కాచివ్వడం ఆలశ్యమైంది.

అమ్మకి ఆ విషయం గుర్తు చేస్తూ అన్నాను "అమ్మా! మామ్మకి మందు రాయాలిగా, నేను వెళ్లనా? నువ్వు జావ కూడా చేసివ్వాలిగా"

అమ్మ కళ్లు తుడుచుకుంటూ లేచింది "పద" అంటూ. తమ్ముడిని, నన్నూ తీసుకుని బయటకి వచ్చింది. నేనూ తేజా పాపాయమ్మ దగ్గరకొచ్చి కూర్చున్నాం. అమ్మ వంట గదిలోకెళ్లి జావ చేసుకొచ్చింది.

అమ్మ ఇచ్చిన గ్లాసు అందుకుంటూ అడిగింది పాపాయమ్మ "ఏంటమ్మాయ్! కళ్లు వాచాయేం? ఏడ్చావా? "

అమ్మ ఏం మాట్లాడలేదు. మౌనంగా మా పక్కన కూర్చుని చీరచెంగులో పోసుకొచ్చిన జాజిపూలు మాల కట్టడం మొదలెట్టింది.

పాపాయమ్మ జాలిగా అన్నది. "ఎందుకమ్మా ఏడుపు? ఏ జన్మలోనో చేసిన పాపం. అనుభవించాలి. ఏం చేస్తాం! నాకు పదేళ్ళ పిల్లగా ఉన్నప్పుడు పెళ్లి అయింది.




ఏడాది కూడా బతికిలేదు. ముప్పయిఅయిదేళ్ల అప్పటికి... పాము కాటేసింది పోయాడు.. పొలంలోనే. మొహం కూడా చూడలా నేను. అప్పట్నించీ ఇదుగో ఇట్టా వంటరిగానే బతికా. ఆయనెవరో వచ్చి విధవా వివాహాలు చేస్తున్నాడంటే నాకూ చేస్తాడేమో అని ఎదురుచూశా. ఆయన చేయాలనుకుంటే మాత్రం నా నుదుట మొగుడూ, సంసారం, పిల్లలూ అని రాసి పెట్టి ఉండద్దూ! ఏం చేస్తాం చెప్పు. ఆడ జన్మ ఎత్తాం. అనుభవించాలి. ఊరికే ఏడుస్తూ కూర్చుంటే ఆరోగ్యం పాడైపోద్ది కానీ ఏవీ లాబంలేదు. నా మాట విని ఆ పిల్లల్ని చూసుకుంటూ ఇక్కడే పడుండు. ఎప్పటికైనా మీ మావ కనిపిస్తే పోదువుగాని"

అమ్మ ఏం మాట్లాడలేదు. చప్పున పాపాయమ్మ భుజంపైన వాలిపోయి వెక్కి వెక్కి ఏడవసాగింది. అమ్మ ఏడుపు చూసి తేజ కూడా గట్టిగా ఏడుపు లంకించుకున్నాడు.

పాపాయమ్మ అమ్మని ఓదారుస్తూ అన్నది "ఊరుకో... చూడు పిల్లగాడు బెదిరిపోయాడు. ఊరుకో. విధిరాత తల్లీ. విధిరాత" అంటూ ఆవిడ ఓదారుస్తూ ఉండగా చాలాసేపటికి అమ్మ కొంచెం తేరుకుంది.

★ ★ ★

మేము అక్కడకి వచ్చి మరో రెణ్ణెలు గడిచాయి. తాతగారి అడ్రసు మాత్రం దొరకలేదు. ఆ ఊళ్లో లక్ష్మీనివాస్ అని తప్ప లక్ష్మయ్య భోజనహోటల్ లేదు అన్నారు కొందరు. నాకెందుకో హటాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. వెంటనే అమ్మతో అన్నాను. "అమ్మా... తాతగారే ఆ పేరు మార్చి లక్ష్మీనివాస్ అని పెట్టారేమో"

అమ్మ నావైపు ఆశ్చర్యంగా చూసింది. "ఎందుకు మారుస్తారు? తిరుపతిలో లక్ష్మయ్య భోజనహోటల్ అనే ఉండేదిగా"

"కావచ్చు... ఈ ఊళ్లో మార్చారేమో. హోటల్ కెళ్లి వాకబు చేస్తే ఏం? " అన్నాను.

అమ్మ కాస్సేపు ఆలోచించింది. "నిజంగా తాతగారు హోటలు పేరు మార్చారా? లేక అదేదన్నా వేరేవాళ్ళ హోటలా? నిజంగా తాతగారిదే అయితే, ఆ హోటల్ ఈ సత్రానికి దగ్గరగానే ఉందిగా. తాతగారు మనల్ని చూసి ఉండరా? చూసిఉంటే ఈపాటికి మనల్ని తీసికెళ్ళాలిగా ఇంటికి. ఎందుకు తీసికెళ్ళలేదు? అంటే ఇంకా మామీద కోపం తగ్గలేదనమాటేగా. ఏదిఏమైనా నేను చేసింది తప్పు కాబట్టి, ఈ సమయంలో మీ కోసం అయినా నా అభిమానం వదులుకుని ఆయన కాళ్లమీద పడక తప్పదు" అంది.

అలా అనుకున్న మరుక్షణం అమ్మా, నేను కలిసి లక్ష్మీనివాస్‌కి బయలుదేరాం.

"తాతగారికోసం అన్నట్టుగా కాకుండా హోటల్లో ఏదన్నా కొన్నట్టుగా వెళ్ళి ఆరాతీయండి. లేకపోతే మగవెధవలు వెధవ్వేషాలేస్తారు" అంటూ పాపాయమ్మ అమ్మ చేతికి ఐదు రూపాయలు ఇచ్చింది.

తేజని మాత్రం ఎప్పటిలాగే పాపాయమ్మ దగ్గర వదిలేశాం.

లక్ష్మీనివాస్ మేముంటున్న సత్రానికి కిలో మీటరు దూరంలో ఉంది. నడుచుకుంటూ మేము హోటల్ దగ్గరకి చేరాం.

నీలంరంగు బోర్డుమీద తెల్లటి అక్షరాలు "లక్ష్మీనివాస్ భోజన ఫలహారశాల" అని రాసి వుంది.

హోటల్ లోపలికి వెళ్ళడానికి నాలుగు మెట్లు ఉన్నాయి. మెట్లు ఎక్కగానే పెద్ద అరుగు ఉంది. అరుగుమధ్యలో గుమ్మం... గుమ్మానికి ఆనుకుని ఒక పెద్ద టేబుల్ ఉంది. ఆ టేబిల్ వెనకాల కుర్చీలో ఒకాయన కూర్చున్నాడు. ఆయన పొడుగ్గా, లావుగా ఉన్నాడు. నుదుట పెద్ద కుంకుమ బొట్టు, ఖద్దరు చొక్కా వేసుకుని, తెల్ల ప్యాంటు వేసుకున్నాడు. ఆయనే ఆ హోటల్ ప్రొప్రయిటర్. ఆయన కుడిచేతి నాలుగువేళ్లకి నాలుగు ఉంగరాలున్నాయి.

అమ్మ వణికే చేతుల్తో నా చేయి ఆసరాగా పట్టుకుని, చేతిలో చెమటకి తడిసిన ఐదు రూపాయల కాగితం టేబిల్ మీద పెట్టి, "ఒక ప్లేటు ఇడ్లీ పార్శెలు చేయండి" అంది.

ఆయన టేబిల్ సొరుగులోంచి నోట్లకట్ట తీసి లెక్కపెట్టుకుంటూ, అమ్మ ఇచ్చిన ఐదు రూపాయలనోటువైపు ఛీత్కారంగా చూసి, దాన్ని ముట్టుకోకుండా గట్టిగా అరిచాడు. "ఓ ఇడ్లీ పార్శెల్" అంటూ.

నేను ఆ అరుపుకి ఉలిక్కిపడ్డాను. అమ్మ నెమ్మదిగా నా వీపుమీద చరిచింది.

కాసేపటికి సర్వర్ పార్శెలు తెచ్చిచ్చాడు. మేము అది దీసుకుని నెమ్మదిగా వెనక్కి తిరగబోతుండగా అమ్మ ఆ సర్వర్‌ని పిలిచింది.

అతను "ఇంకా ఏం కావాలి? " అంటూ వచ్చాడు.

"ఏం వద్దుకానీ, ఈ హోటల్ లక్ష్మయ్యగారిదేనా? " అడిగింది.

"ఏ లక్ష్మయ్య? " అడిగాడు అతను.

"అదే తిరుపతిలో ఫలహారశాల నడిపేవారు"

"ఏమో... నాకు తెలియదు. ఆయన్నడగండి" అంటూ ప్రొప్రయిటర్‌వేపు చూపించి వెళ్ళిపోయాడు.

అమ్మకి ఆయనతో మాట్లాడడం ఇష్టం లేదు కాబోలు నీరసంగా వెనక్కి తిరిగింది. గుమ్మందాకా నడిచేటప్పటికి వెనకనుంచి. ప్రొప్రయిటర్ పిలుపు వినిపించింది. "వదినా!" అంటూ.

అమ్మ చివ్వున వెనక్కి తిరిగింది. ఆయన డబ్బులు లెక్కపెట్టడం పూర్తిచేసి, "నువ్వు మీరు నిర్మల వదినేనా? " అడిగాడు.

అమ్మ కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. గబగబా తలూఫుతూ "మీరు" అన్నది.

"నేను ప్రకాష్‌ని గుర్తుపట్టలేదా? " అడిగాడాయన.

"ప్రకాష్? నువ్వు ఇంత పెద్దవాడివయ్యావా? నేనసలు గుర్తుపట్టలేదు సుమా. ఎంత అదృష్టం! ఇంతకాలానికి నా అన్వేషణ ఫలించింది. మీ అమ్మగారు, నాన్నగారు కులాసానా... లక్ష్మయ్య ఫలహారశాల లక్ష్మీనివాస్‌గా మారి ఉండకూడదా అనే ఆశతో చివరిసారిగా ప్రయత్నిద్దాం అని ఇక్కడికి వచ్చాను. మీ నాన్నగారు కనిపిస్తారనుకున్నాను. పోనీలే. ఆయన పెద్దవారైపోయారుకదా. ఆయన బాధ్యత నువ్వు మోస్తున్నావన్నమాట" అంటూ అమ్మ గబగబా మాట్లాడసాగింది.

"నాన్న, అమ్మ పోయారు వదినా..."

అమ్మ తుళ్లిపడింది. "పో... పోయారా? ఎలా? ఎప్పుడు? "

"రెండేళ్లైంది. అవునూ... నువ్వేంటి ఇలా? అన్నయ్య..."

అమ్మ కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. మాట్లాడకుండా చెంగుతో కన్నీళ్లు వత్తుకుంటూ నిలబడింది. నాకూ ఏడుపు తన్నుకొచ్చింది. తాతయ్య చనిపోయారా? మామ్మ కూడా చనిపోయిందా? అంటే ఇప్పుడు మాకు ఇంకెవరూ లేరన్నమాట. ఆ




తాతయ్యా ఖచ్చితంగా మమ్మల్ని రానివ్వరు. కనీసం ఈ తాతయ్యా అయినా రానిస్తారని గంపెడాశతో వచ్చాం. తాతయ్యా చనిపో యారుట. మామ్మ కూడా చనిపోయింది. నాన్న కూడా చనిపోయాడు. ఇంక మేము మాత్రం ఎందుకు? అనిపించింది నాకు. మేమిలాగే కష్టాలు పడుతూ ఈ సత్రంలో తలదాచుకుంటూ పాపాయమ్మ మోకాళ్లకి మందురాస్తూ బతకాలన్నమాట. అని తల్చు కోగానే నేను కూడా వెక్కి వెక్కి ఏడవటం మొదలుపెట్టాను.

ఆయన కంగారుగా అన్నాడు. "అరె... వదినా... ఏడవకు. కాస్సేపలా కూర్చో మంచినీళ్లు తాగుతావా? కాఫీ తెప్పించనా?"

అమ్మ ఏంవద్దు అంటూ కళ్లు తుడుచు కుని అంది. "ఎంతో ఆశతో, నమ్మకంతో ఈ ఊరు వచ్చాను ప్రకాశం. మీ నాన్నగారిని కలుసుకుని ఈ పిల్లల్ని ఆయన చేతుల్లో పెట్టి నేనే ఆశ్రమానికో వెళ్ళి విశ్రాంతి తీసు కోవాలనుకున్నాను. కానీ కానీ ఇలా ఏ ఘడి యలో పెళ్ళి చేసుకున్నానో. అత్తగారితో, మావగారితో కలిసి బతికే అదృష్టానికి కానీ, వాళ్ళ ప్రేమానురాగాలు పొందే యోగ్యత కానీ లభించలేదు. నాకే కాదు... నాకు పుట్టినందున వీళ్ళకూడా ఆ అదృష్టం లేకుండా చేశాడా భగవంతుడు"

అమ్మ మాటలకి అడ్డువస్తూ అన్నాడ తను. "ఇదెవరు? అన్నయ్య కూతురా?"

"అవును. తేజ రెండోవాడు. వాడిని సత్రంలో వదిలేసి వచ్చాను. మీ హోటల్ ఈ ఊరు మార్చారని తెలిసీ, పట్నం వెళ్ళి బతకలేనని, మీ కోసం వెతుక్కుంటూ వచ్చాను. తిరగని హోటల్ లేదు. మీ అడ్రస్ కోసం అడగని వ్యక్తిలేడు. ఇలా జరి గిందేవిటి ప్రకాశం?" అమ్మ బాధగా అన్నది.

"ఏం చేస్తాం వదినా. మనమంతా విధిచే తిలో కీలుబొమ్మలం కదా... మీ నాన్నగారు ఆ ఊళ్లో మమ్మల్ని ఉండనియ్యలేదు. ఆ ఊరునుంచి పంపించిందాకా యాగీ చేశారు. ఆ ఊరునుంచి వచ్చేసిందాక మాకు మన శ్శాంతి లేకుండా చేశారు. మీ ఇద్దరూ చేసిన పనికి ఎందరం ఎన్ని రకాల బాధలు పడ్డామో తెలుసా! పోనీ కనీసం మీరన్నా సుఖంగా ఉన్నారనుకున్నాను. హు..." నిట్టూర్చాడు. "సర్లె ఇంతకీ ఎక్కడుంటు న్నారు?"

"సత్రంలో..."

"అరె... అవునా... ఏదీ పాపాయమ్మ సత్రమేనా? పోనీలే అక్కడ ఆడవాళ్లకి బాగా రక్షణగా ఉంటుంది. పాపాయమ్మ చూడ్డానికి భీకరంగా కనిపించినా మనిషి మంచిది. వీళ్లేంటి ఏం చదువుతున్నారు?"

"ఇది ఏడోక్లాసుకి వచ్చింది. తేజ ఫస్ట్క్లా స్కి వచ్చాడు. దురదృష్టం మమ్మల్ని వెంటా డింది. పాపం వీళ్ళ చదువు మధ్యలో ఆగి పోయింది. మీ నాన్నగారి దగ్గర వదిలేస్తే ఆయనే చదివించుకుంటారని ఆశపడ్డాను"

"ఏం చేస్తాం చెప్పు... పోనీలే. చదివి మాత్రం ఉద్ధరించేదేముంది? ఓపని చేయి. నీకేదన్నా ఈ హోటల్లో పనిస్తాను. ఆ సత్రంలో ఉంటూ నా దగ్గర పనిచేసుకో. పిల్లలకి కనీసం కడుపునిండా తిండన్నా పెట్టుకోవచ్చు"

అమ్మ ఆయనవైపు చూసింది. ఆవిడ కళ్లల్లో ఎర్రజీరలు కమ్ముకున్నాయి. ఆయన వైపు ఆ క్షణం అమ్మ చూసిన చూపు నేనె న్నడూ చూడలేదు. నాకు చాలా భయం వేసింది.

వాళ్ల మాటల ద్వారా ఆయన నాకు బాబాయి అవుతాడని అర్థమైంది. బాబాయి అంటే గీతా వాళ్ళ బాబాయిలాగా నాన్నగా చూసుకోవాలికదా మమ్మల్ని. ఆయనకా ఉద్దేశం లేనట్టుగా వుంది. పైగా అమ్మని హోటల్లో పనిచేయమంటున్నాడు.

అమ్మ కోపం అణచుకుంటూ నింపాదిగా అన్నది. "ఏం? నీ ఆస్తిలో భాగం అడుగు తానేమోనని ముందుగానే నా స్థానం



ఏవిటో చెబుతున్నావా ప్రకాశం. నేను వెతుక్కుంటూ వచ్చింది మీ నాన్నగారిని. అంటే మా మావగారిని. కానీ నిన్ను కాదు. నా భర్త, నా మావగారు, అత్తగారు లేకపోయాక నీతో నాకేం సంబంధమయ్యా? నిన్నెందుకు ఆస్తి అడుగుతాను. ఒకవేళ నీ అంతట నువ్విచ్చినా తీసుకోను. కానీ ముందుగా నీ బుద్ధి చూపించుకుని ఈ వదిన్ని అవమానించావు. ఇంకెప్పుడూ నీ మొహం చూడను. చాలా సంతోషం. కనీసం గుర్తుపట్టి వదినా అని ఆప్యాయంగా పలకరించావు. వస్తాను. రామ్మా" అంటూ నా చేయి పట్టుకుని విసవిసా బైటకి వచ్చేసింది అమ్మ.

★ ★ ★

సత్రానికి వెళ్ళాక పాపాయమ్మతో జరిగిన సంగతి చెప్పి బాగా ఏడ్చింది.

పాపాయమ్మ అంతా విని ఏదో అర్థమైనదానిలా అన్నది "అయితే వాడేనన్నమాట. దొంగవెధవ. వీడి గురించే ఈ ఊళ్లో అంతా కథలు, కథలుగా చెప్పుకుంటారు. వీడు పెద్ద చదువుకోలేదుట. ఆయనెవరో గవర్నమెంటు ఆఫీసరు ఉద్యోగం వేయిస్తానన్నాడని, వాడి ఆస్తిపాస్తులు చూసి వాడి కూతుర్ని పెళ్లాడి దాని చేతిలో కీలుబొమ్మ అయ్యాట్ట. అది వీడిని చిటికెన వేలిమీద ఆడించి అత్తగారినీ, మావగారినీ నానాహింసలు పెట్టి చంపిందంటారు. ఏదో ఆఫీసులో ముందు చిన్న ఉద్యోగంలో చేరినవాడు, ఆ ఉద్యోగం మానేసి, పూర్తిగా హోటలే చూసుకుంటున్నాడు"

"పిన్నిగారూ..." అమ్మ వణికిపోతూ పిలిచింది. "నిజమేనా? మీరనేది నిజమేనా?"

"నిజం ఎంత ఉందో తెలియదు కానీ ఈ సంగతి మాత్రం బాగా ప్రచారంలో ఉంది. పెద్దవాడు ఇష్టమైన అమ్మాయిని పెళ్లి చేసుకుని వెళ్ళిపోయాడని, చిన్నవాడు ఇట్టా తయారయి, ఆ ముసలాళ్లని నానా బాధలు పెడుతున్నాడని అనుకునేవాళ్లు. వాళ్లిద్దరూ రెండునెల్ల తేడాతో పోయారు. పోయి కూడా ఇప్పటికి రెండేళ్లవుతోంది. ఈ ఊరికి వస్తూనే పోయారు. తిరుపతినుంచి వచ్చార్టగా"

అమ్మ వెక్కి వెక్కి ఏడవసాగింది. "ఎంత పని జరిగింది? ఒక్కసారన్నా మేము ఆ పెద్దవాళ్లు ఎలా ఉన్నారో తెలుసుకోవాలని ఎంతో ప్రయత్నించాం. అప్పుడీ సంగతులు తెలిసినా ఎలాగోలా బతిమాలి మా దగ్గరకు తీసుకెళ్లిపోయేవాళ్ళం. వాళ్లకు నీడా, మాకు పెద్దవాళ్ళ తోడూ ఉండేది. ఎందుకిలా చేశాడో ఆ భగవంతుడు? నాకర్థం కావడం లేదు"

"బాధపడకు నిర్మలమ్మా నువ్వు మాత్రం ఏం చేస్తావు? నీ ప్రయత్నం నువ్వు చేశావు. ఏడిస్తే ఏం లాభం? జరగాల్సింది చూడు. ఇద్దరూ చిన్నపిల్లలు... ఆడపిల్ల. దీన్ని ఎవరో గంతకు తగ్గ బొంతను చూసి ముడిపెట్టేసినా వాడు మగపిల్లాడు. చదువూ, సంధ్యా లేకుండా ఎంతకాలం ఇలా ఉంచుతావు? నా మాట విని ఏదన్నా ఉద్యోగం చూసుకో... అంతో ఇంతో చదువుకున్నావుగా... ఏ పంతులమ్మ ఉద్యోగమో దొరక్కపోదు..." అంది పాపాయమ్మ.

అమ్మ కన్నీళ్లు తుడుచుకుని బొంగురుపోయిన స్వరంతో "నేనింక ఈ ఊళ్లో ఉండలేను పిన్నిగారూ... ఈ జ్ఞాపకాలతో నేను మనశ్శాంతిగా బతకలేను. హైదరాబాదులో ఏదో ఉద్యోగం ఉందని చెప్పారు కోదండపాణిగారు. అడ్రసు కూడా ఇచ్చారు. అక్కడికి వెళ్లిపోతాను" అంది.

"అయిదరాబాదులో ఆడదానివి ఒక్కదానివీ ఈ పిల్లలతో ఎట్టా బతుకుతావు? అక్కడ ముక్కూ మొహం తెలిసినవాళ్లెవరూ ఉండరు కూడాను"

"హు... ఎవరు తెలిస్తే ఏంలాభం? ఎవరికెవరు ఈలోకంలో? మీతో నాకు ముందు పరిచయం ఏమాత్రం ఉంది. మీరు నాకు ఆశ్రయం ఇవ్వలేదూ...




అక్కడా ఉంటారు మంచిమనసున్న మీలాంటివాళ్లు..."

"నీ ధైర్యమే నీకు శ్రీరామరక్ష తల్లీ... నీఇష్టం... నీకు ఏది మంచిదని తోస్తే అలా చేయి" అన్నది పాపాయమ్మ.

ఆవిధంగా మా జీవితాల్లో మరో ప్రస్థానానికి నాంది పడింది.

ఆ సంఘటన జరిగిన వారం రోజుల తరువాత నేనూ, తేజా, అమ్మా కలిసి హైదరాబాదు బయలుదేరాం.

మేము బయలుదేరబోయేముందు పాపాయమ్మ మమ్మల్ని తన గదిలోకి తీసుకెళ్ళింది. ఆ సత్రంలో పాపాయమ్మ పడుకోడానికి, ఆవిడ సామాను పెట్టుకోడానికి విడిగా ఓ గది ఉంది. ఆ గది శుభ్రంగా ఉంది. మేము మొదటిసారిగా ఆ గదిలోకి అడుగుపెట్టాం. పాపాయమ్మ మమ్మల్ని మంచం మీద కూర్చోమని చెప్పి, తను కిందికి వంగి మంచం కింద వున్న పెట్టె బైటికి లాగింది.

ఆ పెట్టె మూత తీయగానే దాన్నిండా ఏవో పుస్తకాలు, అట్ట పెట్టెలు, నాలుగు బాగా నలిగిన పట్టుచీరలు ఇంకా ఏవో ఇత్తడి సామాన్లు వగైరా ఉన్నాయి. అందులోంచి చిన్న ఇత్తడి డబ్బాతీసి తగరం కాగితంలో చుట్టిన వస్తువు తీసింది. ఆ వస్తువు రెండు తాళిబొట్లు... అర్ధరూపాయంత వెడల్పు, బాగా మందంగా ఉన్నాయి. వాటి మధ్యలో లక్ష్మీదేవి బొమ్మ చెక్కి వుంది. తాళిబొట్టుకి వెనకాల రాగి తాపడం ఉంది. ఆ రెండు తాళిబొట్లు, అమ్మ చేతికిస్తూ అన్నది పాపాయమ్మ,

"ఇవి నా భర్తపోయాక నాకు మిగిలినవి... నా ఆస్తి మొత్తం ఇలాగే మరుదులు కాజేసారు. మిగిలి వున్న వీటిని అమ్మడం ఇష్టంలేక అట్టాగే దాచిపెట్టాను. శాస్త్ర ప్రకారం ఈ తాళిబొట్లు నా కూతుళ్లకో, మనవరాళ్లకో వాళ్ల పెళ్లికి ఇవ్వాలి అంటారు. నాకు ఎవరూ లేరు ఏక్షణంలో మీరు ఇక్కడికి వచ్చారో మీ పట్ల నాకు ఆత్మీయత పెరిగింది. ఈ పిల్లముండ ఎంత సేవచేసిందని నాకు రోజూ మోకాళ్లకి మందురాసి. ఇదే నా మనవరాలు అనుకుంటాను. దీని పెళ్లికి ఇది నా కానుక, ఒరేయ్ నీకు ఇదిరా" అంటూ తేజ చేతిలో వంద రూపాయల కాగితం పెట్టింది.

అమ్మ చటుక్కున ఆవిడని కౌగలించుకుని భోరుమంది.

"ఏడవకే అమ్మా... ఏడవకు. ఆడబతుకులింతే. ఏంచేస్తాం? ఖర్మ. ధైర్యంగా ఉండు. పిల్లలు బెంబేలు పడిపోతారు. దేవుడ్ని నమ్ముకో... నీకంతా మంచి జరుగుతుంది" అంటూ ఆవిడ కూడా కన్నీళ్లు పెట్టుకుంటూ అమ్మని ఓదార్చింది.

నాక్కూడా పాపాయమ్మని వదిలి వెళ్లిపోతుంటే బాగా ఏడుపు వచ్చింది. మమ్మల్నందరినీ చూసి తేజ కూడా ఏడ్చాడు.

ఆ బరువైన వాతావరణంలోంచి మేము బరువుగా అడుగులు వేసుకుంటూ రైల్వేస్టేషన్‌వైపు బయలుదేరాం.

అప్పుడు సమయం సాయంత్రం ఐదున్నర ఆరు మధ్య. ప్లాట్‌ఫారం మీద పెట్టెలు పెట్టుకుని, ఆ పెట్టెలమీద నేనూ, తేజా కూర్చున్నాం. అమ్మ పవిటచెంగు భుజం మీద నిండుగా కప్పుకుని నిలబడి వుంది. మాతోపాటు చాలామంది ప్రయాణీకులు కొందరు కూర్చుని, కొందరు నిలబడి, కొందరు అటూ ఇటూ పచార్లు చేస్తూ కనిపించారు. అక్కడ వున్న సిమెంటు బెంచీల మీద కొందరు హాయిగా పడుకుని నిద్రపోతున్నారు. వాళ్లులేచి కూర్చుంటే అమ్మ కూడా పాపం సిమెంటు బెంచీమీద కూర్చోవచ్చు కానీ వాళ్లు గురకపెడుతూ నిద్రపోతున్నారు. నాకు బాగా ఆకలేస్తోంది. తేజ కూడా అక్కా ఆకలి అంటూ నా ప్రాణం తీస్తున్నాడు. వాడికి పాపాయమ్మ ఆకులో కట్టిచ్చిన పెరుగన్నం పెట్టాను. కొంచెమే

తిని సయించటంలేదు అంటూ ఇంక తిన లేదు. అమ్మ నన్ను కూడా తినమంది. కానీ, నాకు తినాలనిపించలేదు. కారణం నా ఎదురుగా వున్న రైల్వే క్యాంటీన్‌లోంచి కమ్మటి సాంబారు వాసన వస్తోంది. అంతే కాక, నలుగురైదుగురు కుర్రాళ్లు ట్రేలో తగరం కాగితాల్లో చుట్టిపెట్టిన ఇడ్లీ, వడా అమ్ముతోంటే నాకు నోరూరుతోంది. నా మనసంతా ఇడ్లీ, వడమీద ఉంది. పెరు గన్నం ఎలా తినాలనిపిస్తుంది. అమ్మవైపు, ఆ కుర్రాళ్లవైపు చూస్తూ, అమ్మ తనంతట తానే కొనిస్తుందేమోనని ఆశగా ఎదురుచూ స్తున్నాను. కానీ అమ్మకా ధ్యాసే లేనట్టుగా నిలబడి రైలుకోసం చూస్తోంది. తేజ కూడా నాతో జాలిగా అన్నాడు... "అక్కా! ఇడ్లీ, వడ తిందామే" అని.

"ఎలారా... మనదగ్గర డబ్బుల్లేవుగా" అన్నాను.

"అమ్మను కొనివ్వమను..."

"నువ్వే అడుగు... నేనడిగితే అమ్మ తిడు తుంది"

తేజ గెంతుకుంటూ అమ్మ దగ్గరకి వెళ్లాడు. "అమ్మా ఇడ్లీ, వడ కావాలి" అడి గాడు.

అమ్మ వాడిని దగ్గరకు తీసుకుని, నుదిటి మీద పడిన జుట్టు సవరిస్తూ అన్నది, "తప్పు నాన్నా... ఇక్కడ అలాంటివి తినకూ డదు... జబ్బుచేస్తుంది. మనం హైదరా బాదు వెళ్లాక, నేను చేసి పెడతాను. సరేనా? ఆకలేస్తే పెరుగన్నం తిను"

వాడు నావైపు చూశాడు. అమ్మ దృష్టి నామీద పడింది. "మధూ, నువ్వేనా వీడికి లేనిపోనివి నేర్పిస్తున్నావు. పెద్దపిల్లవి నీకు తెలియదూ అలాంటివి తింటే జబ్బు చేస్తుం దని. తమ్ముడికి నువ్వే చెప్పాలి" అంటూ మందలించింది. నాకు కళ్లమ్మట నీళ్లొ చ్చాయి.

అన్నీ అబద్ధాలే అమ్మ చెప్పేవి. ఎంత మంది తినడంలేదూ. వాళ్లెవరికీ చేయని జబ్బు మాకు మాత్రం చేస్తుందా? డబ్బులు లేవని చెప్పచ్చుగా. ఛీ ఎప్పుడేం కావాలన్నా అన్నీ డబ్బులతో కొనుక్కునేవే.. ఎంచక్కా మావయ్యా, తాతయ్యా, బాబాయిలాంటి వాళ్లుంటే వాళ్లనడిగి ఎన్నెన్ని కొనిపించుకో వచ్చు శాంతిలాగా, గీతలాగా. అలా అనుకో గానే హోటల్ బాబాయి గుర్తొచ్చాడు. ఆయన మా ఎదురుగా లెక్కపెట్టిన నోట్ల కట్టలు గుర్తొచ్చాయి. ఛీ చెడ్డ బాబాయి... కనీసం పదిరూపాయలన్నా ఇవ్వలేదు. ఇలాంటి బాబాయిలుండేకన్నా లేకపోవడమే మంచిది. మావయ్యా ఎక్కడుంటాడో, మావయ్య అడ్రసు సంపాదించి కనీసం తనన్నా అక్కడికెళ్లాల్సింది. ఎన్ని రోజులిలా కోరికలన్నీ చంపుకుంటూ బతకాలో. భగ వంతుడు మమ్మల్ని ఎందుకిలా బీదవాళ్లని చేయాలి? నాకు దేవుడి మీద కోపం వచ్చింది. తిరుపతి వెళ్లి వచ్చాక మాకన్నీ కష్టాలే వచ్చాయి.

హఠాత్తుగా గుర్తొచ్చింది. అవును తిరు పతి వెళ్లొచ్చాకే కష్టాలొచ్చాయి. దేవుడు మంచివాడంటారు అందరూ. కష్టాలొచ్చిన వాళ్లు తనని ప్రార్థిస్తే కష్టాలు తీరుస్తాడం టారు. మరి కష్టాలు లేనివాళ్లు తనని ఉత్తినే ప్రార్థించకూడదా! అలా ప్రార్థిస్తే ఇలాగే కష్టాలిస్తాడా! అయితే ఇంకెప్పుడూ తిరుపతి వెళ్లకూడదు. గబగబా అమ్మ దగ్గ రకి వెళ్లాను.

"అమ్మా! ఇంకెప్పుడూ మనం తిరుపతి వెళ్లద్దు" అన్నాను సీరియస్‌గా.

"ఇప్పుడెందుకు గుర్తొచ్చింది ఈ విషయం? " అమ్మ నవ్వింది.

"మనం తిరుపతి వెళ్లొచ్చాకే మనకి కష్టా లొచ్చాయి. దేవుడు మంచివాడు కాదు" అన్నాను.

అమ్మ తల అడ్డంగా ఊపుతూ "తప్పు... అలా అనకూడదు. దేవుడేం చేస్తాడు? ఇదంతా నా స్వయంకృతాపరాధం. వెళ్లు సామాను దగ్గర కూర్చో అదిగో రైలా




స్తోంది. జాగ్రత్త ఆ పెద్ద పెట్టె, చిన్న పెట్టె నాకివ్వు. ఈ బ్యాగులు రెండూ నువ్వు పట్టుకో. తేజా, రా నాన్నా. జాగ్రత్త నా కొంగు పట్టుకో" అంటూ పెట్టెలు పట్టుకుని అమ్మ, తేజ అమ్మ కొంగు పట్టుకుని వెంట నడవగా, రెండు బ్యాగులు పట్టుకుని నేను ప్లాట్‌ఫాం మీద కొంచెం ముందుకి నడిచాం. మాతోపాటు మిగతా ప్రయాణీకు లుకూడా హడావుడిగా పెట్టెలు, బుట్టలు పట్టుకుని ముందుకి నడవసాగారు.

"ఆగండమ్మా, జనరల్ కంపార్ట్‌మెంట్ ఇక్కడే ఆగుతుంది. మీరు జనరల్ కంపార్ట్‌మెంటులోనేగా ఎక్కేది" ఓ పెద్దాయన అన్నాడు అమ్మతో.

"అవునండి" అన్నది అమ్మ.

"అయితే ఆగండి... అంత సామాను, ఆ పిల్లల్ని వెంటేసుకుని ఎక్కడికెళతారు? ఇక్కడికే వస్తుంది ఆ పెట్టె" అన్నాడాయన.

మేము ఆగిపోయాం. ఆయనన్నట్టుగానే, మేము ఎక్కాల్సిన పెట్టె మా ముందే కనిపించింది. మమ్మల్ని తోస్తున్న జనాన్ని మేమూ తోసుకుంటూ ఎలాగైతే ఏం మా ముగ్గురికీ సీటు సంపాదించాం. పెట్టెలు, బ్యాగులు సీటు కిందకి తోసేశాం. అమ్మ వంగి నాతో అన్నది. మెల్లిగా "మధూ! ఆ నల్లబ్యాగు నీ దగ్గర పెట్టుకో. అందులో పాపాయమ్మ ఇచ్చిన తాళిబొట్లున్నాయి. అక్కడ పెడితే మిగతా సామాన్లతో కలిసిపోయిందంటే కష్టం. జాగ్రత్తగా పట్టుకో నేను తరువాత తీసుకుంటా తేజాని నిద్రపుచ్చి"

నేను కూడా అదే స్వరంతో "ఊ... సరే..." అంటూ నల్లటి తోలు బ్యాగు నా ఒళ్లో పెట్టుకుని కూర్చున్నాను. నా చేతులు ఎంతో ఆప్యాయంగా ఆ బ్యాగుని నా గుండెలకి హత్తుకున్నాయి. ఆ బ్యాగులో నేను ఎంతోకాలంగా కలలు కంటూ ఎదురుచూస్తున్న రెండు వస్తువులున్నాయి. హైదరాబాదు వెళ్లగానే అమ్మకి ఉద్యోగం దొరుకుతుంది. నాకు పెళ్లి అవుతుంది. ఎంచక్కా నేనా తాళిబొట్టు మెళ్లో వేసుకోవచ్చు అనుకోగానే నాకెంతో గర్వంగా తృప్తిగా అనిపించింది. తేజ నిద్రపోయాక సీట్లో పక్కన పడుకోబెట్టి అమ్మ "ఇలా ఇవ్వు" అంటూ అడిగినా ఇవ్వకుండా "నా దగ్గరే ఉండనీమ్మా జాగ్రత్తగా పట్టుకుంటాలే" అన్నాను.

"సరే... జాగ్రత్త" అంటూ అమ్మ సీట్లో వెనక్కి వాలింది విశ్రాంతిగా. రైలు కదిలింది. ఇడ్లీ, వడ అమ్మే కుర్రవాళ్లు, సాంబారు వాసనలు వెదజల్లిన రైల్వేక్యాంటీన్ అన్నీ దూరమైపోయాయి. కదిలిపోతున్న పొలాలు, పెద్ద పెద్ద చెట్లు, కొండలు చూస్తూ కూర్చున్నాను. కాస్సేపటికి రైలు ఓ చిన్న స్టేషనులో ఆగింది. "అప్పుడే ఆగిందేంటమ్మా" అన్నాను. చీకట్లో ఒకేఒక స్ట్రీట్ లైటు వెలుగుతోన్న ఆ ఫ్లాట్‌ఫాం చూస్తూ "ఈ రైలు ఇలాగే ఆగుతుంది తల్లీ" అన్నదమ్మ.

మళ్లీ కొంతమంది రైలెక్కారు. వాళ్లల్లో ఇద్దరాడవాళ్లు అమ్మ దగ్గరకి వచ్చి, నిద్రపోతున్న తేజని చూసి, "పిల్లాణ్ణి ఒళ్లో పడుకోబెట్టుకోమ్మా. మేమూ కూర్చోవాలి" అంటూ దబాయించారు. అమ్మ చేసేదిలేక వాడిని ఒళ్లో పడుకోబెట్టుకుంది. ఆ స్థలంలో మరో ఇద్దరు ఆడవాళ్లు కూర్చున్నారు.

రైలు కదిలింది. ప్లాట్‌ఫాం దాటి ముందుకు వెళుతోంది. అప్పుడప్పుడు కొంచెం వేగంగా, మళ్లీ వేగం తగ్గించి నెమ్మదిగా చిత్ర విచిత్రమైన ధ్వనులుచేస్తూ సాగిపోతోంది.

అమ్మ నావైపు చూస్తూ అడిగింది... "మధూ! పెరుగన్నం ఉందా? అయిపోయిందా?"

"ఉందమ్మా... నల్ల సంచీలో ఉంది"

"ఏదీ తీసివ్వు... నాకాకలేస్తోంది" అన్నది.

నేను వంగి సీటుకింద సంచీకోసం చూశాను. కనిపించలేదు. మా పెట్టెలు పెట్టిన దగ్గర మరికొన్ని బుట్టలు, తట్టలు

ఉన్నాయి. మా పెట్టెలు వెనక్కి జరిపేసి వున్నాయి. ఆ బుట్టలు, తట్టలు జరిపి చూడాలంటే జనం గుంపులుగా కూర్చుని ఉన్నారు. సీట్లో కూర్చున్న వాళ్ల కాళ్లు అడ్డం వస్తున్నాయి. ఎలా వెతకాలో నాకర్థంకా లేదు.

నా అవస్థచూసి అమ్మ అడిగింది. "ఏవిటే, ఏం వెతుకుతున్నావు? "

"నల్ల సంచీ కోసం" అన్నాను.

"నీ ఒళ్లోనే వుందిగా"

"అరే... ఛట్. మర్చిపోయాను" పెరుగన్నం, నీళ్లతో నింపుకున్న చిన్న ప్లాస్టిక్ డబ్బా అన్నీ నల్లసంచీలో పెట్టింది అమ్మ. నాలిక కొరుక్కుని ఆ సంచీ తీశాను. దాని తాళ్లు ముడివేసి వుంది. తాళ్లు విప్పి లోపల్నించి అమ్మకి ఆకులో చుట్టిన పెరుగన్నం పొట్లం ఇచ్చాను.

బాసింపట్టు వేసుకుని కూర్చుని, తమ్ముడిని అలా ఒళ్లో పడుకోబెట్టుకుని అమ్మ పెరుగన్నం పొట్లం విప్పి " నువ్వూ కొంచెం తినవే" అంది.

నాకూ ఆకలిగానే వుంది. కానీ, పెరుగన్నం మాత్రం తినాలని లేదు. బాగా చలిగా వుంది. వేడి వేడిగా ఏదన్నా తినాలని ఉంది. అందుకే వద్దు అన్నాను.

"ఆకలి వేయడంలేదూ"

"వేస్తోంది"

"మరి ఎందుకు తినవు? "

"నాకొద్దు చలేస్తోంది. వేడివేడిగా ఏవన్నా తినాలని వుంది"

అమ్మ నావైపు సూటిగా చూసింది. ఆ చూపులో ఏదో బాధ కనిపించింది. నిస్సహాయత కనిపించింది. వెంటనే తలవంచుకుని అన్నం తినసాగింది.

రైల్లో ఇంకా లైట్లు ఆర్పలేదు. ప్రయాణీకులందరూ కూడా వాళ్ల పొట్లాలు కట్టి తెచ్చుకున్న తినుబండారాలు తీసుకుని తింటున్నారు. నేను కిటికీలోంచి బైటకి చూస్తూ కూర్చున్నాను.

అమ్మ నెమ్మదిగా పిలిచింది... "మధూ"

నేను అమ్మవైపు చూశాను.

చేతిలో ముద్దపట్టుకుని ఆ చేయి నావైపు చాచింది అమ్మ. "ఈ ఒక్క ముద్ద తిను. నువ్వు తినకుండా నేను తినలేకపోతున్నాను. కానీ, ఆకలేస్తోంది. కళ్లు తిరుగుతున్నాయి. నాకోసం తినవే" అమ్మ కళ్లల్లో కన్నీళ్లు రెండు చుక్కలు ఆకులో పడ్డాయి. అప్రయత్నంగా కొంచెం ముందుకు వంగి నోరు తెరిచాను. అమ్మ ఆ ముద్ద నా నోట్లో పెట్టింది. నాకెందుకో ఆ ముద్ద చాలా రుచిగా అనిపించింది.

మరో ముద్ద తినాలనిపించింది. కానీ అన్నం కొంచెమే ఉంది. అమ్మకాకలివేస్తోందిగా. ఆ అన్నం సరిపోదేమో అనిపించి "ఇంక చాలమ్మా" అన్నాను.

"వచ్చే స్టేషనులో రైలు పది నిమిషాలు ఆగుతుంది. అప్పుడు నీక్కావాల్సింది కొనుక్కో సరేనా" అంది అమ్మ.

"నిజంగానా" అడిగాను.

అమ్మ తల ఊపింది.

హమ్మయ్య రెండు ఇడ్లీలు తినాలి. వేడి వేడి ఇడ్లీ! అరె పాపం తేజ నిద్రపోతున్నాడు. వాడూ అడిగాడు ఇందాక. పోనీలే లేపి ఒక ముక్క వాడికీ పెడతాను. అమ్మక్కూడా ఓ ముక్క. ఒక ఇడ్లీలో అమ్మకి సగం, తేజకి సగం, నేను ఒక ఇడ్లీ తింటాను. నా మనసంతా తినబోయే ఇడ్లీ మీద నిండిపోయింది. రైలు ఎక్కువసేపు ఆగబోయే స్టేషను కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. రైలు చాలా నెమ్మదిగా పోతోంది. ఇంకా స్టేషను ఎప్పటికి వస్తుందో!

అమ్మ అన్నం తినడం పూర్తిచేసి ఆకు కిటికీలోంచి బైటకి విసిరేసింది. తరవాత ప్లాస్టిక్ డబ్బాలో నీళ్లతో చేయి కిటికీ బైటకి పెట్టి కడుక్కుంది. మిగిలిన నీళ్లు కొన్ని తాగింది. ఖాళీ డబ్బా నాకిస్తూ అంది, "రైలు ఆగాక ఈ డబ్బాలో మంచినీళ్లు




నింపుకురా. తేజ రాత్రంతా మంచినీళ్లని ప్రాణం తీస్తాడు"

"అలాగే" అన్నాను. అమ్మ ఇడ్లీ కొనిస్తా నన్నదన్న ఆనందంతో ఏ పనైనా చేయడానికి సిద్ధంగా ఉన్నాను. ఎలాగా దిగుతాను కాబట్టి రైల్వే క్యాంటీన్‌లో సాంబారుతో సహా తెచ్చుకోవచ్చు. అవునూ సాంబారెలా ఇస్తాడు? ఇడ్లీ అయితే పొట్లం కట్టిస్తాడు. మరి సాంబారెలా? అక్కడే తినేయాలి. మరి తేజకి? అమ్మకి? నాకేం తోచలేదు. సాంబరెలా తేవాలి? అని ఆలోచిస్తూ కూర్చున్నాను. ప్రయాణీకుల్లో ఒకాయన పాపా కిటికీ అద్దం దించెయ్ చలిగా ఉంది" అన్నాడు.

"అమ్మో అద్దం దించేస్తే ఎలా? స్టేషనులో రైలాగాక ఇడ్లీ కొనుక్కోడం ఎలా? క్యాంటీన్ ఎక్కడుందో ఎలా తెలుస్తుంది? పైగా మంచినీళ్లు కూడా తేవాలి. పంపు ఎక్కడుందో ఎలా తెలుస్తుంది" అనుకుంటూ నేనేం మాట్లాడకుండా కూర్చున్నాను.

"పాపా అద్దం దించేయ్" అన్నాడు మళ్లీ ఆయన.

అమ్మ ఆయనవైపు చూస్తూ "దానికి చేత కాదు బాబుగారూ. నా ఒళ్లో పిల్లాడున్నాడు. మీరే దించండి" అంది.

ఆయన తన ఎదురుగా కూర్చున్న కుర్రాడితో అన్నాడు "అరేయ్ శీనాయ్ అద్దం దించరా"

ఆ శీనాయ్ అనే కుర్రాడు లేచి నన్ను తాకుతూ అద్దం దించాడు. అమ్మ నాతో "వెనక్కి జరుగు తల్లీ" అంది.

నేను అతను నన్ను తాకకుండా వెనక్కి జరిగాను. అతను అద్దం దించి సీట్లోకి వెళ్లి కూర్చున్నాడు.

రైలు శబ్దం చేస్తూ వెళ్తూనే ఉంది. నాకిప్పుడు బైటంతా కారు చీకటి తప్ప మరేం కనిపించడంలేదు. రైల్లో లైట్లు కూడా ఆర్పేశారు. అంతా చీకటి. అందరూ కూర్చున్న చోటే కునికిపాట్లు పడుతున్నారు. అమ్మ కూడా కళ్లు మూసుకుంది.

నాకు మాత్రం నిద్రరావడంలేదు. మనసులో ఏదో దిగులుగా అనిపిస్తోంది. అమ్మ ఏడ్చినపుడల్లా నాకలాగే అనిపిస్తుంది. అమ్మ నవ్వుతూ ఉంటే బాగుంటుంది. అమ్మ ఏడిస్తే నాకూ ఏడుపొస్తుంది. మాకెవరూ లేరని, మేము బతకడం కష్టమని అనిపిస్తుంది. అలా కాకుండా ఏదో చేయాలనిపిస్తుంది. ఏం చేయాలో అర్థంకాదు.

ఇప్పుడు కూడా నాకు దిగులుగా ఉంది. ఎందుకో తెలియదు కానీ నాన్న బాగా గుర్తుకి వస్తున్నారు. అంత మంచి నాన్నకి ఇంత చెడ్డ తమ్ముడెలా పుట్టాడు? అమ్మని బాబాయి బాగా బాధపెట్టాడు. అమ్మ ఏడ్చింది. బాబాయికి అమ్మంటే ఎందుకు కోపం? అయినా బాబాయి చాలా దుర్మార్గుడు. తాతగారిని, మామ్మనీ కూడా బాధలు పెట్టాట్ట. వాళ్లని బాబాయే చంపేశాట్ట. పాపాయమ్మ చెప్పింది. అమ్మో ఇంకా నయం మేము కూడా వాళ్లింట్లో ఉంటే మమ్మల్ని కూడా చంపేవాడేమో. దేవుడు చెడ్డవాళ్లకి సాయం చేయడన్నది అమ్మ. కానీ బాబాయి దగ్గర బోలెడు డబ్బులున్నాయి. గుంటూర్లో సొంత ఇల్లుంది. ఎంతో సుఖంగా, సంతోషంగా ఉన్నాడు. దేవుడు సాయం చేయకపోతే ఇవన్నీ బాబాయికి ఎలా వచ్చాయి? అంతా అబద్ధం. దేవుడు చెడ్డవాళ్లకే సాయం చేస్తాడు. మంచివాళ్లకు చేయడు. నాన్న మంచివాడు. అమ్మ మంచిది. అయినా దేవుడు మాకు సాయం చేయలేదు. ఎందుకిలా చేస్తున్నాడు?

ఇప్పుడు హైదరాబాదు వెళ్తున్నామంటే ఆ హైద్రాబాదు ఎలా ఉంటుందో. నాకెందుకో హఠాత్తుగా గుండెల్లో గుబులు బయలుదేరింది. కాస్సేపటికి అది భయంగా మారింది. రైలు చేస్తున్న శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ నిశ్శబ్దం నాకు

భయం గొల్పుతోంది. ఏడుపు కూడా వస్తోంది. తేజ అమ్మ ఒళ్లో హాయిగా నిద్ర పోతున్నాడు. నాకు ఉక్కగా అనిపించింది. మూసేసిన కిటికీ అద్దంవైపు చూశాను. అది తెరవడం ఎలాగో నాకు రాదు. గట్టిగా కళ్లు మూసుకున్నాను.

"మధూ!" నన్నెవరో పిలిచారు.

ఉలిక్కిపడి చూశాను. అందరూ నిద్రపో తున్నారు. ఎవరూ లేరు. ఎవరు పిల్చారు? లేచి చూడాలనిపించింది. తలెత్తి పైన చెక్క మీద పడుకున్నవాళ్లని చూశాను. వాళ్లు కూడా నిద్రపోతున్నారు. ఎవరూ పిలవ లేదు. భయంవేసి కళ్లు మూసుకుని నా ఓణీ గట్టిగా కళ్లకి అడ్డంగా పెట్టుకున్నాను.

కాసేపటికి మళ్లీ వినిపించింది పిలుపు "మధూ!"

"ఎవరూ... ఎవరు నన్ను పిలిచేది? "

"నిద్రరావడంలేదా మధూ!"

"ఎవరూ! ఎవరది? "

"నేనురా నాన్నను. నిద్రరావడంలేదా తల్లీ" చిరునవ్వుతో నాన్న.

"నాన్నా" నా పెదాలు కదిలాయి. కానీ శబ్దం బైటకి రాలేదు. నాన్న. నాన్న ఇక్క డికెలా వచ్చారు.

"నీకేం భయంలేదు. ఎందుకురా భయప డుతున్నావు? "

"నాన్నా! అవును నాకు భయంగా ఉంది. తిరుపతి వెళ్లేటప్పుడు నువ్వు పక్కన ఉన్నా వని అసలు భయం అనిపించలేదు నాన్నా! కానీ ఇప్పుడు భయంగా ఉంది. నాన్నా! నా దగ్గరకు రావూ"

"వచ్చానురా చూడు ఇలా చూడు నీ ఎదురుగా ఉన్నాను"

కళ్లు తెరిచాను. కిటికీ అద్దం మీద నాన్న... చిరునవ్వుతో నాన్న.

"చూడు నీకోసం ఎవరో వచ్చారు. కలవ రిస్తున్నావుగా చూడు"

"మధూ ఏంకావాలి తల్లీ. వేడివేడి ఇడ్లీ తింటావా? " నాన్న పక్కన ఇంకెవరో ఉన్నారు. ఆయన అడుగుతున్నాడు. ప్రేమగా, ఆప్యాయంగా ఆయన బాగా పెద్దాయన. నెరిసిన తల, నెరిసిన మీసాలు, చేతిలో కర్ర, పంచె, లాల్చీ

"నేనురా తాతయ్యను. ఏంటి అట్టా చూస్తున్నావు"

"తాతయ్యా!" ఉలిక్కిపడ్డాను. తాత య్యనా నేను చూసేది తాతయ్యనా? తాతయ్యా.

"అవునమ్మా నేను తాతయ్యను. తాతను చూడడానికి తపించి పోతున్నావుటగా. మీ నాన్న చెప్పాడు. అందుకే వచ్చాను. కాదు మీ నాన్న నన్ను వెంటపెట్టుకుని వచ్చాడు"

"మరి మామ్మ, మామ్మేది తాతయ్యా! నాకు ఇంకో తాతయ్య, అమ్మమ్మ కూడా కావాలి. వాళ్లేరి తాతయ్యా"

"వాళ్లు లేరమ్మా! వాళ్లింకా మా ఊరు రాలేదు. వాళ్ల ఊళ్లోనే ఉన్నారు. మా ఊరొస్తే తీసుకొచ్చేవాడిని నాతో"

"మరి మామ్మ నీతో వచ్చిందిగా తాతయ్యా"

"అవునమ్మా వచ్చింది. తనూ వస్తా నంది. కానీ నేనే వద్దన్నాను. నిన్ను తీసు కురమ్మంది. నీకు మంచి పరికిణీ కొనిపెట్ట మంది. నీకు తాళిబొట్టు ఇష్టంటగా! భడవా తాళిబొట్టు ఇష్టం అంటే పెళ్లంటే ఇష్టమని. నీకప్పుడే పెళ్లి కావాల్సి వచ్చిందా? " తాతయ్య నవ్వుతున్నారు.

"పెళ్లి చేసుకుంటే బోలెడన్ని బట్టలు, బంగారం వస్తాయిటగా తాతయ్యా"

తాతయ్య నవ్వుతున్నాడు. తెరలు తెర లుగా.

"నవ్వుతున్నావేం తాతయ్యా"

"ఊరికినే తల్లీ. అలాగే పెళ్లి చేసుకుందు వుగాని ఇలారా నీకు పట్టుపరికిణీ కొని వ్వనా? పద అలా బజారుకి వెడదాం దా"

"నిజంగా నాకు పట్టు పరికిణీ కొనిస్తావా తాతయ్యా"

"అవునమ్మా! కొనిస్తాను. రా త్వరగా రా"

తాతయ్య ముందుకు నడిచాడు. వేగంగా నడిచాడు. ప్లాట్ ఫాం మీదనుంచి పట్టాల మీదుగా గేటుదాటి నడుస్తున్నాడు. నేను తాతయ్య వెనకే పరిగెత్తడం మొదలుపెట్టాను.

తాతయ్య నాకన్నా వేగంగా వెళ్తున్నారు.

"తాతయ్యా ఆగు. నెమ్మదిగా పరిగెత్తు. ఆగు తాతయ్యా నాకు దారి తెలియడం లేదు. తాతయ్యా..."

నాన్న నా వెనకనుంచి "పరిగెత్తు మధూ" అని అరుస్తున్నారు.

నేనెంత వేగంగా పరిగెత్తినా తాతయ్యని అందుకోడం నావల్ల కావడంలేదు. నాకాళ్లు నొప్పి పుడుతున్నాయి. నేనింక పరిగెత్తలేక పోయాను. గట్టిగా "తాతయ్యా" అని అరిచి కిందపడ్డాను. ఒక్క కుదుపుతో రైలాగింది.

ఉలిక్కిపడ్డాను. కళ్లు తెరిచి చూస్తే ప్రయాణీకులంతా యధావిధిగా నిద్రపోతున్నారు. అమ్మ కొంచెం కదిలి కళ్లు విప్పింది.

"మధూ స్టేషన్ వచ్చిందా? " అడిగింది అమ్మ.

నాకేం అర్థంకాలేదు. అంతా అయోమయంగా అనిపించింది. నాన్న, తాతయ్య కలిసి వచ్చారా? ఎక్కడినుంచి? అద్దం లోంచి కళ్లు చికిలించి చూశాను. లైటు వెలుగు కనిపించింది. ఎవరూ లేరు అద్దం మీద. అంతా కలా? నా భ్రమా? ఎందుకిలా అనిపించింది. నాకు గాఢంగా నిద్ర కూడా పట్టలేదు మరి కల ఎలా వచ్చింది? ఏమో అమ్మతో చెప్పాలనుకుని "అమ్మా" అన్నాను.

"ఇడ్లీనా? ఇస్తున్నాను. నాకు గుర్తుంది" అమ్మ డబ్బులకోసం జాకెట్టు లోపల దాచి పెట్టిన రుమాలు తీసింది.

"అదికాదు. మరి మరి నాన్న, తాతయ్య వచ్చారమ్మా"

అమ్మ నావైపు చూసింది.

"అవునమ్మా! తాతయ్య నాకు పట్టుపరికిణీ కొనిస్తానన్నారు"

అమ్మ గట్టిగా నిట్టూర్చింది. ఆవిడ పెదాలమీద సన్నటి విరక్తితో కూడిన చిరునవ్వు ఒక్క క్షణం విరిసి మాయమైంది.

అమ్మ రుమాలు ముడివిప్పి చిల్లర డబ్బులు నాకిచ్చింది. "వెళ్లి ఇడ్లీ తీసుకొచ్చుకో... అలాగే మంచినీళ్లు కూడా పట్రా. జాగ్రత్త త్వరగా వచ్చెయ్" అంది.

నేను డబ్బులు అందుకుంటూ అడిగాను. "అమ్మా నాకు కల వచ్చిందా? "

అమ్మ కొద్దిగా వంగి నా జుట్టు సవరించి అంది. "ఏమీ ఆలోచించకు తల్లీ. ఆ భగవంతుడిని తల్చుకో. అంతే"

అంటే కలవచ్చిందన్నమాట. నిరాశగా అనిపించింది. ఇదంతా నిజమైతే ఎంత బాగుంటుంది? అనుకున్నాను.

ఒకళ్లిద్దరు మగవాళ్లు కూడా లేచారు. వాళ్లని అడిగింది అమ్మ. "ఇక్కడ రైలు ఎంతసేపు ఆగుతుంది బాబూ"

"పది నిమిషాలు ఆగుతుందమ్మా" అన్నాడాయన.

"అయితే ఇంకేం. వెళ్లు ఇడ్లీ తెచ్చుకో. పిచ్చితల్లీ! ఎంత ఆకలేస్తోందో" అమ్మ స్వరంలో నేను ఇంతకుముందు ఎన్నడూ వినని మాధుర్యం, అనురాగం వినిపించాయి. అమ్మకి నేనంటే ఎంత ప్రేమ! డబ్బులు లేకపోయినా నాకు ఇడ్లీ కొనిస్తోంది.

జాలిగా అన్నాను. "పోనీలేమ్మా ఒద్దులే"

"ఎందుకు తల్లీ ఆకలితో ఉండకూడదు. వెళ్లి ఇడ్లీ తెచ్చుకో నా తల్లిగా"

"సరే అలా అయితే తేజని లేపు వాడిక్కూడా కొంచెం ఇడ్లీ పెడతాను" అన్నాను ప్లాస్టిక్ డబ్బా పట్టుకుని సీట్లోంచి లేచి.

"సరే జాగ్రత్త త్వరగా వెళ్లిరా" అంది.

నేను ప్లాస్టిక్ డబ్బా చేత్తోపట్టుకుని అడ్డంగా ఉన్న సామాను, అంతకన్నా అడ్డదిడ్డంగా పడుకున్న ప్రయాణీకుల మీద నుంచి దాటుకుంటూ ద్వారం దగ్గరకు వచ్చి

రైలు దిగాను. చిన్న స్టేషను దగ్గరలో ఎక్కడా పంపు కనిపించలేదు. నాలుగు పెట్టెల అవతల ప్లాట్‌ఫాం మీద టేబుల్ వేసుకుని దానిమీద ఇడ్లీ, వడ పేర్చుకుని అమ్ముతున్నాడు ఒకతను. కొందరు కుర్ర వాళ్లు చేతిలో ఇడ్లీలు, వడలు పట్టుకుని, కొందరు వేరుసెనక్కాయల బుట్ట పట్టుకుని అన్ని పెట్టెల్లోకి ఎక్కుతూ అరుస్తున్నారు గట్టిగా.

నేను ఇడ్లీలవైపు పరిగెత్తాను. మా పెట్టె దాకా రాగానే అమ్మ అద్దం ఎత్తి కిటికీలోంచి చూస్తోంది. నన్ను చూడగానే "జాగ్రత్త త్వరగా వచ్చెయ్" అంది.

"అలాగే" అన్నాను. పరిగెత్తుతూ.

నేను వెళ్లేసరికి పదిమందిదాకా ఆ టేబుల్ చుట్టూ గుమికూడి ఇడ్లీలు పార్శెలు చేయించుకుంటున్నారు. కొందరు అక్కడే ఆకుల్లో పెట్టిస్తే తినేస్తున్నారు. నేను నా చేతిలో ఉన్న డబ్బులు అతనికిచ్చి "ఇడ్లీ కావాలి" అన్నాను.

అతను డబ్బులు తీసుకున్నాడు.

నేను కమ్మటి వాసనలు పీలుస్తూ పొట్లం కోసం చూస్తూ నిలబడ్డాను.

రెండు నిమిషాలు గడిచాయి "బాబూ... ఇడ్లీ" అడిగాను.

"ఇస్తానుండమ్మాయ్"

మళ్లీ రెండు నిమిషాలు గడిచాయి.

అసహనంగా అడిగాను. "బాబూ ఇడ్లీ... రైలు వెళ్ళిపోతుంది"

"ఏం వెళ్లదు... ఆగు... ఇక్కడ అందరికీ ఇస్తున్నాగా"

"రైలు వెళ్ళిపోతుంది" మళ్లీ అన్నాను.

"అబ్బబ్బ... ఏం పిల్లో..." విసుగ్గా అంటూ రెండు ఇడ్లీ ఆకులో వేసి దానిమీద కొబ్బరి పచ్చడి, అల్లప్పచ్చడి వేసిచ్చాడు.

ఒక చేత్తో అది పట్టుకుని, అమ్మ దగ్గరకు పరిగెత్తాను. అమ్మ నా వైపే చూస్తోంది. ఆకు అమ్మ చేతికిచ్చాను కిటికీలోంచి.

"ఇప్పుడే వస్తాను. మంచినీళ్లు తీసుకుని" అంటూ మళ్లీ పరిగెత్తాను. రైలు వెళ్ళిపో తుందేమోనన్న భయంకన్నా, ఇడ్లీ ఎప్పుడె ప్పుడు తినాలా అని ఉంది నాకు. త్వరగా మంచినీళ్లు తీసుకుని వెళ్ళిపోవాలి అను కుంటూ చుట్టూ చూశాను. ప్లాట్‌ఫాంమీద జనం పల్చగా ఉన్నారు. చాలామంది రిజ ర్వేషన్ పెట్టెలవైపే ఉన్నారు. పంపు ఎక్కడా కనిపించలేదు. ప్లాట్‌ఫాంకి అవత లవైపు ఖాళీస్థలం ఉంది. అక్కడంతా తుప్ప లున్నాయి. దానికీ, ప్లాట్‌ఫాంకీ అడ్డంగా ఇనుప ఊచలు పాతి ఉన్నాయి. కొంచెం దూరంగా కనిపించింది పంపు. వెనకాల గోడ మీద ఇచ్చట త్రాగునీరు లభించును అని రాసి ఉంది. పరిగెత్తుకుంటూ అక్క డికివెళ్లాను. అప్పుడు వినిపించింది రైలు కదుల్తున్న సూచనగా కూత. అప్పటికి పంపుతిప్పి, ప్లాస్టిక్ డబ్బా పంపుకింద పెట్టాను. సగం నీళ్లు వచ్చాయి. రైలు నెమ్మదిగా కదిలింది. పంపు కూడా కట్టేయ కుండా డబ్బా తీసుకుని గట్టిగా "అమ్మా... రైలాపు" అని అరుస్తూ పరిగెత్తాను.

రైలు వేగం పెరిగింది. దూరంగా కిటికీ లోంచి రెండు చేతులు ఆరాటంగా, వేగంగా కదుల్తున్నాయి అవి అమ్మ చేతులు.

మిగతా పెట్టెలన్నీ దాటిపోతున్నాయి. ఎవరో "ఎక్కు... ఈ పెట్టెలో ఎక్క మ్మాయ్ " అంటున్నారు తలుపు దగ్గర నిల బడి... చేతులు కూడా అందిస్తున్నారు. కానీ నేను అందుకోలేకపోతున్నాను. అందు కోడానికి పరుగుతీస్తున్నాను. అందడం లేదు. వాళ్లంతా అరుస్తున్నారు. "ఎక్కు... ఎక్కు" అంటూ.

నేను పరుగుతీస్తున్నాను. నా పరుగును దాటుకుంటూ రైలు వెళ్ళిపోతోంది. ఆ రైలు శబ్దంలో నా పిలుపు కంఠనాళాలు తెగిపో యేలా "అమ్మా... తేజా... అమ్మా రైలాపు" అంటూ కలిసిపోతోంది. రైలు వెళ్ళిపో తోంది. ఎక్కడినుంచో అమ్మ స్వరం ఏడు పుతో కూడి వినిపిస్తోంది "తల్లీ మధూ...




మధూ... మధూ..."

"అమ్మా..." రైలు వెళ్ళిపోయింది. నేను కుప్పకూలిపోయాను. చుట్టూ చీకటి. ఖాళీగా ఉన్న పట్టాలు. భూతంలా భయపెడుతోన్న తుప్పలు... "అమ్మా అమ్మా" నేను ఏడుస్తున్నాను. నా గుండె తెగిపడేలా అమ్మా... రైలాపు అంటూ ఏడుస్తున్నాను. కానీ నా ఏడుపు వినిపించనంత దూరంగా రైలు వెళ్ళిపోయింది.

నేనింకా ఆశగా, ఆరాటంగా "అమ్మా రైలాపు... రైలాపమ్మా... వస్తున్నానమ్మా... అమ్మా... నాకు భయంవేస్తోందమ్మా" అంటూ ఏడుస్తూనే ఉన్నాను. నా ఏడుపు చుట్టుపక్కల ప్రతిధ్వనిస్తోంది. అక్కడ అమ్మ నాకోసం ఎంతగా ఏడుస్తోందో అని తల్చుకుంటుంటే మరింత ఉధృతంగా దుఃఖం వస్తోంది.

పడినచోటే అలాగే కూలబడి వెక్కివెక్కి ఏడుస్తున్నాను. ప్లాట్‌ఫాం కూడా దాటిపోయింది. పట్టాలు, తుప్పలు తప్ప ఏం లేదు. ఒక్క మనిషి కూడా కనిపించడం లేదు. పెద్దపెద్ద చెట్లు గాలికి ఊగుతున్నాయి. చలితో, భయంతో వణికిపోతున్నాను. నా వంటిమీద ఓణీ ఎక్కడో పడిపోయింది. పరుగుతీయడంలో రిబ్బను ఊడిపోయి జడ పాయలు వీడిపోయి జుట్టు వీపంతా పరుచుకుంది. నా గుండెల విసిపోయేలా, నా స్వరపేటిక విరిగిపోయేలా ఏడుస్తున్నాను.

హటాత్తుగా నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణం గోలగా మారింది. జనాలు గుంపులుగా పరిగెత్తుకొస్తున్నారు. గోలగా అరుస్తున్నారు. నాకు ఒక్కసారిగా ధైర్యం వచ్చింది. లేచి నిలబడి గట్టిగా అరవసాగాను. "రైలాపండి... రైలాపండి. నేను ఎక్కాలి" అంటూ. నన్ను దాటుకుని కొందరు, నన్ను తోసేసి కొందరు అరుస్తూ పరిగెత్తుతున్నారు. వాళ్లెందుకు పరిగెత్తుతున్నారో, ఎక్కడికి వెళ్తున్నారో అర్థంకాని నేను వెర్రిగా అరవసాగాను "రైలాపండి. రైలాపండి" అంటూ.

ఎవరూ నా గోడు వినిపించుకోవడం లేదు. ఆందోళనగా, గాభరాగా పరిగెత్తుతున్నారు. నేను రెండుసార్లు కిందపడి మళ్ళీ దులుపుకుని లేచాను. ఈసారి నేను కూడా వాళ్లతోపాటు పరిగెత్తడం ప్రారంభించాను. అలా పరిగెత్తుతూనే చాలా దూరం వచ్చాం. అప్పుడు కనిపించింది. ఆగిపోయిన రైలు... చుట్టూ జనం.

అంతే... ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతూ "అమ్మా" అంటూ పరిగెత్తాను.

ఎవరో నన్ను పట్టుకున్నారు "ఏయ్ అమ్మాయ్... ఆగు... ఆగు... అటు వెళ్లకు" అంటూ. నేను గింజుకున్నాను. "నన్ను వెళ్ళనివ్వండి. మా అమ్మ దగ్గరకు వెళ్లాలి. మళ్ళీ రైలు వెళ్లిపోతుంది"

"రైలు పోదిప్పుడు. నువ్వటు వెళ్లకు... ఎవరో రైల్లోంచి దూకారు. చచ్చిపోయారు" నేను ఆగిపోయాను. "ఎవరు? ఎవరు దూకారు? " గాభరాగా అడిగాను.

"ఎవరో ఒకావిడ... చేతిలో పిల్లాడితో సహా దూకేసింది"

"ఎవరావిడ? " అడుగుతూనే ఆయన్ని ఒక్కతోపుతోసి పరిగెత్తాను. అడ్డం వస్తున్న వాళ్లని తోసుకుంటూ, తన్నుకుంటూ పరిగెత్తాను. పరిగెత్తి పరిగెత్తి అలసిపోయాను. ఆఖరి ఊపిరి మిగిలి ఉందేమో. ఒక్కసారి గట్టిగా అరిచాను. "అమ్మా" మా పెట్టె ఆఖరిది. పెట్టెలన్నీ దాటాను. మా పెట్టె దగ్గరకి వస్తోంది. ఆనందం, ఏడుపు ముప్పెనగా వచ్చాయి.

ఒక్కసారిగా ఆగిపోయాను. మా పెట్టె దగ్గర జనం. అందరూ రైలు దిగి గుంపుగా నిలబడి ఉన్నారు. వాళ్లని దాటుకుంటూ, తోసుకుంటూ తలుపు దగ్గరకి వెళ్ళడానికి ప్రయత్నించాను.

అప్పుడు కనిపించింది. వెల్లకిలా పడిపోయిన అమ్మ, అమ్మమీద పడిపోయిన



తేజ... వాళ్లచుట్టూ రక్తపు మడుగు... ఆ మడుగులో ఉన్న నల్లసంచీ, చెల్లాచెదురైన ఇడ్లీ... మూత ఊడిపోయి, చిందరవందరగా పడిఉన్న పెట్టె.

"అమ్మా... అమ్మా... తేజా" గట్టిగా అరిచాను.

ఎవరో అంటున్నారు. "పాపం! ఈ పిల్ల కోసమే ఆవిడట్లా దూకింది. పిల్ల నీళ్లకోసం దిగింది. ఆ పిల్ల వచ్చేలోగానే రైలు కదిలింది. తల్లిప్రాణం కొట్టుకుపోయింది. ఎంత ఆపినా ఆగలేదు. పిల్లవాడిని, పెట్టెని పట్టుకుని కదుల్తున్న రైల్లోంచి దూకింది"

"అమ్మా... అమ్మా"

★ ★ ★

"మనిషి విధిచేతిలో కీలుబొమ్మట" ఎవరో అంటున్నారు. నేను మెల్లిగా మెడ తిప్పి అటువైపు చూడడానికి ప్రయత్నించాను. కానీ మెడ విరిగినంత నొప్పి పుట్టింది. పైగా మెడచుట్టూ ఏదో గట్టిగా, బరువుగా కట్టి ఉంది. తల తిప్పలేక బాధతో కెవ్వుమన్నాను... 'అమ్మా.'

తెల్లటి బట్టల్లో ఉన్న నర్సు నా దగ్గరగా వచ్చింది. "నొప్పిగా ఉందా పాపా!" నా తల మీద చేయివేసి ఆప్యాయంగా అడిగింది. నేను ఏం మాట్లాడలేదు. నా కళ్లు మాత్రం గుండ్రంగా తిరిగాయి. అమ్మా... నా గొంతుదాటి రావడంలేదు. సన్నగా మూలుగుమాత్రం వినిపిస్తోంది. నేనెక్కడున్నానో నాకర్థం కావడంలేదు. అంతకుముందు ఏం జరిగిందో నాకేం తెలియడంలేదు. నాకు అమ్మ కావాలి. అమ్మా... సన్నగా గొణుగుతూ, ఏడుస్తున్నాను.

నర్సు నా కళ్లు తుడుస్తూ అంది "తప్పమ్మా... ఏడవకు... నీకు మెడకి దెబ్బ తగిలింది... ఏడవకు"

"అమ్మ కావాలి"

నర్సు జాలిగా చూసింది "వస్తుంది" అంది కళ్లతో సైగచేస్తూ.

"నేనెక్కడున్నాను"

"హాస్పిటల్లో. ఇది రైల్వే హాస్పిటల్"

"అమ్మ"

"అమ్మ కూడా పక్కగదిలో ఉంది"

"తేజ"

"తేజా! తే... ఆ— ఉన్నాడు... పక్కగదిలో. నువ్వు పడుకో... ఇదిగో కొంచెం పాలు తాగి పడుకో. లేచేటప్పటికి వాళ్లూ వచ్చేస్తారు"

"వస్తారా?" ఆశగా చూశాను.

"ఊ" చెమ్చాతో కొద్దికొద్దిగా పాలు నా నోట్లో పోస్తూ అంది.

నెమ్మదిగా గుటకవేయసాగాను. కాస్సేపటికి కళ్లు మూతలు పడ్డాయి.

"మధూ!" ఎవరిదో పిలుపు వినిపించింది.

ఉలిక్కిపడి చూశాను. ఎదురుగా అమ్మ, అమ్మ పక్కనే నాన్న... ఇద్దరూ మంచి ఖరీదైన బట్టలు కట్టుకున్నారు. వాళ్లిద్దరి చిటికెనవేలు పట్టుకుని, మధ్యలో మంచి బట్టలు వేసుకుని, నిగనిగలాడే బూట్లు వేసుకుని నిల్చున్నాడు తేజ. నవ్వుతున్నారు ముగ్గురూ.

కాస్సేపటికి మళ్ళీ వినిపించింది పిలుపు "మధూ!"

"అమ్మా..." గట్టిగా అరవబోయాను. చేతకాలేదు.

"నొప్పిగా ఉందా తల్లీ!"

"అవును. అమ్మా! ఇడ్లీ తినాలనుందే వేడి వేడి ఇడ్లీ"

"తెచ్చానమ్మా... ఇదిగో" అమ్మ చేయి చాచింది. ఆమె కుడిచేతిలో ఆకుపచ్చటి లేత అరిటాకు... దాంట్లో వేడిగా పొగలొస్తూ తెల్లగా, గుండ్రంగా ఉన్న ఇడ్లీ, పక్కనే అల్లప్పచ్చడి.

అమ్మ సున్నితంగా చిన్న ముక్క తుంచి నా నోట్లో పెట్టింది. ఎంత రుచిగా ఉంది! అదేవిటో నాకిష్టంలేని పెరుగన్నం కూడా అమ్మచేత్తో పెడితే ఎంతో రుచిగా అనిపించింది.





"నువ్వు కూడా తినమ్మా"

"ఒద్దు... నేనిప్పుడే తిన్నాను. డజనిడ్లీ తిన్నాను"

"మరి తేజ"

"వాడూ తిన్నాడు"

"నాన్న"

"నాన్న కూడా తిన్నారు. నువ్వు తిను... ఇడ్లీ ఇడ్లీ అని కలవరించావుగా. తిను... ఇదిగో" అమ్మ మరో ముక్క తుంచి పచ్చడి నంచి నా నోట్లో పెట్టింది.

"ఇంక చాలమ్మా... కడుపు నిండింది"

"లేదు... ఇంకా నిండలేదు. అబద్ధం చెప్తున్నావు దొంగా... తిను... చూడు దీన్నిండా కమ్మటి నెయ్యివేసి కారప్పొడి చల్లి నీకోసం పంపించింది మామ్మ... తిను"

"మామ్మ పంపించిందా? "

"అవును. నీకోసం సున్నుండలు, అరిసెలు, జంతికలు అన్నీ పంపించింది"

"అలాగా... అన్నీ తింటాను... పట్టు పరికిణీ పంపించిందా? "

"ఊ... చాలా పరికిణీలు పంపించింది. అన్నట్టు నా గొలుసు అడిగేదానివిగా... ఆ గొలుసూ, దానికి రెండు తాళిబొట్లు అన్నీ తెచ్చాను. వేసుకుంటావా? "

"ఊ..."

"కానీ వేసుకునేముందు ఆలోచించమ్మా... బాగా ఆలోచించు... ఆ గొలుసు అందంకోసం కాదు. అలంకారంకోసం అంతకన్నా కాదు. రక్షణకోసం. ఆడదానికి ఈ సమాజంలో రక్షణకోసం, ఒక గౌరవం కోసం, పదిమందిలో గుర్తింపుకోసం... ఓ వ్యవస్థలో తానూ ఓ వ్యక్తిగా నిలచిపోడం కోసం... ఆ గొలుసుతోపాటు అనేక రకాల బాధ్యతలూ, బాధలూ మోయాలి... మోస్తావా? "

"ఆ మోస్తాను. తప్పకుండా మోస్తాను. ఆ గొలుసు వేసుకుంటే నాకో ఇల్లు, కారు, నగలు, చీరలు అన్నీ వస్తాయికదూ!"

"వస్తాయి. వాటితోపాటు, కష్టాలూ, కన్నీళ్లూ కూడా వస్తాయి. అన్నిటినీ సమానంగా భరిస్తావా? "

"ఓ... నాకా గొలుసు ఇస్తే చాలు... అన్నీ భరిస్తాను"

"అలాగా... అయితే ఇదిగో... తీసుకో"

అమ్మ చేతిలో మిలమిల మెరుస్తూ ఓ గొలుసు. దానికి వెల్లాడుతోన్న తాళిబొట్లు

"ఊ... తీసుకో"

అమ్మ నవ్వుతోంది.

నేను చేయి చాచాను. గొలుసు అందలేదు.

"తీసుకో" అమ్మ కొంచెం దూరం జరిగింది.

నేను కొంచెం ముందుకి జరిగాను. గొలుసు నాకు అందడంలేదు.

అమ్మ నవ్వుతూ ఇంకా దూరం జరిగింది. గొలుసు నాకు అందడంలేదు.

"అమ్మా... నాకు అందడంలేదు. నువ్వే తెచ్చివ్వు... చూడు నా చేయి నొప్పి పుడుతోంది. మెడ కూడా నెప్పిగా ఉంది"

"మెడనొప్పి అయితే, ఈ గొలుసు ఎక్కడ వేసుకుంటావు? అయితే వద్దులే పడేస్తానీ గొలుసు"

"ఒద్దు... నాకివ్వు నాకేం నెప్పిలేదు... అమ్మా... గొలుసివ్వు... అమ్మా"

అమ్మ దూరంగా, ఇంకా దూరంగా వెళ్ళిపోతోంది. అమ్మతోపాటు నాన్న, నాన్నతోపాటు తేజ... అందరూ వెళ్ళిపోయారు. వాళ్ళ నవ్వులు, మాటలు అన్నీ దూరంగా బాగా దూరంగా.

"పాపా! పాపా!"

ఉలిక్కిపడ్డాను. నేను కళ్లు తెరిచేటప్పటికి ఎదురుగా తెల్లటి బట్టల్లో దయగల చిరునవ్వుతో నర్సు.

"ఏంటమ్మా ఏదన్నా కల వచ్చిందా? "

నేనేం మాట్లాడలేదు. "లే... తెల్లారింది. ఇవాళ నీ మెడ కట్లు విప్పుతారు. ఇదిగో పేస్టు పళ్లు తోముకో. నీళ్లు కూడా తెచ్చాను"

తెల్లవారిందా? అంటే నాకు కనిపించిం

దంతా కలేనా? చచ్చిపోయిన నాన్న, తాతయ్య కల్లోకి వచ్చారు. మరి అమ్మ, తేజ ఎందుకు కల్లోకి వచ్చారు. వాళ్లేరి, నాకు దెబ్బ తగిలితే వచ్చి చూడరేం?

నర్సు చేయి ఆసరాగా ఇచ్చి నన్ను లేవ దీసింది. పేస్టు ఇచ్చింది. పళ్లు తోముకు న్నాను. ఆయా పట్టుకున్న బేసిన్‌లో నీళ్లు పుక్కిలించాను.

"ఇదిగో పాలు తాగు" గ్లాసు అందిచ్చింది నర్సు.

ఇదేంటి అమ్మ కదా పాలు తాగించా ల్సింది. నర్సు తాగిస్తుందేం!

"అమ్మ... అమ్మ ఏది? " అడిగాను.

నర్సు మాట్లాడలేదు.

ఆయా జాలిగా "పాపం!" అంటూ బేసిన్ తీసుకుని వెళ్ళిపోయింది.

"అక్కా" పిలిచాను. నర్సు నావైపు చూసింది. "మా అమ్మ, మా తేజ ఎక్కడు న్నారు? "

"ఉన్నారు... వస్తారు" అంటూ మొహం తిప్పుకుని వెళ్ళిపోయింది.

నేను నెమ్మదిగా చుట్టూ చూశాను. ఒక హాల్లో చాలామంది మంచాలమీద పడు కుని ఉన్నారు. వాళ్ళ మంచాల దగ్గర స్టూల్స్‌మీద కొందరు కూర్చుని వాళ్లకి బత్తా యిలు వలిచిపెట్టడం, బ్రెడ్డు తినిపించడం, పాలు తాగించడం లాంటివి చేస్తున్నారు. అందరూ ఉన్నారు. అమ్మేది?

"ఆయా" పిలిచాను. అటుగా వచ్చిన ఆయా "ఏంకావాలమ్మా" అంటూ వచ్చింది.

"మా అమ్మ ఎక్కడుంది? "

ఆయా కళ్లు తుడుచుకుంది. "డాక్టర్‌గారు వస్తారు. ఆయన చెప్తారు" అంటూ వెళ్ళిపో యింది.

నేను అసహనంగా అమ్మకోసం ఎదురు చూస్తూ అలాగే పడుకున్నాను. చాలాసే పటి తరవాత డాక్టర్‌గారు వచ్చారు.

"ఏం పాపా! ఎలా ఉన్నావు? ఏం చదు వుతున్నావు? నొప్పిగా ఉందా? మీ ఊరేది? " అంటూ కబుర్లు చెబుతూ నెమ్మ దిగా కట్టు విప్పారు. "ఏదీ మెడ కొద్దిగా ఎడం పక్కకి తిప్పు"

నేను మెల్లిగా తిప్పాను.

"గుడ్... ఇప్పుడు కుడిపక్కకు తిప్పు... అలాగే నెమ్మదిగా"

నేను కుడిపక్కకి తిప్పాను.

"ఇపుడు కిందకి... ఆ అలా... పైకి చూడు... వెరీగుడ్" అని నా భుజం తట్టి నర్సుతో అన్నారు. "సిస్టర్ షివిల్‌బి ఓకే. కొద్దిగా నరాలు దెబ్బతిన్నాయి. ఇవాళా, రేపు ఉంచి డిశ్చార్జి చేద్దాం. ఈ అమ్మాయి తాలూకు వాళ్లు ఎవరున్నారో నెమ్మదిగా అడిగి తెలుసుకోండి" అంటూ పాడ్‌కి ఉన్న క్లిప్‌లో దూర్చిన కాగితాలమీద ఏదో రాసి, ఈ టాబ్లెట్స్, ఈ ఇంజక్షన్ ఇవ్వండి అంటూ మరో మంచం దగ్గరకి వెళ్ళిపో యారు.

నర్సు నా దగ్గరకు వచ్చి "పాపా ఈ ఊళ్లో నీకు చుట్టాలెవరన్నా ఉన్నారా" అడి గింది.

"అమ్మ ఉంది"

నర్సు కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"ఎందుకు ఏడుస్తున్నారు? " అడిగాను.

"పాపా..." అంటూ ఏడ్చింది నర్సు... నాకేం అర్ధంకాలేదు. ఎందుకేడుస్తోంది నర్సు.

"మీ అమ్మగారు... లేరమ్మా"

"అమ్మ లేదా? అంటే... అమ్మ... ఎక్క డికి వెళ్ళింది"

"అక్కడికి..." పైకి చూపించింది.

కెవ్వుమన్నాను "కాదు... మా అమ్మ చచ్చి పోలేదు... అక్కా... అమ్మ చచ్చిపోలేదు. నాకు అమ్మ కావాలి... తేజ కావాలి" అంటూ బిగ్గరగా ఏడవటం మొదలుపె ట్టాను.

నర్సు గట్టిగా ఆయా అంటూ కేకపెట్టి నన్ను గట్టిగా పట్టుకుంది. ఆయా వచ్చింది. నర్సు నన్ను పట్టుకోమని చెప్పి, గబగబా

ఇంజక్షన్ చేసింది. నేను అలాగే ఏడుస్తూ నెమ్మదిగా నిద్రలోకి జారిపోయాను.

★ ★ ★

**నా** జీవితం ఆరోజు చిత్రమైన మలుపు తిరిగినరోజు...

నాకు ఆరోగ్యం చేకూరాక నన్ను డిశ్చార్జి చేశారు రైల్వే హాస్పిటల్ నుంచి.

డాక్టరుగారు వచ్చి నన్ను పరీక్ష చేసి, "ఇంక ఇంటికి వెళ్లవచ్చు వెళ్తావా? " అని అడిగారు... నేను ఏమీ మాట్లాడలేదు. ఆయన నా సమాధానంకోసం ఎదురుచూడ లేదు. పాడ్‌మీద ఉన్న కాగితాల్లో ఏదో రాసి నర్సుకిచ్చారు.

ఇంగ్లీషులో నర్సుతో ఏదో మాట్లాడారు. నర్సు తల ఊపింది. ఆయన వెళ్ళిపో యాక "నువ్వివాళ వెళ్ళిపోవచ్చు.. వెళ్తావా? " అని అడిగింది.



"వెళ్తాను" అన్నాను. కానీ ఎక్కడికి వెళ్లాలి? అన్న ప్రశ్న నా మన సులో తొలిచేయడం ప్రారంభమైంది అప్పుడే. అమ్మా, నాన్న, తమ్ముడూ అందర్నీ పోగొట్టుకుని వంటరిగా మిగిలిపో యిన నేను ఎక్కడికి వెళ్ళాలి? ఏం చేయాలి? నాకేం అర్థంకాలేదు. నా గుండెల్లో దుఃఖం... కళ్లల్లో కన్నీటి కడ వలు, ఎక్కడికెళ్లను? ఎవరున్నారని వెళ్లను? తాతగారు లేరు. మామ్మలేదు. బాబాయి ఉన్నా రానివ్వడు. ఆయన రాని చ్చినా నేను వెళ్లను. ఆయన అమ్మని తిట్టాడు. అమ్మని ఏడిపించాడు. మామ్మనీ, తాతగారిని చంపేశాడు. నన్ను కూడా చంపేస్తాడు. అమ్మో... నేను వెళ్లను.

తిరుపతిలో ఉన్న తాతగారి దగ్గరకు వెళితే. అవును వెళ్ళాలి తిరుపతి వెళ్లాలి. తాతగారి పేరు ఏదో శాస్త్రిగారు అని చెప్పారు నాన్న. కొంచెం గుర్తుచేసుకుంటే తప్పకుండా పేరు తెలుస్తుంది. కనీసం తాతగారి ఫోటో కూడా లేదింట్లో. అసలు ఏ ఫోటోలూ లేవెందుకో. అందరిళ్లల్లో అమ్మా, నాన్న, తాతయ్యా, మామ్మ, మావ య్యలు ఇలా గ్రూప్ ఫోటోలున్నాయి. కానీ మా ఇంట్లో మాత్రం అసలు ఎవరి ఫోటో లేదు... ఎందుకనో!

ఇప్పుడు ఒక్కసారి అమ్మనీ, నాన్ననీ, తేజనీ చూద్దామంటే కనీసం ఫోటో కూడా లేదు. ఆ మాట తల్చు కోగానే నాకు విపరీతమైన ఏడుపు వచ్చింది.

పక్కకు తిరిగి దిండులో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడవసా గాను.

మధ్యాహ్నానికి నన్ను డిశ్చార్జి చేశారు. మంచం దిగి బైటవరండా లోకి వచ్చాను.

నేనీ హాస్పిటల్లో నాకు తెలిసిన దగ్గర్నించీ నాలుగు రోజులున్నాను. నాకు తెలియకుండా అంటే స్పృహలేకుండా రెండురోజులున్నానుట. వెరసి ఆరురోజులు నేనీ హాస్పిటల్లో ఉన్నాను. అమ్మా, తేజా చనిపోయి ఆరురోజులు... గుండె పగిలిపో తున్న భావన... నేనిప్పుడు ఎక్కడికి వెళ్లాలి? నాకు అమ్మని చూడాలని ఉంది. అమ్మ ఎక్కడ పడిపోయిందో ఆ స్టేషన్ దగ్గరకు వెళ్ళి ఆ రైలు కనిపిస్తే నా తల్లిని పొట్టనపెట్టుకున్న ఆ రైలుని కిరోసిన్ పోసి తగలబెట్టాలని ఉంది. నన్ను వంటరిదాన్ని

చేసిన ఆ రైలుని ఏవన్నా చేయాలని ఉంది. కానీ ఆ స్టేషను ఏదో నాకు తెలియదు. కనీసం ఎవరూ చెప్పలేదు. నాతో ప్రేమగా మాట్లాడిన నర్సు కూడా తనకి తెలియదంది. ఇప్పుడు నేనున్నది ఏ ఊరో కూడా నాకు తెలియదు. ఆరోజు అమ్మ శవం చూసి స్పృహ తప్పిన నన్ను రైల్వేహాస్పిటల్లో చేర్పించారట.

అప్పుడు నేను పడడంలో ఏం తగిలిందో కానీ, నా మెడకు బాగా దెబ్బ తగిలిందట. నరాలు కొద్దిగా చిట్లాయట. చిన్న ఆపరేషన్ చేశారని తెలిసింది. నాకు సేవలు చేసిన నర్సు చాలా విషయాలు చెప్పింది. తను హాస్పిటలో కాంపౌండ్‌లో ఉన్న హాస్టల్లో ఉంటోందిట.

ఆలోచిస్తూ, బరువుగా అడుగులు వేసుకుంటూ వరండాలోకొచ్చి నిలబడ్డాను.

నన్ను ఒకే ప్రశ్న తొలిచేస్తోంది. నేను ఎక్కడికి వెళ్ళాలి? ఎక్కడ ఉండాలి? నాకెవరున్నారు? అప్పుడే అటుగా వచ్చిన నర్సు నా దగ్గరకు వచ్చింది "పాపా నీ పేరేంటి? " అడిగింది.

"నా పేరా? నా పేరు తెలియదా? "

"లేదు... ఎలా తెలుస్తుంది? నువ్వు చెప్పలేదుగా"

"ఓ... నా పేరు మధుమతి"

"మీ నాన్నగారి పేరు? "

నాకేడుపు వచ్చింది. బలవంతంగా ఆపుకుంటూ అన్నాను "భాస్కర్"

"నువ్వు ఎక్కడికి వెడతావు ఇప్పుడు? "

మౌనం నా సమాధానం అయింది.

"మీ మావయ్యలు, తాత, అమ్మమ్మలు ఎక్కడుంటారు? "

"తిరుపతిలో" ఠకీమని చెప్పాను.

"మరి నువ్వు అక్కడికి వెళ్లచ్చుగా"

ఆశగా చూశాను "అవును వెళ్లచ్చు"

"మరైతే వెళతావా? "

ఆలోచిస్తూ "ఊ" అన్నాను.

"ఒక్కదానివీ వెళ్లగలవా? "

"వెళ్తాను"

"నిన్ను నేను రైలెక్కించగలను. టికెట్టు కొనివ్వగలను. రైలు తిరుపతి వెళ్తుంది. నీకు వాళ్లిల్లు తెలుసుకాబట్టి, అక్కడ దిగి వెళ్ళిపోగలవా? లేదంటే వాళ్ల అడ్రసు ఇవ్వు నేను టెలిగ్రాం ఇచ్చి పిలిపిస్తాను"

"ఒద్దొద్దు వెళతాను... నన్ను రైలెక్కించండి చాలు" ఖంగారుగా అన్నాను.

"నిన్ను నా దగ్గరే అట్టిపెట్టుకోవాలని ఉంది. కానీ, నేనుండేది హాస్టల్లో కదా... అక్కడ నిన్ను ఉండనివ్వరు. జాగ్రత్తగా వెళ్తావు కదా" ఎంతో జాలిగా అడిగింది.

"వెళ్తానక్కా" అన్నాను.

"నువ్వలా అక్కా అని పిలుస్తుంటే నాకు మా చెల్లాయిలా అనిపిస్తున్నావు. నాకు చెల్లెళ్లులేరు. ఒక అన్నయ్య, నేను... అంతే"

"నన్ను ఎప్పుడు రైలెక్కిస్తావక్కా" అడిగాను.

"సాయంత్రం... నా డ్యూటీ అయ్యాక వెళదాం... అన్నట్టు మర్చిపోయాను. నిన్ను హాస్పిటల్ కి తీసుకొచ్చినవాళ్లెవరో ఒక సంచీ, ఒక పెట్టె ఇచ్చారు. నా దగ్గర ఉన్నాయి. ఇస్తానుండు" అంటూ నర్సు లోపలికి వెళ్లింది.

సంచీ సంగతి అప్పుడు గుర్తొచ్చింది నాకు. నాకు వేరే బట్టలులేవు. నేను వేసుకున్నవి తప్ప. పెట్టె ఉందిగాబట్టి అందులో నా బట్టలు కూడా ఉన్నాయి. నేను బట్టలు మార్చుకోవచ్చు అనుకుంటే హాయిగా అనిపించింది.

నర్సు పదినిమిషాల్లో పెట్టె, సంచీ తెచ్చిచ్చింది.

"ఒకపని చేద్దాం. నా రూంకి వెళదాం అక్కడ నువ్వు స్నానం చేసి, బట్టలు మార్చుకో... భోజనం చేశాక కాస్సేపు పడుకో. నేను నా డ్యూటీ అవగానే వచ్చేస్తాను. తరువాత స్టేషన్‌కి వెళదాం. సరేనా? " అంది.

"అలాగే..."





ఇద్దరం కలిసి నర్సు ఉంటోన్న హాస్టల్‌కి వెళ్లాం. ఆవిడ రూం మరీ చిన్నదిగా కాకుండా, పెద్దదిగానూ కాకుండా మధ్యస్థంగా ఉంది. ఓ పక్క మంచం ఉంది. దానికి దోమతెర ఉంది. మరోపక్క టేబుల్, కుర్చీ ఉన్నాయి. కిటికీలో మంచినీళ్ల కూజా, నీళ్లగ్లాసు ఉన్నాయి. ఎంతో శుభ్రంగా ఉంది గది. గదికి ఆనుకుని బాత్‌రూం ఉంది.

"నువ్వు స్నానం చేసి, రెడీగా ఉండు. మా మెస్‌లో నీకు భోజనం పంపించమని చెప్పి వెళతాను. భోజనం చేసి పడుకో. సాయంత్రం వస్తాను. భయమేం లేదు. ఉంటావా? " అడిగింది.

"ఉంటాను" అన్నాను.

"తలుపేసుకో" అంటూ చెప్పి నర్సు వెళ్ళిపోయింది.

ఆవిడ వెనకాలే వెళ్ళి తలుపేసుకున్నాను. నెమ్మదిగా పెట్టె మూత తీశాను. అమ్మ చీరలు నాలుగు, నావీ, తేజవీ కలిపి బట్టలు టవల్స్ రెండు, నాలుగు దుప్పట్లు... సంచీ విప్పాను. ఖాళీ అయిన పెరుగన్నం తాలుకు ఆకులు రెండు, చేతులు తుడుచుకోడానికి చిన్న టవల్... చిన్న ప్లాస్టిక్ డబ్బాలో ఉప్పు... మరో దాంట్లో నిమ్మకాయ ముక్కలు. మరో డబ్బాలో తగరం కాగితంలో చుట్టిన తాళిబొట్లు. అవి పాపాయమ్మ ఇచ్చినవి. మొహానికి అడ్డుపెట్టుకుని వెక్కివెక్కి ఏడ్చాను.

హటాత్తుగా నాకో ఆలోచన వచ్చింది. నేను తాతగారి దగ్గరకి తిరుపతి వెళ్లేబదులు పాపాయమ్మ దగ్గరకి వెళితే. గుంటూరుకైతే ఒక్కదాన్ని వెళ్లగలను. సత్రం కూడా నాకు బాగా తెలుసు. జాగ్రత్తగా వెళ్ళగలను. పాపాయమ్మతో జరిగింది చెప్పి, నీ దగ్గరే ఉంటాను మామ్మా అంటే నన్ను గుండెల్లో దాచుకుంటుంది. అవును అలా చేయాలి. అలా నిర్ణయించుకున్నాక నా మనసు కొంత ఊరట చెందింది.

వేరే పరికిణీ, జాకెట్టు ఓణీ తీసుకుని స్నానానికి వెళ్ళాను. పంపు తిప్పి చన్నీళ్ల స్నానం చేశాను. హాయిగా అనిపించింది.

నేను స్నానం చేసి వచ్చేటప్పటికి తలుపు చప్పుడైంది. తలుపు తీసి చూస్తే ఓ కుర్రాడు టిఫిను క్యారియర్ తెచ్చిచ్చాడు.

కడుపునిండా అన్నం తిన్నాను.

కళ్లు మూతలు పడుతున్నట్టుగా అయి, అక్కడే గచ్చుమీద పడుకున్నాను. అమ్మ చీర పరుచుకుని. అమ్మ కౌగిట్లో ఉన్నట్టుగా హాయిగా అమ్మని తల్చుకుంటూ పడుకున్నాను.

సాయంత్రం నర్సు వచ్చి తలుపు కొట్టిం దాకా నాకు మెలకువరాలేదు.

ఆవిడ లోపలికి వచ్చి "బాగా నిద్రపట్టిందా" అనడిగింది.

"ఊ..."

"సరే! నువ్వు తాతగారి దగ్గరకి వెళ్ళడానికి నిర్ణయించుకున్నట్టేనా? "

"లేదు. ముందు గుంటూరు వెళతాను" అన్నాను.

"గుంటూరా? ఎందుకు? ఎవరున్నారక్కడ? "

"మామ్మ"

"అలాగా... అయితే ఇంకేం గుంటూరే వెళ్లు. ఇక్కడినుంచి గుంటూరుకి నాలుగు గంటలు ప్రయాణం ఇప్పుడొద్దు. ఏ అర్థ రాత్రో వెళతావు. రేపు ఉదయం వెళుదువు గానిలే... బోలెడు బస్సులున్నాయి. బస్సు ఎక్కిస్తాను. వెళుదువుగాని" అంది.

★ ★ ★

మర్నాడు ఉదయం నర్సు నన్ను గుంటూరు వెళ్లే బస్సు ఎక్కించింది. ఆ బస్సు తిరుపతిదాకా వెళ్తుందిట. గుంటూరు మీదనుంచి వెళ్తుందిట. నర్సు చెప్పింది. తిరుపతి అనగానే నా మనసు మళ్లీ తాతగారిమీదకు పోయింది. కానీ, ఎలా? ఎలా వెళ్ళాలి? అమ్మలేదు, నాన్న లేడు. తాతగారు ఎవరో నాకు తెలియదు. నేనెవరని చెప్పను. మీ మనవరాల్ని

తాతయ్యా అంటే నమ్ముతారా?

"ఇదిగో టిక్కెట్టు... అంటూ నా చేతికి టిక్కెట్టు ఇచ్చి ఈ డబ్బులుంచుకో. ఇంత కన్నా నీకే సాయం చేయలేకపోతున్నాను" అంటూ వంద రూపాయలు నా చేతిలో పెట్టింది నర్సు.

బస్సులో ఎక్కాక నాకు టాటా చెప్పి అనేక జాగ్రత్తలు చెప్పి నర్సు వెళ్ళిపోయింది. నాకు కిటికీ పక్కన సీటు దొరికింది. నా పక్కన ఒకావిడ కూర్చుంది. ఆవిడ నల్లగా, లావుగా, మొరటుగా ఉంది. ఆవిడ చేతులు నాకు బండలా తగులుతున్నాయి. ఆవిడ నేను బస్సు ఎక్కిన దగ్గర్నించీ నావైపే చూస్తోంది. బస్సు కదిలింది... బస్టాండ్ దాటింది.

బస్సు కదిలాక నాకు భయం మొదలైంది. జీవితంలో మొదటిసారిగా ఒక్కదాన్ని ప్రయాణం చేస్తున్నాను. ఇంక జీవితం మొత్తం ఇలా వంటరిగానే ప్రయాణించాలా? ఇంక నాకెవరున్నారు? నన్ను ఎవరు చదివిస్తారు? నాకెవరు పెళ్లిచేస్తారు? నా మంచీ, చెడూ, కష్టం సుఖం ఎవరు చూసుకుంటారు?

"భగవంతుడా ఎందుకిలా చేశావు? మా అమ్మనీ, నాన్ననీ, తమ్ముడినీ ఎందుకు తీసికెళ్ళిపోయావు, నన్ను కూడా తీసికెళ్ళచ్చుగా, మేమందరం ఒకే దగ్గర ఉంటాంగా... దేవుడా నువ్వు చెడ్డవాడివి"

అలా అనుకోగానే చెవి దగ్గరగా అమ్మ స్వరం వినిపించింది.

"తప్పమ్మా... దేవుడు మంచివాడు. అంతా మన ఖర్మ... మనకిలా రాసిపెట్టి ఉంటే, ఆయనేం చేస్తాడు పాపం!"

"రాసిపెట్టి ఎలా ఉంటుంది? దేవుడు రాసిందేగా. అలాంటప్పుడు ఆయనిలా చెడ్డగా రాయడం ఎందుకు? మంచి రాత రాయచ్చుగా"

నా ఈ ప్రశ్నకి అమ్మ సమాధానం చెప్పలేదు. "తప్పమ్మా... తప్పు" అంటూ నా నోరు మూయించేది.

"చూశావమ్మా... తప్పు అన్నావు. కానీ తప్పు కాదని, దేవుడు చెడ్డవాడని నీకిప్పుడైనా తెలిసిందా? " అనుకున్నాను.

బస్సు ఊరి పొలిమేరలు దాటింది. ఇప్పుడు ఎక్కడ చూసినా విశాలమైన మైదానాలు కనిపిస్తున్నాయి. పచ్చగా, పచ్చని దుప్పటి పరిచినట్టున్న మైదానాలు... ఆ మైదానంలో సరదాగా తిరుగుతోన్న పశువులు. ఆ మైదానానికి అంచులా నిలబడిన పెద్ద పెద్ద చెట్లు... నా పక్కన కూర్చున్నావిడ బస్సు కుదుపులకి మాటిమాటికీ నామీద పడుతోంది. నాకు చాలా చిరాగ్గా ఉంది. కానీ ఏం అనలేకపోయాను.

ఆవిడ నారింజపండు ఒలిచి నా చేతికి రెండు తొనలివ్వబోయింది నాకు తీసుకోవాలనిపించలేదు.

"ఒద్దండీ" మొహమాటంగా అన్నాను.

"తీసుకో... ఫర్వాలేదు" బలవంతంగా నా చేతిలో తొనలు పెట్టి, "ఎక్కడికి వెళ్ళాలి నువ్వు? " అడిగింది.

"గుంటూరు"

"అలాగా... గుంటూరులో ఎక్కడికి వెళ్ళాలి? ఎవరమ్మాయివి నువ్వు? "

అవును ఎవరమ్మాయిని నేను? నేనెవరిని? నా ఉనికి ఏంటి? నా స్థానం ఎక్కడ? ఈ ప్రశ్నలన్నీ అప్పుడు మొదలైనాయి. ఆ ప్రశ్నలకి సమాధానం ఆలోచిస్తూ నేను మౌనంగా ఉండిపోయాను. ఎంత ఆలోచించినా నాకు సమాధానం లభించలేదు. నాకిప్పుడు అమ్మా, నాన్న, తమ్ముడు, తాతయ్యలు, మామ్మ, అమ్మమ్మ, మావయ్య, బాబాయి ఎవరూ లేరు. నేను ఒక్కదాన్నే. నా కోసం బాధపడి, నా కోసం తన తాళిబొట్లు కానుకగా ఇచ్చిన పాపాయమ్మ మాత్రం ఉంది. నేనిప్పుడు పాపాయమ్మ దగ్గరకి వెళుతున్నాను. కానీ అక్కడ మాత్రం ఎంతకాలం ఉండగలను. పాపాయమ్మ ఏం అంటుందో! నాకు బాగా





దుఃఖం వచ్చింది. నా ఏడుపు ఎవరికంటా పడకుండా బలవంతంగా ఆపుకున్నాను. కానీ ఆపుకున్నకొద్దీ ఉధృతం అవసాగింది. ఓణీ చెంగు ఉండలా చేసి, నోట్లో కుక్కుకుని ఏడవసాగాను. నా భుజంమీద చేయిపడింది.

"ఎందుకేడుస్తున్నావు? " ఆవిడ అడిగింది.

నేనేం మాట్లాడలేదు. ఆవిడ అలా అడిగాక మరీ ఎక్కువైంది దుఃఖం...

"చెప్పు... ఎందుకేడుస్తున్నావు? భయంగా ఉందా? "

అవునన్నట్టుగా తలూపాను.

"ఒక్కదానివీ ఎప్పుడూ ప్రయాణం చేయలేదా? "

"లేదు..."

"అదా సంగతి. భయంలేదులే. ఇంతకీ గుంటూర్లో ఎక్కడికెళ్ళాలి? "

"పాపాయమ్మ సత్రానికి"

"ఎక్కడుంది? "

"తెలియదు"

"మరెట్లా వెళతావు? "

"రిక్షా అబ్బాయి తీసికెళ్తాడు"

"ఆవిడ నావైపు అదోలా చూసింది. "పాపాయమ్మ ఎవరు? "

"సత్రంలో ఉంటుంది"

"నీకేమవ్వుతుంది? "

"నా మనవరాలిగా భావించి ఇవి ఇస్తున్నానే... దీని పెళ్ళికివ్వు" తాళిబొట్లు ఇస్తూ పాపాయమ్మ అన్నమాటలు గుర్తొచ్చాయి. "మా మామ్మ" అన్నాను.

"మీ మామ్మ సత్రంలో ఎందుకుంది? మీ అమ్మెక్కడుంది? నాన్నెక్కడ ఉన్నాడు? " ఆవిడ ఆరాగా అడిగింది.

ఆ ప్రశ్నకి సమాధానం లేదు నా దగ్గర.

నా బిక్కమొహం గమనించిందేమో ఆవిడ జాలిగా అడిగింది. "నీకు అమ్మా, నాన్నా లేరా? "

ఆ మాటకి నాకు ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. వెక్కి వెక్కి ఏడవసాగాను. చాలాసేపు ఏడుస్తూ ఉండిపోయాను. నన్నలా ఏడవనిచ్చి ఓదారుస్తూ, ప్రేమగా అన్నదావిడ "చూడూ... నీకేదన్నా సాయం కావాలంటే నేను చేస్తాను. ఏడవకు. నీకేదన్నా సాయం కావాలా? "

నేను ఆవిడ ఓదార్పుకి మొత్తం జరిగిందంతా చెప్పాను. మేము తిరుపతి వెళ్ళడం, తాతగారిని కలుసుకోడానికి ప్రయత్నించడం, నాన్న చనిపోవడం, నేనూ, అమ్మా, తేజా గుంటూరు రావడం, ఆ తరవాత బాబాయి దగ్గరకు వెళ్ళడం అలా ప్రతి విషయం చెప్పాను. ఆఖరికి నేను ఇడ్లీ కోసం రైలు దిగడం, రైలు వెళ్ళిపోవడం, నా కోసం అమ్మ, తేజ కదిలే రైల్లోంచి దూకడం ఇలా అన్ని విషయాలూ చెప్పేసి, వెక్కి వెక్కి ఏడవసాగాను.

ఆవిడ చెదిరిన నా జుట్టు సర్దుతూ, తన పైటచెంగుతో నా కన్నీళ్లు తుడిచింది. నన్ను తన గుండెలకి పొదువుకుని, "నా తల్లే చిన్న వయసులో ఎన్ని కష్టాలు అనుభవించావమ్మా? పిచ్చి తల్లీ! నువ్వేం దిగులుపడకు. నిన్ను మీ తాతయ్య దగ్గరకి నేను తీసికెడతాను. నేను తిరుపతే వెళ్తున్నాను"

"ఈ బస్సు తిరుపతి వెళ్తుందా? " నర్సు చెప్పిన సంగతి మర్చిపోయి అడిగాను.

"ఊ... వెళ్తుంది. నాతో వస్తావా? మీ తాతయ్య దగ్గర దింపుతాను" అంది.

"నిజంగానా... మీకు మా తాతయ్య తెలుసా!" అడిగాను. ఆనందంతో నా కళ్ళల్లో మళ్ళీ నీళ్లు తిరిగాయి.

"తెలియకేం! చాదస్తపు బ్రాహ్మడు. అయినా, ఈ కాలంలో అంత పట్టుదల ఉన్నవాడిని నేనెక్కడా చూడలేదు. పద నిన్ను తీసుకెళ్ళి నాలుగు దులుపుతాను. నిన్నెలా తనింట్లో ఉండనీయడో చూస్తాను. కూతుర్ని పోగొట్టుకున్నాడు. మనవరాలిని నన్నా దక్కించుకోమని నిలువునా కడుగుతాను. అయినా అదేం మనిషి. ఛీ... ఛీ...



ఇంత రాక్షసత్వమా? తల్లీ, తండ్రీ లేని నిన్ను ఇట్లా రోడ్డున పడేస్తాడా? చూస్తాను. నీకేం భయంలేదు. నేను చూసుకుంటాలే నీ సంగతి"

ఆవిడ మాటలతో నా మనసులో ఆశల చివుళ్లు తొడిగాయి. నేను తాతయ్య దగ్గరకి వెళ్తాను అన్న ఊహ నాకు చాలా సంతోషాన్ని కలగచేసింది. నాకు తాతయ్య, అమ్మమ్మ ఉన్నారు. అక్కడ పిన్ని ఉంది. మావయ్య ఉన్నాడు. వాళ్ళక్కూడా పెళ్లిళ్లు అయిఉంటాయి. కాబట్టి వాళ్ల పిల్లలు కూడా ఉంటారు. హమ్మయ్య నేను ఒంటరి దాన్ని కాను. చాలు... నాకీ ఆనందం చాలు. దేవుడా నువ్వు కొంచెం మంచివాడివే... అనుకున్నాను.

"నీ పేరేంటమ్మా..." అడిగింది ఆవిడ.

చెప్పాను. "మిమ్మల్ని నేనేమని పిలవాలి? "

ఆవిడ నవ్వింది. "దేవమ్మా" అని పిలువు.

"పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవకూడదు కదండీ"

"ఫర్వాలేదు... నాకలాగే ఇష్టం"

నేను కొంచెం అయిష్టంగానే అంగీకరించాను.

ఇప్పుడు నా మనసుకి కొంచెం ఊరటగా అనిపించింది. ఇంతలో బస్సు గుంటూరు చేరింది.

నేను హఠాత్తుగా అన్నాను. "దేవమ్మా! టిక్కెట్టు గుంటూరుదాకే ఇప్పించింది అక్క"

"అలాగా... ఫర్వాలేదు. తిరుపతికి నేను కొంటాలే... ఇక్కడ టిఫిను చేద్దాం రా" అంటూ సీటులోంచి లేచింది.

"ఎంతసేపు ఆగుతుంది ఇక్కడ ఈ బస్సు? " అడిగాను.

"మనం టిఫిను తిని వచ్చిందాకా ఆగుతుందిలే. భయపడకు. ఇది రైలు కాదుగా మనం ఎక్కిందాకా కదలదు. దా క్యాంటీన్‌లో టిఫిన్ తిందాం" అంటూ క్యాంటీన్ వైపు నడిచింది.

"ఏం తింటావు? ఇడ్లీ తింటావా? " అడిగింది పర్సులోంచి డబ్బులు తీస్తూ.

సాంబారు వాసన వస్తోంది. ఉల్లిపాయలు వేగుతున్న కమ్మటివాసన కూడా వస్తోంది. కానీ, నాకు ఇడ్లీ, సాంబారు తల్చుకోగానే అమ్మ, తేజా గుర్తొచ్చారు. తల అడ్డంగా తిప్పుతూ గబగబా అన్నాను. "వద్దు ఇంకేదన్నా తింటాను"

"ఏం తింటావు? "

"మీ ఇష్టం..."

ఆవిడ దోసె చెప్పింది. ఇద్దరం దోసె తిన్నాం. కాఫీ కూడా ఇప్పించింది. పద అంటూ తిరిగి బస్సు దగ్గరకు తీసుకొచ్చింది.

మేము కూర్చున్న నాలుగు నిమిషాలకు బస్సు కదిలింది.

★ ★ ★

నాకు బహుశా ప్రయాణాలు అచ్చిరావు కాబోలు...మొదటిసారి తిరుపతి వెళ్లిరాగానే నాన్న ఉద్యోగం చిక్కుల్లో పడింది. కొంతకాలానికి నాన్నే పోయాడు. మరోసారి అమ్మతో కలిసి ప్రయాణంచేసి, అమ్మనీ, తమ్ముడినీ శాశ్వతంగా కోల్పోయాను. ఇప్పుడు వంటరిగా ప్రయాణం చేస్తూ నా జీవితాన్ని కోల్పోతానని ఆరోజు అనుకోలేదు. అలా అనుకుంటే నా కథ మరో మలుపు తిరిగేదేమో! లేక నా కథ ముగిసిపోయేదో.... ఏదిఏమైనా దేవమ్మ పరిచయం నా జీవితాన్నిలా మార్చేస్తుందని నేనెప్పుడూ ఊహించలేదు... దేవమ్మలాంటి ఆడవాళ్లు ఈ ప్రపంచంలో ఉంటారని కూడా నాకు తెలియదు.

సాయంత్రం ఆరు అవుతుండగా మా బస్సు తిరుపతి చేరింది. మధ్యలో గుంటూరులో టిఫిను పెట్టించిన దేవమ్మ, మరెక్కడో భోజనం పెట్టించింది. ఈమధ్యలో కూల్‌డ్రింక్ కావాలా? సోడా కావాలా? టీ తాగుతావా? అరటి పండు తింటావా?





అంటూ ఎంతో ప్రేమగా అడుగుతూ, ఎంతో జాగ్రత్తగా అపురూపంగా చూసు కుంది. జీవితం గురించీ, కష్టాల గురించీ; ఆడవాళ్ళ సమస్యల గురించీ ఎన్నో సంగతులు చెప్పింది. మాట్లాడుతూ, మాట్లాడుతూ మధ్యలో నన్ను సూటిగా అడిగింది. నువ్వు పెద్దమనిషి అయ్యావా? అంటూ. చెప్పడానికి నాకు సిగ్గేసింది. ఆవిడ అలా అడగటం నచ్చలేదు. మొహం తిప్పుకుని కిటికీ బైటకి చూడసాగాను.

"సిగ్గుపడతావేం? ఆడాళ్ళందరికీ తప్పదులే... చెప్పు" మోచేత్తో పొడిచింది. ఆవిడ చేయి చాలా గరుగ్గా తగిలింది. బలవంతంగా తలూపాను.

"పోనీలే... మీ అమ్మ ఉన్నప్పుడే ఈ ముచ్చట కానిచ్చింది. పాపం..." అని నిట్టూర్చింది.

ఆవిడ ఏదో మాట్లాడుతూనే ఉంది. కొన్ని అర్థం అవుతున్నాయి. కొన్ని అర్థం అవడంలేదు. నాకు మాత్రం తాతగారి సంగతులెన్నో అడిగి తెలుసుకోవాలనిపించింది.

"మీరు మొదట్నించీ తిరుపతిలోనే ఉంటున్నారా?" అడిగాను.

"ఆ... నేను పుట్టిన దగ్గర్నించీ అక్కడే ఉన్నా..."

"మా తాతగారు మీకు బాగా తెలుసా!"

"తెలియకేం... బాగా తెలుసు..."

"మా అమ్మమ్మ..."

"ఆవిడా తెలుసు..."

"మా అమ్మమ్మ చాలా మంచిదట.... తాతగారికి భయపడి అమ్మని పట్టించుకోలేదుట..."

"అవునులే... ఆడంగుల పెత్తనాలుండవుగా" అంది.

"మా తాతగారిల్లు చాలా పెద్దదా?" అడిగాను.

"చూస్తావుగా" అంది నవ్వి.

"మా పిన్ని, మావయ్య కూడా అక్కడే ఉంటారా?"

"చూస్తావుగా"

నేనింకా చాలా విషయాలు అడగాలనుకున్నాను. కానీ, ఆవిడ అవకాశం ఇవ్వలేదు. అవకాశం తీసుకుని అడిగినప్పుడల్లా చూస్తావుగా తొందరెందుకు? అంటూ ఇంకేమీ చెప్పకుండా దాటేసింది.

మేము మాటల్లో ఉండగానే తిరుపతి బస్సు డిపోలో ఆగింది. బస్సు దిగగానే రిక్షావాళ్లు మా వెంట పడ్డారు. రిక్షా... రిక్షా ఎక్కడికెళ్లాలండి అంటూ. ఇద్దరం మా పెట్టెలు పట్టుకుని రోడ్డుమీదకు వచ్చాం. ఇంతలో రోడ్డుకి అవతలవైపున్న ఓ రిక్షా అతను వేగంగా రిక్షా తొక్కుతూ వచ్చి మాముందు ఆపాడు. తనెక్కి కూర్చుని, నన్నూ కూర్చోమంది. రిక్షా అతను ఎక్కడికి? ఏంటి? అని అడక్కుండా రిక్షా పరిగెత్తించాడు. "ఎక్కడికో చెప్పారా?" అడిగాను.

"వాడికి తెలుసు" అంది నవ్వుతూ.

"అలాగా మీకు తెలిసినవాడా?" అనేసి ఊరుకున్నాను.

ఆరోజు నాన్న, నేను, తమ్ముడూ కలిసి వచ్చినప్పటి సంగతి గుర్తొచ్చింది. మేము ఏ గుళ్లో సాయంకాలందాకా కూర్చున్నామో ఆ గుడి ముందునుంచే మా రిక్షా పోయింది. నా కళ్లల్లో కన్నీరు తిరిగింది. ఓణీ చెంగుతో తుడుచుకున్నాను.

తాతగారిల్లు ఎక్కడో...

"దేవమ్మా మనం వెళ్ళేది తాతగారింటికేనా?" అడిగాను.

"ముందు మా ఇంటికి వెళ్లి, రేపు ఉదయం మీ తాతగారింటికి వెడదాం... ఇప్పుడు పొద్దుపోయిందిగా... ఆయన రాని వ్వకపోతే మళ్ళీ కష్టం అవుతుంది..." అంది.

నిజమే అనిపించింది...

రిక్షా ఓ సన్నటి సందులోకి మలుపు తిరిగింది. అక్కడి నుంచి నాలుగైదు సందులు

దాటి, ఓ చిన్న ఇంటిముందు ఆపాడు. "దిగు..." దేవమ్మ దిగి డబ్బులిస్తూ అంది నాతో...

సందు చాలా మురికిగా, అసహ్యంగా ఉంది. ఈగలు ముసురుతున్నాయి. దేవమ్మ తలుపు దగ్గరికి నడిచి వేళ్లతో తలుపుమీద బాదింది. ఎవరో ఒకమ్మాయి వచ్చి తలుపు తీసింది. రా లోపలికి అంటూ తానూ లోపలికి నడిచింది.

లోపలికి వెళ్లగానే పొడుగాటి వసారా లాంటిది కనిపించింది. దానికి రెండువైపులా నాలుగేసి గదులున్నాయి. ఆ గదులను కలుపుతూ వసారా చివర ఒకే గది ఉంది. అది దేవమ్మదిట. మేమిద్దరం ఆ గదిలోకి వెళ్లాం. మా వెనకాల మిగతా గదుల గుమ్మాల్లో నిలబడి నలుగురమ్మాయిలు నావైపే చూస్తున్నారు. వాళ్లంతా నాకన్నా కొంచెం పెద్దవాళ్లు. చవకరకం పరికిణీలు వేసుకుని, పల్చటి ఓణీలు వేసుకున్నారు. వాళ్లంతా దేవమ్మ పిల్లలేమో అనుకున్నాను.

మేము లోపలికి వెళ్లగానే ఆ అమ్మాయిలు గుమ్మాల్లోంచి లోపలికి తప్పుకున్నారు.

మరో గదిలోంచి ఇద్దరు అమ్మాయిలు బైటకి వచ్చారు. వాళ్లిద్దరూ పల్చటి చీరలు కట్టుకున్నారు. ఆ చీరల్లోంచి లోపల వేసుకున్న పరికిణీలు కూడా కనిపిస్తున్నాయి.

వాళ్లల్లో ఒకమ్మాయి గొంతు కూడా వినిపించింది... "కొత్తపిల్లని పట్టుకొచ్చింది. దేవమ్మ ఊరికే రాదుగా"

కిలకిల నవ్వులు. దేవమ్మ వెనక్కి తిరిగి కోపంగా అంది... "ఏయ్! ఏంటా నవ్వులు? నోరు మూసుకుని లోపలకి వెళ్లండి"

"లోపల ఎవరున్నారని? వెళ్లి ఏంచెయ్యాలి? " అందో అమ్మాయి.

"ఇక్కడ నుంచుంటే రారు. అట్టా గేటు దగ్గర నిలబడండి" అంటూ నన్ను లోపలికి లాక్కెళ్లింది. మా వెనకాలే ఆ ఇద్దరమ్మాయిలూ కూడా బిలబిలలాడుతూ వచ్చారు.

వస్తూనే నావైపు పరిశీలనగా కాళ్ల దగ్గర నుంచి తలదాకా గుచ్చిగుచ్చి చూడసాగారు.

"ఏ ఊరునుంచి అట్టుకొచ్చా? " అందో అమ్మాయి.

"విజయవాడా? గుంటూరా? " అంది మరో అమ్మాయి.

"ఏ ఊరు నీది? " నన్నే సూటిగా అడిగింది మరో అమ్మాయి. వాళ్లని చూస్తుంటే నాకెందుకో భయం వేసింది. వాళ్లు చాలా అసహ్యంగా ఉన్నారు. మొహంనిండా పౌడరు రాసుకున్నారు. పెదాలకు ఎర్రటి రంగు.... మొహంమీద మెరుపు చల్లుకున్నారు. వాళ్లు దగ్గరకు రాగానే వికారమైన వాసన వచ్చింది.

ఒకమ్మాయి నా దగ్గరకు వచ్చి నా ఓణీ లాగేసి "అబ్బో! అన్నీ బాగానే ఉన్నాయే" అంది వెకిలిగా నవ్వుతూ.

నేను చటుక్కున వంగి కిందపడ్డ ఓణీని తీసుకోబోతుంటే కాలు అడ్డం పెట్టింది. వెంటనే నేను గుండెలకి నా చేతులు అడ్డం పెట్టుకున్నాను.

"అబ్బో ఎంత సిగ్గో... ఇంకేం సిగ్గు ఇక్కడికి వచ్చాక? "

దేవమ్మ ఉరిమినట్టుగా అరిచింది. "ఏయ్! పారిజాతం! నోరు మూసుకుని వెళ్లవే. పని చూసుకో. గులాబీ! వెళ్లు. వెళ్లండి. బుద్ధిలేదూ? జ్ఞానం లేదు. ఎప్పటికొస్తుందో"

"ఊ.... ఇంకేం వస్తుందిలే, నీ చేతుల్లో పడ్డాక" అంటూ రుసరుసలాడుతూ వెళ్లిపోయారు ఇద్దరూ.

వాళ్ల మాటలూ, వాళ్ల ప్రవర్తనా నాకెందుకో చాలా భయం గొలిపాయి. నా ఓణీ లాగేసినందుకు చాలా అవమానంగా అనిపించింది. కళ్లల్లో నీళ్లతో బిత్తరపోయి నిలబడ్డ నన్ను చూస్తూ "వాళ్ల మాటలు పట్టించుకోమాకు. వెకిలిముండలులే. వెళ్లు,

అదిగో బాత్‌రూమ్. శుభ్రంగా స్నానం చేసిరా. ఈలోగా భోజనం పెడుతుంది శకుంతల. అన్నం తిని నిద్రపో. రేపట్నించీ పని ప్రారంభిద్దాం" అంది.

"ఏం పని? " అడిగాను.

"అదే మీ తాతగారిని వెతకడం"

"ఓ... అలాగే" సంతోషంగా అనేసి దేవమ్మ చూపించిన బాత్‌రూమ్‌కి వెళ్లాను.

నేను స్నానం చేసి వచ్చేటప్పటికి దేవమ్మ "శకుంతలా! బంతికి అన్నం పట్రా" అని అరిచింది.

"బంతి ఎవరు దేవమ్మా? " అడిగాను.

"నువ్వే. ముద్దబంతిలా ఉన్నావని నీకా పేరు పెట్టుకున్నాలే ముద్దుగా" అంది నా బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంటూ.

నాకు కంపరంగా అనిపించింది. ఇంతలో కొంచెం పెద్దదానిలా ఉన్న ఒకావిడ పింగాణీ ప్లేటులో వేడివేడి అన్నం, కూరా తీసుకొచ్చింది.

పింగాణీ ప్లేటు దేవమ్మకిచ్చి, నావైపు ఎగాదిగా చూసిందావిడ. "ఏంటా చూడ్డం? పో. పోయి నీ పని చూసుకో" కసిరింది దేవమ్మ.

ఆవిడ వెళ్లిపోయింది.

దేవమ్మ నావైపు చూసి "దా అన్నం తిను. పాపం పొద్దుట్నుంచీ ఆ దోసె తప్ప మరేం తినలేదుగా" అంది ఎంతో ఆప్యాయంగా.

నిజంగానే నాకు బాగా ఆకలేస్తోంది. "నువ్వు తిన్నావా దేవమ్మా? " అడిగాను.

"తింటాలే. తరవాత తింటా. నువ్వు తినెయ్" అంటూ నా చేయి పట్టి లాగి తన పక్కన కూర్చోబెట్టుకుని, ప్లేటు నాముందుకు నెట్టింది. చిందరవందరగా ఉన్న నా పొడుగాటి జడకున్న రిబ్బను విప్పి పాయలుగా విడదీస్తూ "నీకు చక్కగా జడేస్తాను" అంది.

నాకు జడ వేసుకోవడం రాదు. అమ్మే వేసేది. హాస్పిటల్లో నర్సు వేసింది. దేవమ్మ జడ వేస్తానంటే చాలా సంతోషించాను.

నేను అన్నం తినడం పూర్తి అయ్యేటప్పటికి దేవమ్మ చక్కగా జుట్టు చిక్కుతీసి, ఒక్క జడ అల్లి, రిబ్బను కట్టింది. మరోసారి జడ వేళ్లతో సరిచేస్తూ, నా వీపుమీద మెటికలు విరిచి, "ఎంత చక్కటి తలకట్టో ఇక్కడ ఎవతికీ లేదింత జడ" అంది.

నేను కంచం తీయబోతుంటే "వద్దులే నేను తీస్తాను. నువ్వు ఆ గదిలోకి వెళ్ళి పడుకో" అంటూ మేము కూర్చున్న గదిపక్కనే ఉన్న మరో గది చూపించింది. నా సంచీ, పెట్టె తీసుకుని ఆవిడ చూపించిన గదిలోకి వెళ్లాను.

ఆ గదిలో ఒక పందిరిమంచం ఉంది. ఓ మూల చిన్న స్టూలుమీద ఒకమ్మాయి బొమ్మ ఉంది. ఆ అమ్మాయి వంటిమీద పల్చటి బట్ట ఒకటి అడ్డంగా వేసినట్టుగా ఉంది. ఆమె చంకలో బిందె ఉంది. తడిసిన జుట్టు మోకాళ్లదాకా ఉంది. ఆ బొమ్మ చాలా బాగుంది. కానీ అలా ఆ బొమ్మను చూస్తుంటే నాకు సిగ్గేసింది. 'ఛ, బట్టల్లేకుండా బొమ్మని ఎందుకు తయారుచేశారో అసహ్యంగా' అనుకున్నాను. మంచానికి వెనకవైపు గోడలక్కూడా దాదాపు అలాంటి బొమ్మలున్న క్యాలెండర్లున్నాయి. ఓ క్యాలెండర్‌లో అర్ధనగ్నంగా ఉన్న అమ్మాయి, అబ్బాయిల బొమ్మ. మొహం తిప్పేసుకున్నాను.

గది శుభ్రంగా ఉంది. మంచం బాగుంది. పక్క తెల్లగా శుభ్రంగా ఉంది. గదిలో స్టూలుమీద పెట్టిన స్టాండులో అగరొత్తులు వెలుగుతూ మంచి సువాసన వేస్తున్నాయి. కానీ, ఆ బొమ్మలే నాకు నచ్చలేదు. నిద్ర లేవగానే దణ్ణం పెట్టుకోడానికి పడుకునే గదిలో అమ్మ దేవుడి క్యాలెండర్లు తగిలించి ఉంచేది. ఇక్కడేంటి అసహ్యంగా నేను అలాగే గది మధ్యలో నిలబడిపోయాను.

దేవమ్మ కాస్సేపటికి గదిలోకి వచ్చింది. "ఏంటి ఇంకా పడుకోలా నిద్ర రావడంలేదా

ఏం? " అంది.

"అదికాదు దేవమ్మా... నిద్ర లేచాక దేవుడి ఫొటో చూడాలిగా. ఒక్క ఫొటో అన్నా లేదేం"

ఆవిడ గలగలా నవ్వి, "నీకు తెలియదులే చిన్నపిల్లవు. పడగ్గదిలో దేవుడి ఫొటోలుండకూడదు. ఇట్టాంటివే ఉండాలి. పడుకో... పడుకో. రేపు దేవుడి ఫొటో తెప్పించి పెడతాలే" అంది నా భుజంమీద తట్టి మంచం వైపు తోస్తూ.

రేపు నేనెలాగా ఉండనుగా ఇక్కడ అనుకూంటూ వెళ్ళి మంచంమీద పడుకున్నాను. దేవమ్మ లైటార్పేసి, తలుపు దగ్గరగా వేసి వెళ్ళిపోయింది.

చాలాసేపు నాకు బైటనుంచి అమ్మాయిల నవ్వులు, మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. కాస్సేపయ్యాక ఎవరివో మగవాళ్ల గొంతులు కూడా వినిపించాయి. ఆ అమ్మాయిల భర్తలు ఆఫీసునుంచి వచ్చి ఉంటారు కాబోలు అనుకున్నాను. అప్పుడు గుర్తొచ్చింది. వాళ్లకెవరికీ మెడలో తాళిబొట్టు లేదు. అంటే వాళ్ళకి పెళ్లిళ్లు కాలేదా! అయితే వాళ్ళ నాన్నలు వచ్చివుంటారు. వాళ్లలా పెదాలకు రంగు పూసుకుంటే వాళ్ల నాన్నలు ఏమీ అనరా?

ఓసారి నేను సరదాకి శాంతి వాళ్లింట్లో పెదాలకు లిప్‌స్టిక్ వేసుకుని వస్తే నాన్న కోప్పడడం గుర్తొచ్చింది. "తప్పు మధూ... అలా వేసుకోకూడదు. పెదాలు పాడవుతాయి" అన్నారు నాన్న. అప్పట్నించీ నేనెప్పుడూ వేసుకోలేదు. కానీ శాంతి మాత్రం అప్పుడప్పుడూ వేసుకుంటుంది. వాళ్ళమ్మగారే వేసేవారు. శాంతీ వాళ్ళ నాన్నగారు ఎప్పుడూ తనని ఏమీ అనలేదు. ఏమో కొందరు నాన్నలకిష్టం ఉండదు. కొందరు నాన్నలకిష్టం ఉంటుంది కాబోలు. నాన్న చెప్పిన మాట వినాలిగా. వీళ్ళంతా వాళ్ల నాన్నలు ఇష్టపడితేనే అలా తయారయి ఉంటారు. అలా ఆలోచిస్తూ ఉండగానే కళ్లు మూతలు పడ్డాయి.

గట్టిగా వినిపిస్తోన్న స్వరాలు నెమ్మదిగా దూరం అయ్యాయి. ఇప్పుడు దేవమ్మ గొంతు మాత్రం వినిపిస్తోంది. అది కూడా అస్పష్టంగా కానీ దగ్గరగా నాకు బాగా దగ్గరగా నిలబడి మాట్లాడుతున్నట్టుగా ఉంది. కళ్లు తెరిచి చూడాలనుకున్నాను. కానీ కళ్లు తెరిపిన పడడంలేదు. అస్పష్టంగా మాటలు మాత్రం వినిపిస్తున్నాయి. దేవమ్మ స్వరం "పిల్ల చూశావుగా. ఎట్టా ఉందో. బంతిపూవులా ఉంది. అందుకే చూపిస్తున్నా. పద. ఈ పూటకి పడుకోనీ, బాగా అలసిపోయింది. రేపట్నించీ ప్రారంభిద్దాం"

మగవాళ్ల స్వరం. "బేరం చెప్పు"

"ఇక్కడేనా పద అట్టా బైటికెళ్లి మాట్లాడుకుందాం"

క్రమంగా వాళ్ల మాటలు వినిపించడం మానేశాయి. నాకు గాఢంగా నిద్రపట్టింది.

మర్నాడు తెల్లవారి లేచిన దగ్గర్నించీ దేవమ్మ కనిపించలేదు. నిన్న భోజనం తెచ్చిచ్చిన శకుంతల వచ్చి నాకు టీ ఇచ్చింది. స్నానం చేయమంది.

"దేవమ్మ ఏది? " అడిగాను.

"లేదు. బైటికెళ్లింది"

నన్ను కూడా తీసికెళ్తానన్నదే. నన్నెందుకు పిలవలేదు. బహుశా ముందు తను వెళ్ళి తాతగారితో మాట్లాడి వచ్చి తీసికెళ్తుందేమో అని దేవమ్మ కోసం ఎదురుచూస్తూ అన్ని పనులూ చేసుకున్నాను. జడ కూడా నేను వేసుకున్నా సరిగా కుదరలేదు. అలాగే రిబ్బను కట్టుకుని వదిలేశాను. నా బట్టలు ఎవరో ఉతికి ఆరేసినట్టున్నారు.

నా వయసే ఉన్న అమ్మాయి మడతపెట్టి తెచ్చిచ్చింది. మధ్యాహ్నం భోజనం కూడా శకుంతల తెచ్చి పెట్టింది. నాతో ఎవరూ మాట్లాడలేదు. నిన్న కనిపించిన అమ్మాయిలెవరూ కనిపించలేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. మగవాళ్ల కంఠాలు కూడా వినిపించడంలేదు. వీళ్లంతా ఎక్కడికెళ్లారు? ఇంత

నిశ్శబ్దంగా ఉందేంటి? దేవమ్మ ఎక్కడికె ళ్ళింది? ఇంకా రాలేదు. నాకేం అర్థం కాలేదు. భయంగా అనిపిపిస్తోంది. ఇంతలో నా బట్టలు మడతపెట్టి తెచ్చిచ్చిన అమ్మాయి వచ్చింది నా దగ్గరకు.

"నిన్ను ఎక్కడినుంచి తీసుకొచ్చింది దేవమ్మ? కొండమీద తప్పిపోయావా? "

"లేదు... గుంటూరు వెళ్లే బస్సులో కలిసింది. మా తాతగారి దగ్గరకు తీసికెళ్తానని తీసుకొచ్చింది. మధ్యాహ్నం తాతగారి దగ్గరకు వెళ్తాను" అన్నాను.

"మీ తాతగారు ఈ ఊళ్లో ఉంటారా? " అడిగింది.

"అవును"

"ఎక్కడుంటారు? "

"తిరుపతిలో"

"అదే... ఏ పేట? "

"తెలియదు"

"అదేంటి? నీకు తెలియకుండా ఎలా వచ్చావు? "

"దేవమ్మ తీసికెళ్తానంది"

ఆ అమ్మాయి నావైపు జాలిగా చూసింది. "దేవమ్మ నిన్ను తాతగారి దగ్గరకు తీసికెళ్తానని చెప్పి తీసుకొచ్చిందా? తీసికెళ్లదు"

నేను భయంగా చూశాను. "ఏం? ఎందుకు తీసికెళ్లదు? నాతో తీసికెళ్తానని చెప్పింది" అన్నాను గాభరాగా.

"అట్టాగే చెప్తుంది. నాలుగేళ్ల క్రితం నేను కొండమీద తప్పిపోయా. మా అమ్మ, అయ్య దగ్గరకు తీసికెళ్తానని చెప్పి ఇక్కడికి తీసుకొచ్చి నా చేత యాపారం చేయిస్తా ఉంది"

"అంటే..."

"అదే వృత్తి"

"ఏం వృత్తి? "

"నీకు తెలియదా? "

"తెలియదు"

ఇంతలో శకుంతల వచ్చి ఆ అమ్మాయిని పిల్చుకుని వెళ్లింది.

ఆమె మాటలే నా చెవుల్లో గింగురుమంటున్నాయి. వృత్తి చేయిస్తుందా? ఏం వృత్తి చేయిస్తుంది? నాకేం పనులురావు. దేవమ్మ నన్ను తాతగారి దగ్గరకు తీసుకెళ్లదా? అంతా అబద్ధం. ఆ అమ్మాయికి ఏం తెలియదు. దేవమ్మ మంచిది. తనే టికెట్టుకొని మరీ తీసుకొచ్చింది నన్ను. నాకు దోసె కూడా పెట్టించింది. తప్పకుండా తీసుకెళ్తుంది. అలా అనుకున్నాక నాకు కొంచెం శాంతిగా అనిపించింది.

తాతగారి దగ్గరకి వెళ్లడానికి సిద్ధంగా అన్నీ సర్దుకుని దేవమ్మకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను.

మధ్యాహ్నం రెండు దాటాక కొందరు అమ్మాయిలు వాళ్లవాళ్ల గదుల్లోంచి బైటకి వచ్చారు. వస్తూనే వసారాలో గోడకి జారబడి కూర్చున్న నన్ను చూసి, "ఏంటే బంతి పూవా ఇక్కడ కూర్చున్నా... అప్పుడే మొదలైందా? ఎదురుచూపులు? " అంటూ నా బుగ్గ పొడిచి, నవ్వసాగారు ఇద్దరు అమ్మాయిలు. నా బుగ్గ నొప్పి పుట్టింది. కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. ఆ అమ్మాయి దగ్గర చాలా అసహ్యకరమైన వాసన వచ్చింది. ఆమె నిన్నటికన్నా ఇవాళ మరీ అసహ్యంగా ఉంది. మొహానికి పూసుకున్న రంగు బుగ్గలమీదా, కళ్లకిందా, అట్టలు కట్టినట్టుగా అయింది. చల్లుకున్న మెరుపు ఎక్కడపడితే అక్కడ పడి ఉంది. పెదాలు నల్లగా పగిలి ఉన్నాయి. జుట్టు చిందరవందరగా ఉంది. ఆ జుట్టులో వాడిపోయిన పూలదండలు చిక్కుపడి ఉన్నాయి. కొన్ని పూలు మధ్యమధ్యలో, పాయలమధ్య చిక్కుకుపోయి ఉన్నాయి. అప్రయత్నంగా దూరం జరిగాను.

"అబ్బో... అందగత్తెనని ఎంత గీరో దీనికి" అంది నల్లగా ఉన్న ఒకమ్మాయి.

"పోనీలేవే... చిన్నపిల్ల వదిలెయ్ కొత్త కదా... నాలుగు రోజులు పోతే అదేవస్తుంది మనదగ్గరకు. అక్కా లిప్‌స్టిక్

వేస్తావా? అక్కా పౌడర్ రాస్తావా? అంటూ..." అని అవతలికి వెళ్ళిపోయింది నిన్న దేవమ్మ పారిజాతం అని పిలిచిన అమ్మాయి.

"ఊ...ఊ..." అంటూ మూలుగుతూ అందరూ వెళ్ళిపోయారు.

నేను లోపలికి వెళ్ళి నాకు అన్నం పెట్టిన శకుంతలని అడిగాను. "దేవమ్మ ఎక్కడికె ళ్ళింది? ఎప్పుడొస్తుంది? నన్ను మా తాత గారి దగ్గరకు తీసుకెళ్తానంది"

"నాకు తెలియదు... వస్తుందిలే" అంది ముభావంగా ఆమె.

నేను మాట్లాడకుండా పడకగదిలోకి వెళ్లాను. మంచంమీద దిగులుగా కూర్చుండి పోయాను.

నాకు ఏడుపొస్తోంది. "దేవమ్మ ఎక్కడికి వెళ్ళింది? కనీసం నాతో ఒక్కమాట చెప్ప కుండా ఎందుకెళ్లింది? నేను కూడా ఆమెతో వెళ్లిపోయి ఉంటే బాగుండేదేమో. ఇక్కడ నాకసలు బాగాలేదు. ఈ అమ్మాయిలు నాకసలు నచ్చలేదు. వాళ్లు నా బుగ్గలు పొడవటం, నా ఓణీ లాగేయడం, అస హ్యంగా నవ్వడం నాకసలు నచ్చడంలేదు. అమ్మ ఉండి ఉంటే వాళ్లతో మాట్లాడనిచ్చేది కాదు. అసలు ఇక్కడ ఉండనిచ్చేదికాదు. తొందరగా తాతగారి దగ్గరకు వెళ్ళిపో వాలి... వెళ్లిపోవాలి. అమ్మమ్మ ఒళ్లో పడు కుని జరిగిందంతా చెప్పాలి. అమ్మ, తేజ, నాన్న చనిపోయారని చెబితే పాపం అమ్మమ్మ ఎంత ఏడుస్తుందో. తాతగారు కూడా ఏడుస్తారు. పిన్ని నన్ను తప్పకుండా దగ్గరకు తీసుకుంటుంది. ఎంచక్కా రేప ట్నించీ నేను అమ్మమ్మ దగ్గరన్నా, పిన్ని దగ్గరన్నా పడుకోవచ్చు. ఈ గది, ఈ అమ్మాయిలు, ఈ ఫొటోలు ఇవన్నీ ఏం ఉండవు. చక్కగా దేవుళ్ల ఫొటోలుంటాయి. ఇంట్లో... తాతగారికి దైవభక్తి ఎక్కువట. మడి, ఆచారం అన్నీ ఉన్నాయిట. రోజూ పూజలు చేస్తారుట. నేను రోజూ పెంద లాడే లేచి తాతగారికి పూజకి పూలు తెచ్చి వ్వాలి. నా కళ్లముందు పెద్ద ఇల్లు, చక్కటి పూలతోట, రంగురంగుల పూలచెట్లు, మడి కట్టుకుని వంటచేస్తోన్న అమ్మమ్మ. పట్టు పంచె కట్టుకుని పూజ చేసుకుంటోన్న తాత గారు మెదిలారు. పిన్ని ఏం చేస్తోందో. బహుశా అమ్మమ్మకి వంటలో సాయం చేస్తూ ఉంటుందేమో. మావయ్య కాలేజీకి వెళ్లాడో. ఉద్యోగం చేస్తున్నాడో. దేవుడా... నన్ను తొందరగా తాతగారింటికి తీసుకె ళ్లవా?" అనుకుంటూ దేవుడి ఫొటోకోసం వెదికాను... ఎక్కడా లేదు.

"దేవుడా... తాతగారింటికి వెళ్లాలి నేను. వెళ్లాలి" కళ్లు మూసుకుని తిరుపతి కొండ మీద చూసిన విగ్రహాన్ని గుర్తుచేసుకోడానికి ప్రయత్నించాను.

"ఏంటే... అప్పుడే నిద్దరొస్తోందా?" అంటూ దేవమ్మ స్వరం వినిపించి చటు క్కున కళ్లు తెరిచి మంచంమీంచి దూకాను.

"దేవమ్మా ఎక్కడికెళ్లావు? నేను రెడీగా ఉన్నాను. వెడదామా?" అడిగాను ఆశగా.

"ఆ వెళదాం. నేను ఇవాళ ఓ ముఖ్య మైన పనిమీద బైటకివెళ్లాల్సివచ్చింది. రేపు వెళదాంలే. నీ తాతగారింటికేగా" అంది.

"కానీ, నాకిక్కడ ఉండాలని లేదు దేవమ్మా" అన్నాను.

"ఏం? ఏం తక్కువైంది నీకిక్కడ?" కొంచెం సీరియస్‌గా అడిగింది.

నేను భయంగా చూశాను. దేవమ్మ మళ్ళీ స్వరంలో ఆప్యాయత నింపుకుని అడిగింది. "ఎందుకే...ఏమైంది? నిన్నెవరన్నా ఏవన్నా అన్నారా?"

నేనేం మాట్లాడలేదు. ఆ అమ్మాయిలు నచ్చలేదని చెప్పాలనుకున్నాను. పడకగ దిలో ఫొటోలు కూడా నచ్చలేదని చెప్పాల నుకున్నాను. కానీ అలా చెబితే ఏం అంటుందో అని చెప్పలేకపోయాను.

"నీకోసం జిలేబీ తెచ్చాను. ఇదిగో" అంటూ తన చేతిలో ఉన్న సంచీలోంచి





తీసి నాకో పొట్లం ఇచ్చింది దేవమ్మ

నాకు తినాలనిపించలేదు. అల్లిబిల్లిగా అల్లుకున్న జడ ముందుకి వేసుకుని మళ్లీ అల్లుకుంటూ మౌనంగా ఉండిపోయాను.

"జడ వేసుకున్నావా? అయ్యో? పాపం నీకు జడవేసుకోడం రాదుగా. ఇట్రా నేసేస్తా" అంటూ చేతిలో ఉన్న సంచీ కిందపెట్టి నన్ను భుజంపట్టుకుని గిర్రున వెనక్కి తిప్పి, జడవిప్పి మళ్లీ చక్కగా చిక్కుతీసి, అందంగా అల్లింది. సంచీలోంచి పూలదండ తీసి నా జడలో పెట్టింది. మల్లెపూలు మంచి వాసనవేస్తున్నాయి. పెద్ద మొగ్గలు కాదు. ఇప్పుడిప్పుడే వస్తున్నాయేమో చిన్న చిన్న మొగ్గలు... నాలుగు మడతలుగా చేసి పెద్ద దండ పెట్టింది.

అప్పటికి సాయంత్రం ఆరు దాటింది. నిన్నటిలాగే మళ్లీ అమ్మాయిలంతా బిలబిల లాడుతూ తయారై వచ్చారు. వాళ్లందరి జడల్లో పూలున్నాయి. నన్ను చూస్తూనే పక పక నవ్వుతూ "పెళ్ళికూతుర్ని తయారుచే సింది" అందోఅమ్మాయి.

నాకు కోపం వచ్చింది. నా మొహంకేసే చూస్తోన్న దేవమ్మ ఆ అమ్మాయిని కసి రింది.

లోపలికి తొంగిచూస్తూ, "ఒసేయ్ శకుం తలా!" అంటూ కేకేసింది.

శకుంతల బైటికి వచ్చింది.

"దీనికి వేడివేడిగా అన్నంపెట్టు" అంది.

"అవునులే... కొత్తమురిపెంగా... వేడి గానే పెడతావు" అంటూ "రావమ్మా పెళ్ళి కూతురా" అంటూ శకుంతల లోపలికి వెళ్ళి పోయింది.

"వెళ్లు తల్లీ... అన్నం తిను" బుజ్జగింపుగా అంది దేవమ్మ.

"రేపు తప్పకుండా తీసుకెడతావా దేవమ్మా" అడిగాను.

"తప్పకుండా తీసుకెళ్తా" మాట ఇచ్చింది.

కొద్దిగా తృప్తిగా అనిపించింది. లోపలికి వెళ్లాను.

అక్కడ నుంచున్న వాళ్లల్లో ఎవరో అడు గుతున్నారు దేవమ్మని. "ఏంటి? నీ గదే ఇస్తున్నావా దానికి. అవునులే. నువ్వు ముసలిదానివైనావు. నీకింక గదెందుకు? వరండాలో పడుకోవచ్చు"

"నోరుముయ్యవే అది కుందనపు బొమ్మ... దానికి శోభనం ఘనంగా ఏర్పా టుచేస్తాను. చూస్తుండు... ఇహనుంచీ ఈ ఇంట కాసులపంట"

"అబ్బో... కాసులపంట" నవ్వులు.

వాళ్ళ మాటలు పట్టించుకోకు అని నిన్న దేవమ్మ చెప్పిన మాట గుర్తొచ్చింది. కానీ దేవమ్మ అన్నమాటకి అర్థం ఏవిటో తెలి యక అదే ఆలోచిస్తూ లోపలికి వెళ్లాను. నాకెందుకో శోభనం అన్న మాట వినడా నికి ఎలాగో ఉంది. ఈ మాట నేనెప్పుడో, ఎక్కడో విన్నాను. గీతావాళ్లక్క పెళ్ళి అయ్యాక, మర్నాడు వాళ్ళక్కకి తెల్లచీర కట్టారు. బోలెడన్ని పూలతో జడ వేశారు. చాలా అందంగా తయారుచేశారు. "పెళ్ళి అయిపోయిందిగా మళ్ళీ తయారైందేం అక్క" అని నేనడిగితే, "ఇవాళ మా అక్క శోభనం" అంది గీత.

పెళ్లి అయ్యాక శోభనం చేస్తారన్నమాట. మరి దేవమ్మ ఎవరికి శోభనం అంది.

వాళ్లు ఎవరిని ఉద్దేశించి ఈ మాటలు మాట్లాడుకున్నారు. నన్ను ఉద్దేశించా? నాకు పెళ్ళికాలేదుగా. శోభనం ఎలా చేస్తారు? నాకేం అర్థంకాలేదు. నా గురించి కాదేమోలే అనుకున్నాను. కానీ ఎందుకో ఆ మాట పదేపదే గుర్తొస్తూ మనసులో ఏదో ఆందోళనగా అనిపించసాగింది.

దేవమ్మ నన్ను నిజంగా తాతగారి దగ్గ రకు తీసికెళ్తుందా? మొదటిసారిగా నాకెం దుకో ఈ అనుమానం కలిగింది.

మధ్యాహ్నం ఆ అమ్మాయి చెప్పింది నిజ మేనా? దేవమ్మ నన్ను ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చింది? బస్టాండునుంచి నేరుగా తాతగారి దగ్గరకే తీసుకెళితే సరిపోయే

దిగా.

అన్నం సయించలేదు. కంచంలో చేయి కడుక్కుని లోపలికి వెళ్ళి పడుకున్నాను.

దేవమ్మ చేతిలో ఏదో ప్యాకెట్టుతో వచ్చింది. "ఏంటమ్మా పడుకున్నావు. ఒంట్లో బాగా లేదా? " అంది నా నుదుటిమీద చేయివేసి చూస్తూ.

"దేవమ్మా... నన్ను నిజంగా తాతగారి దగ్గరకు తీసుకెల్తావా? " జాలిగా అడిగాను.

ఆవిడ మొహంలో రంగులు మారాయి. వెంటనే నవ్వేస్తూ. "ఎందుకు తీసుకెళ్లను? నీ తాతదగ్గరకు తప్పకుండా తీసుకెళ్తా... ఈ దొంగ..." అంటూ అక్కడ ఉన్న అమ్మాయిలను ఉద్దేశించి తిడుతూ "వీళ్లు ఏదో వాగుతుంటారు. పట్టించుకోకు... నీకు దిష్టిపెడతారు. ఇదిగో ఈ చీర ఎట్టాఉంది నీకు నచ్చిందా? " అంటూ ప్యాకెట్టులోంచి ఓ చీర బైటకి తీసింది. గులాబీరంగులో ఉన్న జార్జెటు చీర... దానిమీద చెమ్కీ పూలు కుట్టి ఉన్నాయి.

నిజంగా ఎంతో బాగుందా చీర "చాలా బాగుంది దేవమ్మా... నీకేనా? " అడిగాను.

పకపకా నవ్వింది. "ముసలిముండని నాకెందుకే ఈ చీర? నీకు... నీకోసం తెచ్చాను" అంటూ, చీరరెండు మడతలు విప్పి, నా భుజంమీద వేసి "ఎంతముద్దొస్తున్నావే" అంటూ నా బుగ్గమీద ముద్దుపెట్టుకుంది. నాకు కడుపులో తిప్పినట్టైంది. ఆమె దగ్గర కూడా ఏదో వాసన చాలా అసహ్యకరమైన వాసన. మొహం తిప్పేసుకున్నాను.

"తీసుకో... ఏదీ ఓసారి కట్టుకురా చూస్తాను" అంది.

"ఇప్పుడా... అయినా నాకెందుకులే దేవమ్మా. నాకు చీర కట్టుకోడం రాదు కూడా. మా అమ్మమ్మ పరికిణీలు కుట్టిస్తుందిలే"

"నా ముచ్చట కాదనకే. తీసుకో... ఒక్కసారి కట్టుకురా... చూస్తాను. నీకు కట్టుకోడం రాకపోతే నేకడతా... ఉండు" అంటూ చటుక్కున నా ఓణీ లాగేసింది.

"అయ్యో... నేను కట్టుకుంటాలే... వద్దు, వద్దు" అరిచాను... సిగ్గుతో చచ్చిపోతూ.

"ఏం ఫర్వాలేదులే. నేనూ ఆడదాన్నేగా. నా దగ్గర సిగ్గెందుకు? " అంటూ అదే పరికిణిలో చీర కుచ్చెళ్లు దోపి, చీర కట్టింది. జారిజారిపోతున్న పైట సరిగా వేస్తూ "ఎంత బాగున్నావే... నా దిష్టే తగిలేలా ఉంది. అంటూ మెటికలు విరుస్తూ "అదష్టవంతురాలివే" అంది.

నేనా? నేను అదృష్టవంతురాలినా? నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నాన్ననీ, అమ్మనీ, తమ్ముడినీ, అందర్నీ పోగొట్టుకుని ఒంటరిగా ఎవరిదగ్గరో పడిఉన్న నేను అదృష్టవంతురాలినా? ఆ తాతగారికోసం కలిసి వెళితే ఆయనా పోయారు. ఆ మామ్మా పోయింది. బాబాయి దుర్మార్గుడు. నేను ఏవిధంగా అదృష్టవంతురాలిని? దేవుడి దయవలన రేపు ఈ తాతగారి దగ్గరకు వెళ్ళి, అమ్మమ్మ ఒడిలో ఆదమరిచిపోతే అప్పుడు అప్పుడు నేను అదృష్టవంతురాలిని అవుతాను. లేకపోతే నా అంత దురదృష్టవంతులు ఎవరూ ఉండరు. తాతగారు రానివ్వకపోతే నేనెక్కడ ఉండాలి? ఈ ఆలోచన రాగానే నిలువునా వణికిపోయాను.

దేవమ్మ అదేం గమనించని దానిలాగా అంది. "ఇవాళ్టికి ఈ చీరతోనే పడుకో"

"చీరతోటా... ఎలా? వద్దులే... నా పరికిణీ, ఓణీతో పడుకుంటా. ఈ చీర రేపు తాతగారి దగ్గరకు వెళ్లేటప్పుడు కట్టుకుంటాలే" అన్నాను.

"రేపటి సంగతి రేపు. నీ పంట పండితే రేపు ఇంకో కొత్త చీర వస్తుందిలే... ఉంచుకో... పడుకో" అంటూ లైటు తీసి, తలుపు ఓరగా వేసి వెళ్ళిపోయింది. వెళుతూ వెళుతూ నా ఒంటిమీదనుంచి లాగేసిన ఓణీ తీసుకుని మరీ వెళ్ళింది. నేను చచ్చినట్టు ఆ చీరతోటే పడుకోవాల్సి వచ్చింది.





తినడం, పడుకోవడం, లేదంటే ఆలోచిస్తూ కూర్చోవడం తప్ప వేరే పనిలేకుండా ఉంది. ఎంతసేపు ఆలోచించినా అమ్మా, నాన్న, తేజ, తాతయ్యలు, అమ్మమ్మ ఇలా నా వాళ్లంతా గుర్తుకొచ్చి ఏడుస్తూ కూర్చోడం తప్ప నేనేం చేయగలను! నాకు చదువుకోవాలని ఉంది. తాతగారి దగ్గరకు వెళితే హాయిగా స్కూల్లో చేరచ్చు అమ్మకోరిక ప్రకారం డాక్టర్ అవచ్చు ఇలా ఎంత కాలం! ఏమైనా సరే... రేపు దేవమ్మ తీసుకెళ్ళకపోతే నేనొక్కదాన్ని అయినా వెళ్ళాలి. అంతే. ఎలాగైనా నేనే కనుక్కోవాలి. తాతగారి పేరు తెలుసు. ఆయన పౌరోహిత్యం చేస్తారుట. అంటే ఎవరింట్లో పెళ్ళి అయినా, పేరంటం అయినా, పూజలైనా తాతగారు వెళ్ళి మంత్రాలు చదివి, ఆ కార్యక్రమాలు జరిపించి వస్తారుట. వాళ్లు డబ్బులిస్తారుట. బట్టలు పెడతారుట. నాన్న చెప్పారు. కాబట్టి పూజలు చేసే శాస్త్రిగారు ఎవరు? అని అడిగితే ఎవరైనా చెప్తారు. అనుకున్నాక నాకు కొంచెం నిశ్చింతగా అనిపించింది. కళ్లు మూసుకున్నాను.

బాగా రాత్రి అయింది. అందరూ పడుకున్నారు. అక్కడంతా నిశ్శబ్దం ఆవరించింది. నెమ్మదిగా నా కళ్ళమీదకి మత్తు ఆవరించింది. మగతగా ఉన్న నేను హటాత్తుగా ఉలిక్కిపడిలేవబోయాను. కానీ, లేవలేకపోయాను. నా పక్కన ఎవరో ఉన్నారు. "ఎవరూ" గట్టిగా అరిచాను.

"ష్ అరవకు" నా నోరు మూశాడు చేత్తో. ఆయన చేయి అంతా సిగరెట్ వాసన.

"ఎవరు మీరు? దేవమ్మా... దేవమ్మా" ఆయన చేయి తోసేసి చివ్వున లేచి కూర్చున్నాను. ఆయన నా జడ పట్టుకుని, వెనక నుంచి లాగాడు. వెల్లకిలా పడ్డాను. ఆయన తన నోటితో నా నోరుమూశాడు. నామీద పడ్డాడు. వాసన...సిగరెట్ వాసన... ఇంకేదో వాసన. చాలా అసహ్యంగా కడుపులో తిప్పేస్తోంది. "దేవమ్మా దేవమ్మా" గట్టిగా అరవాలని ఉంది. నా గొంతు పెగిలిరావడంలేదు. నా పెదాలు కదలడంలేదు. నా పెదాలను మరో పెదాలు నొక్కిపెట్టాయి. కొరుకుతున్నాయి. వదులు...వదులు...నాలో నేనే అరుచుకుంటున్నాను. ఏడుస్తున్నాను. గింజుకుంటున్నాను. దేవుడిని తల్చుకుంటున్నాను. అయినా లాభం లేకపోయింది.

ఆ చీకటి రాత్రి ఓ రాబందుచేతిలో నా కన్యాత్వం బలైపోయింది. అర్ధరాత్రి దాటిందాకా ఆ పశువు నన్ను వదల్లేదు. ఆఖరికి నేను ఏడ్చిఏడ్చి పెనుగులాడి, గోలచేసి, కాళ్లతో తోసి, ఎంతో ప్రతిఘటన చేసి ఓడిపోయి, అలసిపోయి స్పృహ తప్పిందాకా ఆ పశువు వదల్లేదు.

తలుపు చప్పుడవటం, దేవమ్మ ఏదో అనడం అస్పష్టంగా వినిపిస్తుండగా తలవాల్చేశాను.

★ ★ ★

మర్నాడు నాకు తిరిగి స్పృహ వచ్చేటప్పటికి మంచంమీద పడుకుని ఉన్నాను. నా చుట్టూ దేవమ్మా, శకుంతల, పారిజాతం...

నాతో దేవమ్మ గురించి చెప్పిన అమ్మాయి అందరూ ఉన్నారు. నావైపు కొంచెం ఆందో ళనగా చూస్తున్నారు. నేను కళ్లు తెరవగానే హమ్మయ్య అనుకున్నారంతా.

దేవమ్మ నా మొహం మీదకు వంగి, "ఏమ్మా... ఎట్టా ఉన్నా?" అని అడిగింది.

వాళ్లందరినీ అలా చూస్తోంటే నాకు జరి గిందేవిటో కొద్దికొద్దిగా గుర్తుకురాసాగింది. "నీతో వ్యాపారం చేయిస్తుంది. వృత్తి చేయి స్తుంది" ఆ అమ్మాయి మాటలు చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి. నా కళ్లు నీళ్లతో నిండాయి. పెదాలు వణికాయి. నా మొహం మీదకు వంగి లేని ప్రేమ నటి స్తోన్న దేవమ్మ నా కంటికి పిశాచిలా కని పించింది. చివ్వున లేచి కూర్చున్నాను.

"లేవకు పడుకో" అంటూ నా భుజం మీద చెయ్యేసి బలవంతంగా పడుకోబెడు తోన్న దేవమ్మ చేయి పురుగులా తోసే శాను. "వదులు నన్ను... నేను వెళ్లిపో తాను" అంటూ మంచంమీదనుంచి లేవబో యాను.

దేవమ్మ, శకుంతల, పారిజాతం నేను లేవకుండా గట్టిగా పట్టుకున్నారు.

"వదలండి, వదలండి నన్ను వెళ్లని వ్వండి... అమ్మా, అమ్మా" అంటూ గట్టిగా అరుస్తూ, ఏడుస్తూ వాళ్లచేతులు తోసేయడా నికి విశ్వప్రయత్నం చేయసాగాను. కానీ ఉక్కుల్లా వున్న వాళ్ల చేతులు నా భుజా లను బిగించి పట్టుకున్నాయి.

"నోరుముయ్యి. ఎక్కడికే వెళ్ళేది?" క్రూరంగా అరిచింది దేవమ్మ.

"మోసం... నన్ను మోసం చేశావు. దేవుడు నీకు శిక్షవేస్తాడు. నన్ను వెళ్లనీ" అరిచాను.

"నిన్ను వెళ్లనివ్వడానికి కాదే తీసుకొ చ్చింది. ఈ నాలుగు గోడల్ని దాటి ఇంకెక్క డికి వెళతావు? నీ తాత చెడిపోయిన నిన్ను రానిస్తాడా? నువ్విప్పుడు చెడిపో యావు"

"చెడిపోయానా? అంటే" నేను వెర్రిదా నిలా చూశాను.

నాకేదోగా వుంది. ఒళ్లంతా పచ్చిపుం డులా వుంది. అవును నేను చెడిపోయాను.

హఠాత్తుగా వాళ్లచేతుల్లోంచి మంచంమీ దకు ఒరిగిపోయి గట్టిగా ఏడవటం మొద లుపెట్టాను.

"పదండి. మొదటిరోజుగా... రేపటికి అదే సర్దుకుంటుంది." అంటూ అందర్నీ అక్కడినుంచి పంపించేసి తను మాత్రం నా మంచానికి కొంచెం దూరంగా, గుమ్మం దగ్గ రగా కుర్చీ జరుపుకుని బాసింపట్టు వేసు క్కూర్చుంది కిళ్లీ తింటూ.

నేను ఏడుస్తూ అలాగే పడుకున్నాను.

ఆరోజు సంఘటన తరువాత నేను వారంరోజులపాటు జ్వరం వచ్చి మూసిన కన్ను తెరవలేదు. దేవమ్మే వైద్యం చేయిం చింది. దేవమ్మే సేవలు చేయించింది. భయపడ్డానో, భంగపడ్డానో... విపరీతమైన జ్వరం వచ్చింది. కొంచెం జ్వరం తగ్గి లేచాక దేవమ్మ నాకు రెండురోజులపాటు గీతాబోధన చేసింది. జీవితం అంటే ఏవిటో చెప్పింది. "పిచ్చిదానా, మీతాత నిన్ను రాని స్తాడనేనా. మీ అమ్మ కులం కానివాడితో లేచిపోయింది కదా... అందుకే ఆయన రానివ్వలేదు. మీ అమ్మమ్మ, పిచ్చిమాలోకం రానిచ్చినా లోకులు ఊరుకుంటారా. చెడిపో యిన దాని కూతురిని చేరదీశారని వాళ్ల మీద ఆడిపోసుకోరూ... అయినా నీకు పెళ్లీ, పెటాకులూ అవుతాయా చెప్పు. చెడి పోయిన దాని కూతురువని ఎవరూ నిన్ను చేసుకోరు. పైగా ఇప్పుడు దిక్కులేనిదావిని. నా మాట విని ఇక్కడే మేము చెప్పినట్టు వింటూ హాయిగా ఉండు. కనీసం రెండు పూట్లా తిండి, కట్టుకోడానికి బట్టన్నా దొరు కుతుంది. నా మాట కాదని బైటకి వెళ్లావ నుకో మీ తాత చేరదీయడం కాదుకదా అడ్డ మైనవాడి కళ్లూ నీమీదే ఉంటాయి. అందరూ నిన్ను ఆకలిచూపులే చూస్తారు.





ఆకలేస్తే ఆబగా తినేసి. ఎంగిలి విస్తరాకులా విసిరేస్తారు. ఇది మగాళ్ళలోకం. ఆడదానికి, అందునా నీలాంటి గిక్కులేనిదానికి ఈ లోకంలో రక్షణ లేదు. ఇక్కడున్నావనుకో మంచాడిని చూసి పంపిస్తా. వాడు చెప్పి నట్టు వింటే చక్కగా బోలెడు డబ్బిస్తాడు. నువ్విట్టా దడుపుజ్వరాలు, రోగాలు తెచ్చు కుంటే ఆ డబ్బంతా డాక్టర్లకు, మందులకు అయిపోతుంది. నాకు ఒళ్లు మండితే వీధి లోకి నెట్టేస్తా. ఆ తరవాత నీ ఇష్టం. వీధి లోకి వెళ్లి బతుకు కుక్కలు చింపిన విస్తరి చేసుకుంటావో లేక ఇక్కడే ఉండి వీళ్లంద రిలా బతుకుతావో ఆలోచించుకో" అంటూ వార్నింగ్ ఇచ్చింది.

ఏడవటం తప్ప ఏం చేయలేకపోయాను. పారిపోవడానిక్కూడా వీలు లేకుండా దేవమ్మ నలుగురు వస్తాదుల్ని కాపలా పెట్టింది. అనుక్షణం శకుంతల నా చుట్టూ తిరగసాగింది.

నాకిలాంటి పనులు ఇష్టంలేదని, నన్ను వదిలేయమని ఎంతో బతిమాలాను. తాత గారి దగ్గర దింపితే, ఆయన్నడిగి డబ్బు కూడా ఇప్పిస్తానని ఆశపెట్టాను. విరగబడి నవ్వింది. "ఏం ఉంటుంది తద్దినాలు పెట్టే ముసలాడి దగ్గర" అంటూ

"నిన్ను అంత దూరంనుంచి తీసుకొచ్చింది పంపించడానికి కాదు. నీతో వ్యాపారం చేసి, కాసులు పండించుకోడానికి" అంటూ ఖచ్చి తంగా తన అభిప్రాయం చెప్పింది.

"ఇంకేదన్నా పనిచేసి సంపాదించి ఇస్తాను దేవమ్మా... కూలీ చేస్తాను. అంట్లు తోముతాను. నన్ను వదిలెయ్" అని ఏడుస్తూ కాళ్లు పట్టుకున్నాను. కానీ, ఆ రాక్షసి కరగలేదు. ఆమె గీసిన గీత పరి ధిలో, నాలుగు గోడల మధ్యా ఆ మురికికూ పంలో బందీని అయ్యాను. వాగంరోజుల తరవాత చాలా తీవ్రంగా హెచ్చరించి నన్ను గదిలోకి పంపించింది మరో పశువు చేతుల్లో నలిగిపోడానికి.

మొదటిరోజు నన్ను ముట్టుకున్న మగ వాడు ఎవరో నాకు తెలియదు. నన్ను నిద్ర పోనిచ్చి దరిద్రంగా పశువాంఛ తీర్చుకు న్నాడు. కానీ ఆరోజు నా దగ్గరకు వచ్చిన వ్యక్తిని నేను చూశాను. లైటు వెలుగులో చూశాను. ఆయనకి దాదాపు బాబాయి వయసుంటుంది. అచ్చు బాబాయిలాగే ఖద్దరు చొక్కా వేసుకున్నాడు. కుడిచేతికి, ఎడంచేతికి కూడా నాలుగేసి చొప్పున ఎని మిది ఉంగరాలు పెట్టుకున్నాడు.

ఆయన్ని చూస్తూనే ఆయన కాళ్లమీద పడ్డాను. నన్ను ముట్టుకోవద్దని, నన్నేం చేయద్దని మా తాతగారి దగ్గర దింపండి అని ఏడ్చాను. బతిమాలాను. "మా బాబా యిలా ఉన్నారు. దయుంచి కాపాడండి" అన్నాను.

ఆయన చాలాసేపు భరించి, నచ్చచెప్పడా నికి ప్రయత్నించి విసుగ్గా తలుపు తీసుకుని బైటకెళ్లి గట్టిగా "దేవమ్మా" అంటూ పిలి చాడు.

దేవమ్మ పరిగెత్తుకుంటూ వచ్చింది.

"ఏంటి ఈ న్యూసెన్సు... అదేంటి గోలె డ్తాంది. ఇట్టాంటి కేసు తెచ్చావేంది? పిల్ల బాగుందని ఆశపడ్డాను. అనవసరంగా రెండువేలిచ్చాను" అంటూ అరిచాడు.

"ఏం బాబూ మాటినడంలేదా? నాలుగు తగిలించకపోయావా? దొంగ ము... అన్ని చెప్పి పంపించినా వీనడంలేదన్నమాట. ఎల్లండి. నాలుగు తగిలించండి ఎట్టా లొంగదో చూస్తా" అంటూ ఆయన్ని మళ్లీ లోపలికి తీసుకొచ్చి నా జడ పట్టుకుని లాగి, ఆయన మీద పడేలా నన్ను గెంటింది. నేరుగా వెళ్ళి ఆయన గుండెలమీద పడ్డాను. తప్పించుకోబోతున్న నన్ను ఒడుపుగా పట్టు కుని, నా జడలో ఉన్న పూలు వాసన చూశాడు.

దేవమ్మ నావైపు ఉరిమి చూస్తూ అంది. "జాగ్రత్త... వేధవ్వేషాలేస్తే మక్కెలిరగ దంతా" అంటూ తలుపు ధడాల్న వేసు

కుంటూ బైటికి వెళ్ళిపోయింది. వెళ్తూ వెళ్తూ లైటార్పడం మర్చిపోకుండా, లైటార్పి వెళ్లింది.

అంతా చీకటి నిండిపోయింది. ఆ క్షణం నుంచీ నా బతుకులో కూడా నల్లటి కారుచీకటి కమ్ముకుంది.

ఆ చీకట్లో నా జీవితం కృత్రిమపు చిరునవ్వుల వెలుగుల్ని విటులకు పంచుతూ, సమాజంచేత వేశ్య అన్న ముద్ర వేయించుకుంది.

ఆవిధంగా పగలంతా ఏడుస్తూ రాత్రంతా విటుల రాక్షసత్వానికి నలిగిపోతూ, నా జీవితం పతనమైపోయింది.

★ ★ ★

నేనిప్పుడు మధుమతినికాదు. నేనిప్పుడు భాస్కర్, నిర్మలల కూతుర్నికాను. నేనిప్పుడు తేజకి అక్కను కాను. శాస్త్రిగారి మనవరాలిని కాను. మరో లక్ష్మయ్యగారి మనవరాల్ని అంతకన్నా కాను. నేనో పతితను. భ్రష్టురాలిని, దౌర్భాగ్యురాలిని, ఆశలు, కోరికలు లేని శిలను... నాకిప్పుడు బాధ పడడానిక్కూడా ఓపికలేదు. కన్నీళ్లు వస్తే ఓదార్చేందుకు ఎవరూ లేరు. నాలో అమాయకత్వం, సున్నితత్వం అన్నీ పోయాయి. నేనూ రాటుదేలిపోయాను. కష్టాలూ, కన్నీళ్లు వీటన్నిటికీ అతీతురాలినైన ఓ విగత జీవిని. చావలేక బతుకుతూ, చావుకోసం ఎదురుచూస్తూ ఉన్నాను.. నా పేరు ఇప్పుడు బంతి. అక్కడ ఉన్న అమ్మాయిలూ, దే...్మ, శకుంతలా అందరూ కూడా నన్ను బంతీ అని పిలుస్తారు. నేను పలకాలి పలక్కపోతే తిడతారు.

ఆరోజు మొదలుకుని నా మీద దేవమ్మ పెత్తనం చెలాయించడం మొదలుపెట్టింది. ఆవిడ చూపించిన ప్రేమా, ఆప్యాయతా, అనురాగం అన్నీ అబద్ధాలని, నన్ను తన వ్యాపారానికి అనుగుణంగా మలచుకోడానికి ఆవిడ ప్రదర్శించిన మెలకువల్లో భాగమని నాకు తరువాత అర్థమైంది.

ఇప్పుడు నా వయసెంతో నాకు తెలియదు. నేనెవరి అమ్మాయినో, ఎక్కడినుంచి ఇక్కడికి వచ్చానో నాకు తెలియదు. ఇప్పుడు నేను కూడా ఆ అమ్మాయిల్లాగే మొహంమీద రంగులు, పెదాలకు రంగులు వేసుకుంటూ, వెలిసిపోయిన నా భవిష్యత్తుకి కృత్రిమమైన రంగులు అద్దుకుంటూ బతకసాగాను. ఈ ప్రస్థానంలో వయసుడిగినవాళ్లు, మధ్యవయస్కులు, చోటా రాజకీయనాయకులు, వ్యాపారస్తులు ఇలా ఎందరో ఎందరో కలిశారు. కొందరు నాతో కబుర్లు చెప్పారు. కొందరు నాకు బహుమతులిచ్చారు. కొందరు నాకు రోగాలిచ్చారు. మరికొందరు నాకు గర్భాన్నిచ్చారు. అలా ఇచ్చిన వాటిలో గర్భం తప్ప మిగతావన్నీ దేవమ్మ ఆనందంగా స్వీకరించింది. గర్భాన్ని మాత్రం ఆదిలోనే అంతం చేసింది. రెండుసార్లు గర్భస్రావం చేయించింది.

నాకిప్పుడు అమ్మా, నాన్న, తేజా, తాతయ్యలు, మావయ్యా, పిన్ని, బాబాయి, అమ్మమ్మ, మామ్మ ఎవరూ గుర్తురావడంలేదు. వాళ్ళని గుర్తుచేసుకోడానిక్కూడా నాకు మనస్కరించడంలేదు. వాళ్లని స్మరించుకునే అర్హత నేను కోల్పోయానని అనిపిస్తోంది. అందుకే వాళ్లెవరినీ నేను స్మరించుకోడంలేదు. నా పాత పేరు మధుమతి అనీ, నేను డాక్టర్ అవ్వాలని మా అమ్మ కలలుకనేదని, ఎలాగైనా ఎన్ని కష్టాలు పడైనా నేను డాక్టర్ అవడానికి ప్రయత్నించి ఓడిపోయానని నాకు గుర్తులేదు. కాదు... కావాలనే నేను మర్చిపోయాను.

నాకున్నది ఒకటే ఆశ. ఎప్పటికైనా ఈ నరకం నుంచి బైటపడాలి. నన్నీ నరకం నుంచి బైటపడేసే సహృదయులకోసం నా నిరీక్షణ సాగుతోంది. నా దగ్గరకి వచ్చివెళ్లే వాళ్లనెవరినైనా అడగాలంటే నా కోరిక మన్నించి, నన్ను ఉద్ధరించేవాళ్లు నాకెవరూ కనిపించలేదు. వాళ్ళ పక్కన పడుకున్న





ప్పుడు నా కళ్లల్లో నీళ్లు చూసినా, నా మొహంలో నీలినీడలు చూసినా విసు క్కుంటూ, తిట్టుకుంటూ వెళ్లే నీచులు తప్ప మంచి మనసున్నవాళ్లు నాకు కనిపించ లేదు.

నేను బైటప్రపంచాన్ని చూసి చాలాకాలం అవుతోంది. పారిజాతం, గులాబీ, మరికొం దరు అప్పుడప్పుడూ సినిమాలకి వెళ్తుం టారు. వెళ్లినపుడల్లా ఎవరో ఒకరిని తెచ్చు కుంటారు. అలా తెచ్చుకున్న వాళ్లు ఇచ్చే డబ్బులు వాళ్లే దాచుకుంటారు. దేవమ్మకి ఇవ్వరు. చాలాసార్లు నన్నూ రమ్మని పిలి చారు. నాకెక్కడికీ వెళ్లాలనిపించదు. చెడిపో యిన నేను బైటకెలా వెళ్తాను? వెళ్లలేను. నేను వెళ్లినచోట మా తాతగారు కలిస్తే, మావయ్య కలిస్తే, పిన్నీ, బాబాయి కలిస్తే వాళ్లకి నా మొహం ఎలా చూపించను!

నా బతుకు చీకటి బతుకు. చీకట్లోనే ఉండాలి. అంతేకాదు. మిగతావాళ్లలా నేను వీధిగుమ్మంలో నిలబడి విటుల్ని ఆకర్షించా ల్సిన అవసరంలేదు.

నాకోసం చాలామంది వస్తారు. వాళ్లంద రికీ ఓ షెడ్యూలు తయారుచేసింది దేవమ్మ. అలా వచ్చేవాళ్లలో రెండోసారి మూడోసారి కూడా వచ్చేవాళ్లున్నారు. అలాంటివాళ్లకి మళ్ళీ నెలరోజులక్కానీ అవ కాశం రాదు. ఆ అవకాశంకోసం వాళ్లు ఎదురుచూస్తు ఉంటారు. అప్పుడప్పుడూ రాత్రిపూట ఎవరో సినిమావాళ్లు వచ్చారని కూడా ఏవో హోటల్ రూములకి పంపి స్తుంటుంది. వాళ్లు పంపించే కారులో వెళ్లి అదే కారులో తిరిగి వస్తాను.

నేనో యంత్రాన్ని. నాకు స్పందన లేదు. రాత్రిపూట హూనమైన శరీరానికి పగ లంతా విశ్రాంతినిస్తాను. ఉదయం తొమ్మి దింటికల్లా స్నానం చేసి అన్నం తినేస్తాను. నేనిప్పుడు బండబారిపోయాను. నాకు మొహమాటాలు లేవు. నాకు వేళకి అన్నం పెట్టకపోతే దబాయించగలను. ఎవడబ్బ సొమ్ము పెడుతున్నారు. ఇంతాలస్యం అయిందేం అని వాళ్లని తిట్టగలను. నాక్కా వాల్సిన వంటలు కోరి మరీ చేయించుకోగ లను. ఏవన్నా అంటే మీరు తినేది నా కష్టార్జితం. నాకు పెట్టకుండా తింటే మీకు అరగదు. అని శాపనార్థాలు పెట్టగలను. అలా అన్నం తిన్నాక పడుకుని నిద్రపో తాను. నిద్రపట్టకపోతే నా దగ్గర నాలుగు పుస్తకాలున్నాయి. అవి చదువుకుంటూ పడుకుంటాను. నా దగ్గరకు వచ్చివెళ్లిన వాళ్లు ఒకళ్లిద్దరు నాలుగు పుస్తకాలు నా దగ్గర వదిలివెళ్లారు. అవి ఏవో కథలపుస్త కాలు. ఆ పుస్తకాలు చదవడం నాకు చాలా ఇష్టం. ఆ కథల్లో భార్యాభర్తల శృంగారాన్ని వర్ణించే కథలు చాలా ఉన్నాయి. భర్త భార్య వంటిమీద చేయివేస్తే ఆవిడకి ఒళ్లంతా పులకింతలు కలిగాయట. అణువ ణువూ విద్యుత్తు ప్రవహించిందిట. పర వశం కలిగిందట. ఆ మైకంలో అతని చేష్ట లకి ఆమె నిలువునా దాసోహం అయిం దట. నాకసలు అవన్నీ అర్థంకాలేదు. పుల కింతలు, స్పందన, మైకం, పరవశం. ఇలాంటి పదాలకు అర్థం తెలియకుండా నా శరీరం అంతా మగవాళ్ల స్పర్శతో నిండిపో యింది. ఎక్కడచూసినా అడ్డమైనవాళ్ల చే తుల్లో నలిగిన జాడలు. ఒంటిమీద అక్కడ క్కడా గాయాలు. ఉద్రేకంతో వాళ్లు చేసిన గాయాలు. గోళ్లతో, పళ్లతో రక్కిన గుర్తులు. స్నానంచేసేటప్పుడు వంటిమీద నీళ్లు పడగానే బాధతో ఒళ్లంతా జివ్వుమం టుంది. ఆ స్పందన తప్ప మరో స్పందన లేదు నాకు.

కానీ నా గుండె మాత్రం సమయం దొరి కితే చాలు ఓ ఆప్యాయత కోసం, నన్నాదు కునే ఓ మంచిమనసు కోసం, తహతహలా డుతోంది. పగుళ్లు బారిన గుండె చిరుగాలి తగిలినా మంటతో రగులుతోంది. నా కళ్ల ల్లోంచి రాలడానికి అనేక అడ్డంకులను ఎదు ర్కొంటోన్న కన్నీరంతా ఘనీభవించి నా

గుండెల్లో నిండిపోయిందేమో. బరువుగా, ఎంతో బరువుగా ఉంటోంది. ఆ బరువు దించుకోడానికి, ఘనీభవించిన కన్నీరుని స్రవింపచేసి, మండుతున్న నా గుండెని చల్లార్చే వ్యక్తికోసం తపించిపోతోంది.

నా దగ్గర చిన్న రేడియో ఉంది. ఒక కాలేజీ స్టూడెంట్ కానుకగా ఇచ్చాడు. అప్పుడప్పుడు ఆ రేడియో వింటూ ఉంటాను.

ఒకాయన నాకు చిన్న ఉంగరం కూడా ఇచ్చాడు. ఆ ఉంగరం దేవమ్మ తీసుకుని దాచేసింది.

ఓ రోజు ఓ భయంకరమైన సంఘటన చూశాను. బండబారిందనుకున్న నా మనసుకూడా కరిగి నీరై ప్రవహించినరోజు.

దేవమ్మ ఏదో ఊరు వెళ్లింది. ఆమె ఊరు వెళ్లిన రోజు శకుంతల ఆమె పాత్ర నిర్వహిస్తుంది.

రెండోరోజు ఉదయం దేవమ్మతోకూడా పన్నెండేళ్ల పిల్ల వచ్చింది. ఆ అమ్మాయి మొహంలో వీడని పసితనం, అమాయకత్వం చూస్తుంటే నాకు గుండె మెలితిప్పినట్లైంది. ఆ పిల్లను ఎక్కడినుంచి తీసుకొచ్చిందా ఈ మహాతల్లి అనుకున్నాను. నాకెందుకో ఆ పిల్లని ఈ నరకకూపంలో బలికాకుండా రక్షించాలని అనిపించింది.

యధాప్రకారం పారిజాతం వాళ్ళంతా ఆ పిల్లని చూసి ఎక్కడినుంచి కొట్టుకొచ్చావు? అని వేళాకోళం చేశారు. ముందు కసిరి తరువాత చెప్పింది. ఆ పిల్లని తల్లితండ్రులు అమ్మేశారుట. వాళ్లకి రెండువేలిచ్చి కొనుక్కొచ్చిందట. పిల్లలెక్కువై, తిండిపెట్టలేక అమ్మేసారుట. నేను నిలువెల్లా భయంతో వణికిపోయాను. పిల్లల్ని అమ్మేవాళ్లు, కొనేవాళ్లు కూడా ఉంటారా ఈ దేశంలో అనిపించింది.

ఆ పిల్లను దేవమ్మ వెంటపెట్టుకు తిరిగింది రాత్రిదాకా... సాయంత్రానికి ఆ పిల్లకోసం కొత్త పరికిణీ కొనిచ్చింది. ఆ పిల్ల పేరు సంపంగి అని పెట్టింది. సంపంగి వంటరిగా దొరికితే ఎలాగైనా ఈ రొంపి నుంచి బైటపడేయాలని ఆలోచిస్తూ కూర్చున్నాను. ఎట్టిపరిస్థితుల్లో సంపంగి ఒతుకు నాశనం కాకూడదు. ఎంత చిన్నది సంపంగి! అంత చిన్నపిల్లతో ఈ వృత్తి చేయించడానికి దేవమ్మకి మనసెలా ఒప్పుతుంది? మనిషా! రాక్షసా! ఛీ...

శకుంతల కాబోలు అడుగుతోంది. "మరీ ఇంత చిన్నపిల్లను తెచ్చావేం? పెద్దమనిషైందా?"

"ఓ... పదకొండేళ్లకే అయిందిట. ఇప్పుడు ప్యాసింజర్లు చిన్న పిల్లల్నే అడుగుతున్నారు. ముదిరిపోయిన సరుకైతే ఎయిడ్స్ రోగం వస్తుందని భయంట. మనకి పోటీగా కొండమ్మ ఇట్టాంటి పిల్లల్నే కొనుక్కొస్తోంది. అందరూ అక్కడ మరిగారంటే నా యాపారం దెబ్బతినదూ!"

భగవంతుడా! ఏవిటీ వ్యాపారం. ఆడపిల్లల జీవితాలతో వ్యాపారం చేసే వీళ్లసలు మనుషులేనా. ఆడపిల్లలంటే నీకెందుకింత అలుసు? నీకిది న్యాయంగా ఉందా? నన్నెలాగా రక్షించలేకపోయావు. కనీసం ఆ పిల్లనైనా రక్షించు తండ్రీ! బాధగా వేడుకున్నాను.

కానీ అన్ని ప్రార్థనల్లాగే నా ఈ ప్రార్థన కూడా అరణ్యరోదన అయింది. రాత్రి పదింటికల్లా గదిలో ఉన్న వాళ్లల్లో పాతికేళ్లు దాటిన అమ్మాయిలను ఇద్దర్ని బైటకి రప్పించి వసారాలో పడుకోమంది దేవమ్మ. వాళ్లు ఆమెని నోటికొచ్చినట్టు తిడుతూ వచ్చి వసారాలో పడుకున్నారు.

వాళ్ల మాటలు పెడచెవిన పెట్టిన దేవమ్మ సంపంగిని అలంకరించి గదిలోకి తీసికెళ్లింది.

రాత్రి పదైంది నా గుండె దడదడలాడుతోంది.

ఇంకాసేపట్లో ఆ చిన్నారి పాపాయి కంఠంలోంచి వెలువడే ఆర్తనాదాలకోసం నా చెవులు ఎదురుచూస్తున్నాయి.




ఆ రోజు ఎందుకనో ఎవరూ రాలేదు.

దేవమ్మ వీధి వాకిట్లోకి వెళ్లింది.

"అక్టోబర్ రెండుట. ఈ రోజున ప్యాసింజర్లు ఎక్కువగా రారుట" పారిజాతం అంటోంది. హమ్మయ్య రాకపోతే బాగుండు. సంపంగిని నేను రక్షించచ్చు.

"అక్టోబర్ రెండు గాంధీతాత పుట్టిన రోజు. తాతా! సంపంగిని రక్షించవూ" వేడుకున్నాను.

సరిగ్గా పదకొండున్నరకి ఓ నలభై ఏళ్ల వ్యక్తిని వెంటపెట్టుకుని వచ్చింది దేవమ్మ.

"ఆరంగేట్రం చేస్తారా బాబుగారూ" వెకిలిగా నవ్వుతూ అడుగుతోంది.

"ఎంత? " అడిగాడాయన.

"తాజా సరుకు. మీ ఇష్టం" చేతులు నలుపుకుంది.

"ఇవాళేనా ప్రారంభోత్సవం? "

"చెప్పాగా ఆరంగేట్రం"

"సర్లే ఎక్కడ? "

"రండి, చూపిస్తాను"

దేవమ్మ ఆయన్ని తీసుకుని సంపంగి గదిలోకి వెళ్తోంది. "అయ్యో దేవుడా సంపంగిని రక్షించు. వెళ్తోంది వెళ్తోంది..." మొరపెట్టుకున్నాను.

ఆలస్యం చేయకుండా పరిగెత్తుకుంటూ వెళ్లి వాళ్లిద్దరికీ అడ్డంగా నిల్చుని వయ్యారంగా ఒళ్లు విరుచుకున్నాను.

"ఏంటే తీపరమా? " ఉరిమింది దేవమ్మ.

"ఊ... ప్యాసింజర్లు లేరా? " అడిగాను మత్తుగా ఆయనవైపు చూస్తూ.

ఆయన నాలుకతో పెదాలు తడుపుకుంటూ నా వైపు ఆబగా చూశాడు.

"రండి" మత్తుగా అంటూ ఆయన చేయి పట్టుకున్నాను.

"ఏయ్... వదులు. వెళ్లి పడుకో. గంటాగి వస్తాడు" అంది నా చేయి విసిరికొడుతూ.

"ఊహు... నాకిప్పుడే కావాలి"

"పారిజాతం దీన్ని అవతలికి లాగిపారెయ్. ఏదో మాయరోగం వచ్చినట్టుంది" గట్టిగా పారిజాతాన్ని కేకేసి నన్ను తోసేసి లోపలికి వెళ్లిపోయింది.

నేను అసహనంగా పారిజాతం చేయి విసిరికొట్టి నా గదివైపు వెళ్లాను.

లోపల్నించి అప్పుడు వినిపించింది ఆర్తనాదం.

"ఏయ్! గొడవచేయకు. చంపుతాను" గదమాయిస్తోన్న దేవమ్మ స్వరం, గట్టిగా తలుపు చప్పుడు. ఆ పిల్ల రివ్వున పరిగెత్తుకుని బైటకి వచ్చింది.

ఆ పిల్ల వెనకాలే రొప్పుకుంటూ దేవమ్మ వచ్చింది.

"పట్టుకోండి" గట్టిగా అరిచింది. వస్తాదులు గుమ్మం దగ్గరనుంచి లేచారు. ఆ అమ్మాయి నన్ను తోసుకుంటూ నా గదిలోకి వెళ్లి ఠపీమని తలుపేసుకుంది. నేను ఊపిరిపీల్చుకున్నాను.

"నీ మొహం మండా పట్టుకోవేమే" అంటూ నన్ను తోసి తలుపు దబీదబీ బాదసాగింది దేవమ్మ.

వస్తాదులు పరిగెత్తుకొచ్చారు.

"తోయండిరా తలుపు తోయండి" అరిచింది దేవమ్మ.

క్షణాల్లో అక్కడంతా భీభత్సంగా తయారైంది. తలుపులు విరగ్గొట్టి వస్తాదులు లోపలికి వెళ్లి బిక్కచచ్చిపోయి గుండె పగిలేలా ఏడుస్తోన్న సంపంగిని చేతుల్తో ఎత్తుకొచ్చి దేవమ్మ ముందు పడేశారు. ఆ అమ్మాయి దేవమ్మ కాళ్లు పట్టుకుని "వద్దు వద్దు నాకు భయం" అంటూ ఏడుస్తూ బతిమాలసాగింది. దేవమ్మ రెండు చేతుల్తో ఆ పిల్ల జబ్బ పట్టుకుని లేపి ఆ చెంపా ఈ చెంపా వాయించింది. నా కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. గట్టిగా అరిచాను. "దేవమ్మా వదిలెయ్. చిన్నపిల్ల దాని జీవితం నాశనం చేయకు. వదిలెయ్"

"నువ్వు నోర్మూయ్" అంటూ నన్ను కసిరి, వస్తాదులకి చెప్పింది "తీసికెళ్లి మంచం



మీద కట్టెయ్యండి"

వాళ్లు ఒంటిచేత్తో ఆ అమ్మాయిని ఎత్తుకుని వెళ్లారు.

"అబ్బబ్బ ఇంత గొడవేంటి? దేవమ్మా! నన్ను పోనీ దీని బాబులాంటి పిల్లలున్నారు కొండమ్మ దగ్గర. ఆ డబ్బులిచ్చెయ్" విసుగ్గా అన్నాడు ఆ వచ్చినాయన.

"అంతమాటనకండి. ఇదిగో ఈ బంతిని చూశారుగా. దాని దగ్గరకు వెళ్లండి. రేపు అప్పచెబుతాను దీన్ని"

"అవసరంలేదు. వీళ్లందరికీ ఎయిడ్స్ ఉందో! ఏం పాడో! ఫ్రెష్ కాండిడేట్ అన్నావని వచ్చాను. నన్ను పోనీ"

నాకు ఒళ్లు మండిపోయింది. "నీకేరా ఎయిడ్స్ ముసలోడా పో. నా దగ్గరకు వస్తే చంపేస్తా" అని అరిచాను.

దేవమ్మ కోపంగా నన్ను లాగిపెట్టి చెంప మీద కొట్టి "పో లోపలికి" అంటూ ఆయన్ని బతిమాలడం మొదలుపెట్టింది. ఆమెకి తీసుకున్న డబ్బులు ఇవ్వాలంటే ప్రాణం పోతుంది. "మీకియాల ఎయిడ్స్ రోగుల దగ్గర పడుకోడం తప్పదు. నాకు ఎయిడ్స్ ఉంది. వస్తారా?" కవ్వించింది గులాబీ. అక్కడ ఉన్నవాళ్లలో గులాబీ కొంచెం మంచిది.

దేవమ్మకి ఒక్కసారిగా పిచ్చిపట్టినట్లుగా అయింది. రాక్షసిలా మారింది. "మీరుండండి బాబూ! ఎందుకు లొంగదో చూస్తాను" అంటూ విసురుగా లోపలికి వెళ్లింది. చేతిలో ఖారం డబ్బాతో వచ్చింది.

నేను వణికిపోతూ అడిగాను "గులాబీ ఖారం ఎందుకు తెచ్చింది?"

గులాబీ కళ్లు చింతనిప్పుల్లా అయాయి. అమాంతం ఎగిరి కాలితో దేవమ్మ చేతిమీద లాగిపెట్టి తన్నింది. ఖారం డబ్బా ఎగిరి కిందపడింది. ఆ డబ్బాలో ఉన్న ఖారం దేవమ్మ మొహం మీదా, చేతులమీదా పడిపోయి కిందపడింది.

దేవమ్మ శివంగిలా మారింది. "ఒసేయ్, నీకేం మాయరోగం వచ్చిందే" అంటూ గులాబీమీదకి వచ్చింది. గులాబీ ఒక్క ఉదుటున ఆమెకి దొరక్కుండా తప్పించుకుని సంపంగిని పడుకోబెట్టిన గదిలోకి వెళ్లింది. అయితే అప్పటికే సమయం మించిపోయింది. వస్తాదులు బెడ్‌షీట్‌తో ఆ పిల్లని మంచానికి కట్టేయడంతో పారిపోడానికి అవకాశం లేక మంచం మీద బోర్లా పడుకుని మంచం అంచుకేసి నుదురు ధబీ ధబీ కొట్టుకుంటోంది సంపంగి.

గులాబీ వెళ్లి పట్టుకునేటప్పటికి రక్తం ధారగా కారుతోంది

ఈ హడావుడిలో వచ్చిన కస్టమర్ పారిపోయాడు.

అందరూ ఆ గదిలో చేరిపోయారు. ఈలోగా ఖారం మంటతో రంకెలేస్తున్న దేవమ్మ ఆ సంఘటనతో కొంచెం దెబ్బతిని పరిగెత్తుకొచ్చి బలవంతంగా ఆ పిల్లని పట్టుకుని ఆపడానికి ప్రయత్నించసాగింది. చూస్తుండగానే ఆ పిల్ల స్పృహ తప్పింది.

మేమందరం లోపలికి వెళ్లేసరికి ఆ చిన్నారి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

ఒక్కసారిగా అక్కడ నిశ్శబ్దం ఆవరించింది. దేవమ్మ మొహంలో కత్తివేటుకు నెత్తురుచుక్క లేనట్టుగా అయింది.

నేనూ, గులాబీ మొహాలు చూసుకున్నాం. ఇద్దరి కళ్లల్లో కన్నీళ్లు, గుండెల్లో బద్దలవుతోన్న అగ్నిపర్వతాలు దేవమ్మని నిలువునా చీల్చేయాలన్నంత కసి, నిస్సహాయంగా, ఎక్కడినుంచో వచ్చి ఇక్కడ బలైన ఆ చిన్నారిని చూస్తూ నిలబడిపోయాం.

"ఒరేయ్ పోలీ!" పెద్ద కేకపెట్టింది దేవమ్మ. "ఏందక్కా!" అంటూ వస్తాదులు వచ్చారు. "అది చచ్చింది. పోలీసు కేసు అవుతుంది. దీన్ని గప్‌చిప్‌గా ఎక్కడన్నా పారేసి రండి"

మిగతా విషయాలు నాకేం వినిపించలేదు, కనిపించలేదు. ఎర్రటిరక్తం నుదుటి




మీద నుంచి ధారగా కారుతోంటే చలనం లేకుండా పడిఉన్న సంపంగి పూవులాంటి సంపంగి కనిపిస్తోంది. నేనూ అచేతనంగా నిలబడిపోయాను.

తరువాత తెలిసింది దేవమ్మ ఖారం డబ్బా ఎందుకు తీసుకొచ్చిందో "బాబోయ్ అంత రాక్షసంగా ప్రవర్తిస్తారా గులాబీ? " అంటూ వణికిపోయాను.

"బ్లేడుతో కోసి ఖారం పెడతారు. ఎంత దారుణాలైనా చేస్తారు. వాళ్లకి కావలసింది డబ్బు. ఆ డబ్బుకోసం అమ్మాయిల రక్త మాంసాలతో వ్యాపారం చేస్తారు. వీళ్లు పోయిన జన్మలో రాక్షసులు. ఈ జన్మలో మనుషులుగా పుట్టారు. కానీ మనస్తత్వం మాత్రం రాక్షసులదే" అంది కసిగా.

"నీకెలా తెలుసు? " అడిగాను.

ఉన్నట్టుండి గులాబీ కళ్లలో నీళ్లు తిరిగాయి. "నేనూ సరిగా ఇదే వయసులో దీని పాలపడ్డాను. ఇంతకన్నా భయంకరమైన చిత్రహింసలు భరించాను"

"నీ పేరు చెప్పు గులాబీ"

విరక్తిగా నవ్వింది. "నాకు గుర్తులేదు. మా అమ్మానాన్న పెట్టిన పేరు నాకు అసలు గుర్తులేదు. ఈ రాక్షసి పెట్టిన గులాబీయే నా పేరు"

నాకారాత్రి నిద్రపట్టలేదు. మొదటిసారిగా స్త్రీ జీవితం మీదా, స్త్రీత్వం మీదా ఏవగింపు కలిగింది. అంటే నేను మానసికంగా ఎదిగానన్నమాట.

ఆ సంఘటన తరువాత దేవమ్మ మరీ కఠినంగా మారిపోయింది. ఆమెని చూస్తుంటే మనిషి రక్తం తాగే ఓ దెయ్యంలా అనిపించసాగింది.

ఎంత రాక్షసత్వాన్ని అయినా ప్రదర్శించి తన వ్యాపారం నిరాఘాటంగా సాగించుకోవడం ఆమె లక్ష్యం అని తెలిసింది. ఒక్కసారి ఆ మురికికూపంలోకి వచ్చిన అమ్మాయిలకు చావో, బతుకో అక్కడే కానీ వేరే మార్గంలేదన్న వాస్తవం కూడా తెలిసింది.

పాతికేళ్లు దాటిందాకా వృత్తి చేయిస్తుంది. ఆ తరువాత వాళ్లతో చాకిరీ చేయిస్తుంది. ఈమధ్య విటులు పాతికేళ్లు దాటినవాళ్లని ఇష్టపడడం లేదట. ఎప్పటికప్పుడు కొత్త అమ్మాయిలు కావాలంటున్నారట. ఎక్కువ మందితో గడిపే అమ్మాయిలకు ఎయిడ్స్ ఉంటుందని అనుమానంట. ఇవన్నీ దేవమ్మ పారిజాతంకి చెప్పి పారిజాతంనీ, గులాబీనీ "మీ కష్టమర్స్‌ని మీరే తెచ్చుకొండి" అంటూ రోజూ ఎనిమిది అవగానే బైటకి పంపిస్తోంది.

ఎవరన్నా కోరుకుంటే వాళ్లు ఎక్కడికన్నా వెళ్లి రావచ్చు. వాళ్లు సంపాదించుకున్న దాంట్లో సగం ఆవిడకి ఇవ్వాలి. ఇదీ దేవమ్మ రూలు. నాకు పాతికేళ్లు రాక ముందే నేనీ నరకంలోంచి తప్పించుకోవాలి. అదెలా? ఇరవై నాలుగు గంటలూ నాకిదే ఆలోచన.

నేను కోరుకున్నట్టు ఈ కూపంలోంచి పోవాలంటే నన్ను మెచ్చి నాకోసం సాహసం చేసి ఇక్కడనుంచి నన్ను తీసుకుని వెళ్లిపోయి నాకో కొత్త జీవితాన్ని ఇవ్వడానికి ఓ మహానుభావుడు రావాలి. మహానుభావుడు ఇక్కడికెందుకు వస్తాడు?

ఏదిఏమైనా నేను ఇక్కడినుంచి వీలైనంత త్వరగా వెళ్లిపోవాలి. అంతే. ఇలాంటి దారుణం మరోసారి నా కంటపడితే నేనేమైపోతానో నాకే తెలియదు. అందుకే ఆ రోజునుంచీ ఓ మహానుభావుడికోసం నా నిరీక్షణ మొదలైంది.

ఎప్పుడో చూసిన కొండమీది వెంకటేశ్వర స్వామి విగ్రహం గుర్తుకు తెచ్చుకుంటూ నాక్కావాల్సిన వ్యక్తిని నా దగ్గరకు పంపమని వేడుకుంటూనే ఉన్నాను. కానీ ఇంకా నా మొరవినలేదా దేవుడు.

మరికొంత కాలం గడిచింది. నా స్మృతి పథంలోంచి ఆ దారుణమైన సంఘటన చెదిరిపోలేదు. అప్పటినుంచీ నేను దేవమ్మని చాలా అసహ్యించుకోసాగాను.

అలాంటిదే మరో సంఘటన ఇంకో అమ్మాయి రూపంలో జరిగింది. ఆ అమ్మాయి పేరు రాజశ్రీ. ఆ అమ్మాయి సినిమాల్లో వేషాలకోసం, విజయవాడనుంచి మద్రాసు పారిపోతూ, ఖర్మగాలి ఈ రొంపిలో దిగింది.

వచ్చినరోజు రాజశ్రీ ఏడ్చిన ఏడుపు నాకు ఇంకా చెవుల్లో మోగుతూనే ఉంటుంది.

దేవమ్మని నానా శాపనార్థాలు పెట్టింది. "నన్ను మోసం చేసి ఇక్కడకు తెస్తావా? ఛండాలంముండా. నాశనం అయిపోతావే. మా రక్తపు కూడు తిని నువ్వెంతకాలం బతుకుతావే" అంటూ తిట్టింది. తనను కొట్టడానికి వెళ్లిన దేవమ్మని లాగిపెట్టి కొట్టింది. అయితే దేవమ్మ గుండెలు తీసిన బంటు. వస్తాదులతో ఆ అమ్మాయిని రేప్ చేయించింది.

అప్పటినుంచీ రాజశ్రీని అలాంటి దుర్మార్గుల దగ్గరకే కావాలని పంపిస్తుంది. అనుకోకుండా నాకూ, రాజశ్రీకి మంచి స్నేహం కలిసింది.

నేను ఈ నరకంలోకి ఎలా వచ్చానో నన్ను అడిగి తెలుసుకుని ఎంతో జాలిపడింది రాజశ్రీ. తనెలా వచ్చిందో చెప్పింది.

రాజశ్రీ వాళ్లది విజయవాడ. తల్లితండ్రులకి రాజశ్రీ కాక, ఇద్దరు మగపిల్లలున్నారు. ఈ అమ్మాయంటే వాళ్లింట్లో ఎంతో గారాబం. చిన్నప్పటినుంచీ రాజశ్రీ కళ్లు చూసినవాళ్లు నీ కళ్లు బాగుంటాయి. సినిమాల్లోకి వెళ్లచ్చుగా అంటుండేవాళ్లు. అలా అలా స్కూల్లో టీచర్లు, కాలేజీలో స్నేహితులు, బంధువులు అందరూ కూడా నీ కళ్లు బాగుంటాయి సినిమాల్లోకి వెళ్లు అని చెప్పడంతో ఈ అమ్మాయి మనసు సినిమా మీదకు పోయింది. ఎలాగైనా సినిమాల్లో చేరాలని కొత్త నటీనటులు కావాలి అని పేపర్లలో పడగానే, రకరకాల భంగిమల్లో ఫొటోలు తీయించుకుని వాళ్లకు పంపించడం చేస్తూ వచ్చింది. కొన్నాళ్లకు ఓ సినిమా కంపెనీవాళ్లు మద్రాస్ వచ్చి కలవవలసిందని ఈమెకి లెటర్ రాశారు. తల్లీ తండ్రీ ఆ ఉత్తరం చదివి, అలాంటి చెత్తపనులు చేసి జీవితం నాశనం చేసుకోవద్దని బాగా చదువుకోమని చెప్పారు. కానీ సినిమాల్లో చేరాలన్న కోరిక బలంగా ఆమె మనసులో నాటుకుపోడంతో ఎవరికీ చెప్పకుండా మద్రాస్ బయలుదేరింది. విషయం తెలిసిన రాజశ్రీవాళ్ల నాన్నగారు పోలీసు కంప్లైంట్ ఇచ్చారు. ఆ ఫిర్యాదు మేరకు మద్రాస్ చేరిన ఆ అమ్మాయిని అక్కడి పోలీసులు పట్టుకున్నారు. తిరిగి విజయవాడ తీసుకొస్తుంటే వాళ్లనుంచి తప్పించుకుని తిరుపతి స్టేషనులో దాక్కున్న ఆ అమ్మాయిని మోసం చేసి ఈ రొంపిలోకి తీసుకొచ్చింది టక్కులమారి దేవమ్మ. రాజశ్రీ ఇంటర్మీడియట్ వరకూ చదువుకుంది. తెల్లగా ఉంటుంది. పెద్ద కళ్లు.

"నువ్వలా రాకుండా ఉంటే ఎంత బాగుండేది" అన్నాను.

"ఖర్మలో ఇలాంటి బతుకు బతకాలని ఉంటే ఎవరు మాత్రం ఆపగలరు? " అంది విరక్తిగా.

"ఖర్మా... అయితే నాకూ అదే ఖర్మ రాసి పెట్టి ఉందా? దేవుడేగా రాసేది. ఇలా రాసిపెట్టాడా. అలా అయితే నేను దేవుడిని ఏం కోరుకున్నా జరగదన్నమాట"

ఈ మాట తల్చుకోగానే నాకు దుఃఖం ఆగలేదు. వెక్కివెక్కి ఏడవసాగాను.

"ఎందుకేడుస్తావు" అడిగింది రాజశ్రీ.

"నాకిక్కడ ఉండాలని లేదు. వెళ్లిపోవాలని ఉంది" వెక్కుతూ అన్నాను.

నిట్టూర్చింది. "నాకూ లేదు కానీ ఎలా? ఎలా వెళ్లగలం"

"మనల్ని ఎవరన్నా పెళ్లి చేసుకోవచ్చుగా"

పగలబడి నవ్వింది. నవ్వీనవ్వీ కళ్లల్లో నీళ్లు తిరుగుతోంటే అంది "ఈ జన్మకి అలాంటి ఆశలు పెట్టుకోకు. మనకి పెళ్లేంటి? ఈ రోజుల్లో అన్నీ బాగుండి,




చదువూ, డబ్బూ, మంచి కుటుంబం, చరిత్ర అన్నీ ఉన్న అమ్మాయిలకే పెళ్లి కావడం కష్టంగా ఉంది. నీకూ నాకూ పెళ్లి ఎలా అవుతుంది? "

ఆ మాటలు నా మనసుని మరింతగా గాయపరిచాయి. ఎప్పటికైనా, ఎలాగైనా ఇక్కడనుంచి తప్పించుకుని పెళ్లి చేసుకుని గౌరవంగా బతకాలనుకుంటున్న నా ఆశల మీద మంచుపెళ్లలు పడినట్టుగా అనిపించింది రాజశ్రీ మాటలు.

"అయితే ఇక్కడినుంచి మనకి విముక్తి లేదా? " అడిగాను.

రాజశ్రీ ఆలోచించింది. "చెప్తాను. నాకేదన్నా తోస్తే నీకు చెప్తాను. ఇక్కడినుంచి పారిపోవాలి అంతేనా? పారిపోయి ఎక్కడికెడతావు? అది కూడా ఆలోచించుకో. ఈ ప్రపంచంలో నూటికి యాభైమంది దేవమ్మలాంటి వాళ్లే ఉన్నారు. ఇక్కడ కాకపోతే ఇంకో దగ్గర మనకి ఇదే వృత్తి మిగిలింది. మనకెవరూ ఉద్యోగాలివ్వరు. పెళ్లిళ్లు చేసుకోరు. కూలీ కూడా ఇవ్వరు. ఆఖరికి బిచ్చం కూడా వేయరు. బిచ్చమడిగినా 'ఏవే ఒంటి మదం తగ్గిందా? ముష్టెత్తుకుంటున్నావు' అని అడుగుతారు. పోనీ వ్యభిచారం నేరం, వ్యభిచారులను ఆ వృత్తి మాన్పించాలి అని నినాదాలిచ్చే గవర్నమెంటు కూడా మనకి ఏవిధమైన సాయం చేయదు. ఏదన్నా వృత్తి విద్య నేర్చుకొని ఆ వృత్తి చేసుకుందామంటే 'మీకేం వృత్తి తెలుసు, అది తప్ప' అంటూ వెకిలిగా నవ్వే నాయకులు వీళ్లంతా"



"నీకీ విషయాలన్నీ ఎలా తెలుసు రాజశ్రీ? " ఆశ్చర్యంగా అడిగాను

నవ్వింది. "పేపర్లలో చదివేదాన్ని. మనల్ని వ్యభిచారిణులు, వేశ్యలు అనకూడదు తెలుసా! సెక్స్‌వర్కర్లు అని మనకో పోష్ పేరుంది. ఈ వృత్తి చేసుకోడానికి కొన్ని ఇతర దేశాల్లో లైసెన్సులిస్తారట. మనక్కూడా లైసెన్సులివ్వాలి అని, వేశ్యలని సెక్స్‌వర్కర్లు అనాలని ఈమధ్య కొన్ని మహిళా సంఘాలవాళ్లు ధర్నాలు, ఉద్యమాలు చేశారు. అవన్నీ ఉద్యమాల వరకే అనుకో. ఏవీ జరగవు. కాబట్టి పిచ్చి బంతీ అలాంటి ఆలోచనలు పెట్టుకోకు. ఒకవేళ అంతగా తప్పదు వెళ్లాలి అనుకుంటే బైటకి వెళ్లాక ఏం చేయాలో బాగా ఆలోచించి చెప్పు. ఇంక లోపలికి వెళ్లు. మొగుళ్లు వచ్చే టైం అయింది" అంటూ లేచి తన గదిలోకి వెళ్లిపోయింది.

రాజశ్రీ మాటలు నా చెవుల్లో గింగుర్లెత్తుతోంటే ఆ రోజు నుంచీ వారం రోజులదాకా మనసు మనసులో లేదు. చాలా యాంత్రికంగా ఒళ్లప్పగించాను వచ్చిన వాళ్లకి.

★ ★ ★

ఓ రోజు స్నానం చేసి భోజనం చేసి నా గదిలోకి వెళ్లి లోపలి నుంచి తలుపు గడియవేసుకున్నాను. నా నల్లసంచీ లోంచి పాపాయమ్మ ఇచ్చిన తాళిబొట్లు తీశాను. వాటిని చూడగానే పాపాయమ్మ, ఆవిడ మంచితనం గుర్తొచ్చింది. ఆవిడ దగ్గరకు

వెళ్లడానికి బయలుదేరి దీని పాలపడ్డాను. రాజశ్రీ అన్నట్టు నా ఖర్మ అలా కాలిందా? లేకపోతే నేనెక్కిన బస్సు గుంటూరులో ఆగి పోకుండా తిరుపతిదాకా ఎందుకు పోవాలి? ఆ బస్సులో ఈ రాక్షసి ఎందు కుండాలి? ఆ రాక్షసి అడగగానే నేను పిచ్చి దానిలా తాతగారి గురించి, అమ్మానాన్నల గురించి అన్ని విషయాలూ ఎందుకు చెప్పాలి? అన్నీ ఖర్మేనా? అలాంటప్పుడు నా ఖర్మ ఇలా రాసిన దేవుడిని నేనేం కోరితే మాత్రం తీరుస్తాడు.

"పాపాయమ్మా నువ్వన్నా రావా! ఎప్పు డన్నా తిరుపతి రావచ్చుగా. నన్ను చూడ చ్చుగా. కాపాడచ్చుగా. పాపాయమ్మా రావూ!"

"అమ్మా" అమ్మ చీర తీసుకుని మొహం మీద కప్పుకున్నాను. "అమ్మా! చూడమ్మా నా బతుకెలా అయిందో! ఆ ప్లాట్‌ఫాం మీద రైలు కోసం పరిగెత్తుతూ నేనన్నా ఆ రైలుకిందపడి చచ్చిపోతే ఎంత బాగుండేది! అన్యాయంగా నిన్ను బలితీసుకున్నాను. నేను వంటరిదాన్ని అయాను. ఈ రాక్షసి స్వార్థానికి, డబ్బు దాహానికీ బలైనాను. అమ్మా నేను డాక్టర్ని కాలేకపోయానమ్మా! తాతగారిని కలుసుకుని ఎలాగైనా చదువుకో వాలని ఎంతో ఆశపడ్డాను. నా ఆశలన్నీ ఇలా మసిబారిపోయాయమ్మా. అమ్మా నువ్వన్నా ఒక్కసారి రావూ. చచ్చిపోయిన వాళ్లు దేవుళ్లవుతారని నువ్వే ఒకసారి చెప్పావు. మరి నువ్వే ఇప్పుడు దేవుడివై రావచ్చుగా. నాన్నా నువ్వన్నా రా నాన్నా! నన్నిక్కడినుంచి కాపాడి తీసికెళ్లు నాన్నా! తేజా నువ్వన్నా రారా! అక్క బతుకు ఎట్లా అయిందో చూడరా! తేజా, తాతయ్యా, మామ్మా ఎవరన్నారారూ! నన్ను ఇక్కడి నుంచి తీసికెళ్లరూ రారూ" అంతకంతకూ నా ఏడుపు ఉధృతం కాసాగింది. బైట నుంచి దబదబ తలుపు చప్పుడైంది.





"ఒసేయ్ తలుపు తీయవే. నిన్నే" అంటూ అరుస్తోంది దేవమ్మ.

నెమ్మదిగా అమ్మ చీర, తాళిబొట్టు సంచీలో పెట్టి సంచీ మంచం కిందకి తోసే శాను. కళ్లు తుడుచుకుని వెళ్లి తలుపుతీ శాను.

"ఎప్పుడు చూసినా ఏడుపే. దరిద్రం మొహం నువ్వునూ. లేచి తయారవు. పెద్ద ఆఫీసర్ వచ్చాడు. కారులో వచ్చాడు. బోలెడు డబ్బిస్తాడు. తయారవు. ఈ అదృష్టం నీకే పడుతోంది. లే వాడికి చిన్న పిల్ల కావాలిట. అందరిలోకి నువ్వే చిన్నదా నివిగా లే" అంది.

"ఏంకాదు. రాజశ్రీ కూడా చిన్నదే" అన్నాను రోషంగా.

"దానిమొహం దానికింత మంచి కష్టమర్ నిస్తానా? పెడసరం ముండ. దానికి ఏ అడ్డగాడిదనో ఇస్తాను. లే లేచి తయారవు. మళ్లీ రాత్రికి వస్తానని చెప్పి వెళ్లాడు" అంటూ హడావుడిగా వెళ్లిపోయింది.

ఆఫీసర్... హు... ఎవరికి గొప్ప. దొంగ వెధవ. పేరుకి పెద్ద ఆఫీసర్. బుద్ధి మాత్రం ఇంత నీచం. ఛీ... అసహ్యించు కుంటూనే లేచి తయారయ్యాను.

దేవమ్మ కొత్తచీర పంపించింది శకుంతల చేత. కట్టుకోవాలనిపించలేదు. ఖరీదైన కస్ట మర్లు వస్తే పూలు, సెంటు, కొత్తచీర ఇస్తుంది. పండగలకు, ఫంక్షన్‌లకూ కట్టుకో వాల్సిన కొత్తచీరలు ఇలాంటి పనులకోసం కట్టుకోవాలంటే నాకు నరకప్రాయంగా అని పిస్తుంది. కట్టుకోనంటే పెద్ద రభస చేస్తుంది. తనమాట కాదంటే చాలా గొడవ చేస్తుంది దేవమ్మ. తను చెప్పిన పని చేయ కుండా ఇంకా మొండితనం చేస్తే చెంపల మీద ఎడాపెడా వాయించి ఆ పని చేయి స్తుంది. ఆవిడ చెప్పినట్టు చేయడం అల వాటు చేసుకుని చాలాకాలమైంది. మౌనంగా ఆ చీర కట్టుకున్నాను. వంటి మీద ముళ్ల కంచె పెట్టుకున్నట్టుంది. పల్చగా ఉందా చీర. తయారై ఓ శిలలా

కూర్చున్నాను మంచంమీద.

రాత్రి పదింటికి ఆయన్ని ఎంతో మర్యాదగా, ప్రేమగా ఆహ్వానించింది. సొంత అల్లుడిని తీసుకొచ్చినట్టుగా నేను కూర్చున్న గదిలోకి తీసుకొచ్చి "ఇదే మీ పిల్ల. మీకే దన్నా ఇబ్బందిగా ఉంటే చెప్పండి బాబు గారూ" అంది.

"అలాగే" అన్నాడాయన నావైపు చూస్తూ.

నేను కళ్లు వాల్చుకుని మౌనంగా లేచి నిలబడ్డాను.

దేవమ్మ నా పక్కకు వచ్చి మోచేత్తో పొడుస్తూ "ఏంటది ముంగిలాగా. ఆఫీసరు! నవ్వుతూ మాట్లాడు" అంది.

నేనేం మాట్లాడలేదు.

"నేను చూసుకుంటాలే నువ్వెళ్లు" అన్నాడాయన.

ఆయన స్వరం వినగానే అప్రయత్నంగా ఒక్కసారి తలెత్తి చూశాను.

సూటూ, బూటూ వేసుకున్నాడు. చాలా పొడుగ్గా, పొడుక్కి తగ్గ లావుతో చామనఛాయగా ఉన్నాడు. చాలా అందంగా ఉన్నాడు.

ఎందుకో తెలియదుగానీ ఒక్కసారి శరీరం ఆపాదమస్తకం కంపించినట్టైంది.

దేవమ్మ "అట్టాగే బాబూ" అంటూ బైటకి వెళ్లిపోయింది. ఆయన ఆమె వెనకాలే వెళ్లి తలుపేసి వచ్చాడు.

కోటు విప్పి పందిరి మంచం ఊచకి తగిలించాడు. బూట్లు విప్పి ఓ మూలకి తోసాడు. మంచం మీద కాలుమీద కాలేసుకుని కూర్చుని చేతులు రెండూ వెనక్కి ఆనించి నావైపు చూసి "కూర్చో" అన్నాడు.

ఆయన చూపులతో చూపులు కలపగానే నా చూపులు కిందికి వాలిపోయాయి. ఆయనలా చూస్తోంటే ఏదోలా ఉంది. సన్నగా కాళ్లల్లో వణుకు మొదలైంది. నిలబడలేకపోతున్నాను. అలాగని కూర్చోలేకపోతున్నాను.

"కూర్చో... అన్నట్టు నీపేరేంటి? "

ఉలిక్కిపడ్డాను నా పేరా? నన్నెవరూ పేరడగలేదు. బహుశా సానిదానికి పేరేంటి? సానిది సానిదే అనుకునేవాళ్లో ఏమో! ఏవే అని ఇంకా చాలా అసభ్యకరమైన పదజాలం ఉపయోగిస్తుంటారు. అది కూడా ఆ కాసేపే ఆ తరవాత తలతిప్పి అంతసేపూ ఎవరితో పడుకున్నారో తెలుసుకోవాలన్న ఉత్సాహం కూడా లేకుండా మొహం కూడా చూడకుండా వెళ్లిపోతారు.

అలాంటిది ఈ పెద్దమనిషి నన్ను పేరడగడం ఆశ్చర్యంగా అనిపించింది. నేను ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోడంతో ఆయన స్వరం మరోసారి వినిపించింది "నీపేరేంటి? "

ఆ స్వరం గంభీరంగా ఉంది. మృదువుగా ఉంది. ఎంతో హాయిగా ఉంది.

నా పేరు, నా పేరు, నా పేరు... నేనే మర్చిపోయాను. అమ్మానాన్న పెట్టిన పేరు వాళ్లతో పాటే మరుగైపోయింది. ఇప్పుడు నాకు రకరకాల పేర్లున్నాయి. ఒసే, ఏవే, ఓ ఏడుపుమొహందానా, పెద్దజడదానా అని కొందరు, బంతీ, ఓ పూబంతీ అంటూ మరి కొందరు పిలుస్తారు.

"చెప్పవా? " అడిగాడాయన మళ్లీ.

"దేవమ్మ చెప్పలేదా? " అడిగాను.

"లేదు, మంచి అమ్మాయి కావాలి అంటే నీ దగ్గరకు తీసుకొచ్చింది. నీపేరేంటి అని నేనడగలేదు. ఇదేం పెళ్లిచూపులు కాదుగా పేరు, ఇంటిపేరు, గోత్రం తెలుసుకోడానికి" నవ్వాడు. ఆ నవ్వు ఎంతో అందంగా సమ్మోహనంగా ఉంది. కానీ ఆయనన్న మాట నా గుండెల్లో గునపం దిగినట్టుగా దిగింది. గుండెల్లోంచి ఉప్పెనలా తన్నుకొచ్చింది బాధ. అలాంటప్పుడు ఎందుకడిగారు? అనాలనుకున్నాను. కానీ అడగలేదు.

అప్పటిదాకా నన్నావరించిన ఏదో మత్తు, ఆయన్ని చూడగానే ఆయన స్వరం విన

గానే నాలో మొదలైన కలవరం, తీయని భయం ఉఫ్ అని ఊదినట్టుగా పోయింది.

లైటు ఆర్పేసి మంచం దగ్గరకు నడిచాను.

"అప్పుడే లైటార్పావేం? " అడిగాడు.

"మీరు వచ్చిన పని చేసుకుని వెడితే ఇంకొకళ్లకి అవకాశం ఉంటుంది. కబుర్లతో కాలక్షేపం చేస్తే దేవమ్మ ఊరుకోదు"

"అంటే రోజుకి ఎంతమంది వస్తారు? " అడిగాడు.

"దయచేసి అనవసరమైన విషయాలు మాట్లాడద్దు. కానివ్వండి" అన్నాను. ఆయన చేతిమీద చేయివేసి.

ఆయన చటుక్కున చేయి వెనక్కి తీసుకుని "నీతో కాస్సేపు కబుర్లు చెప్పాలని ఉంది. అంతగా దేవమ్మ గొడవచేస్తే మరో వేయి ఇస్తాను. ఈ రాత్రి మొత్తం నేనే ఎంగేజ్ చేస్తాను"

అంటే ఒకరాత్రికి, ఒక మనిషికి వెల వెయ్యి రూపాయలన్నమాట. ముగ్గురు, లేదా నలుగురు తప్పరు ప్రతిరాత్రీ. అంటే దేవమ్మ ఒక్కో అమ్మాయి మీద ప్రతిరోజూ ఎంత సంపాదిస్తోందో. నాకు లెక్కలు రావు. ఎప్పుడో ఎక్కడో గత జన్మ స్మృతిలా అస్పష్టంగా గుర్తుంది, సంచీలో పుస్తకాలు పెట్టుకుని యూనిఫాం వేసుకుని స్కూలుకి వెళ్లడం. అప్పుడు నేర్చుకున్నవేవీ నాకిప్పుడు గుర్తులేవు. దేవమ్మ మా అందరిమీదా సంపాదించే డబ్బు లెక్కవేయాలని ఉంది. వెంటనే మేము ఇక్కడ ఎంతమందిమి ఉన్నాం! మనసులోనే లెక్కలేసుకుంటున్నాను. చేమంతి, ఛమేలీ, గులాబీ, పారిజాతం, వెన్నెల...

"చెప్పు నీ పేరేంటి? " ఆయన స్వరం నా ఆలోచనలను చెరిపేసింది.

నెమ్మదిగా గొణిగినట్టుగా చెప్పాను. "నా పేరు బంతి. అందరూ నన్ను బంతి అనే పిలుస్తారు"

"బంతా అంటే పూవు పేరా? లేక బంతా? ఆడుకునే బంతి"

"పూవు పేరు. ఇక్కడ అందరి పేర్లూ పూవుల పేర్లే. బంతి, చామంతి, గులాబీ, ఛమేలీ, పారిజాతం, జాజిమల్లె... ఇలా మా అందరికీ ఇవే పేర్లు"

"నీ పేరు బంతి అంటే బాగాలేదు. ఇంకేదన్నా పెట్టనా? "

"ఒక్క రాత్రికి నా పేరు మార్చేస్తారా? మార్చండి" అన్నాను నిర్లిప్తంగా.

"ఆయన ఆలోచిస్తున్నట్టుగా కొన్ని నిమిషాలు మౌనంగా ఉండి అన్నాడు. "నీ పేరు కావ్య. కావ్య అని పెట్టనా? "

"పెట్టడానికేముంది. మీరున్నంత సేపూ కావ్యా అనే పిలవండి"

"నిన్ను చూస్తుంటే, నీతో మాట్లాడుతుంటే నువ్వెవరో మంచి కుటుంబంలోంచి వచ్చిన దానిలా అనిపిస్తున్నావు. ఈ పని ఎందుకు చేస్తున్నావు? డబ్బు కోసమా? "

"చివ్వున చూశాను. "మీరు నాకిచ్చారా డబ్బు? "

ఆయన కలవరపడ్డారు. "కాదనుకో అంటే మరి ఎందుకీపని చేస్తున్నావు? "

"నేను... నేను చేయడంలేదు. నాచేత ఆ దేవమ్మ చేయిస్తోంది. మీరంతా చేయిస్తున్నారు"

"ఈ దేవమ్మకీ, నీకూ ఎలా పరిచయం? "

"పరిచయస్తురాలిగా నేనిక్కడకు రాలేదు. శాపగ్రస్తురాలిగా వచ్చాను"

"అంటే నీకెవరూ లేరా? "

నేను ఆయన పక్కనుంచి లేచాను. ఆయన నా చేయిపట్టుకుని ఆపాడు.

అప్పుడు కలిగిందో స్పందన.

అప్పుడు తెలిసింది పులకింత అంటే ఏమిటో.

అప్పుడు తెలిసింది మగవాళ్ల స్పర్శ కలిగించే అనుభూతికి అర్థం.

అప్పుడు తెలిసింది. నాకూ యవ్వనం ఉందని.

కాళ్లకు బంధంవేసి లాగినట్టు ముందుకు




వేసిన అడుగు వెనక్కి తీసుకుని శిలలా నిల బడిపోయాను.

నా చేయి అలా పట్టుకునే ఆయన కూడా లేచి నిలబడ్డాడు. కుడిచేత్తో నా చుబుకం పట్టుకుని మొహం పైకెత్తి, కళ్లల్లోకి చూస్తూ అన్నాడు. "నువ్వు చక్కగా ఉన్నావు. ఈ వృత్తిలోకి రాకుండా ఉండిఉంటే నిన్నే అబ్బాయి అయినా, కళ్లకద్దుకుని పెళ్లిచేసుకు నేవాడు. పువ్వుల్లో పెట్టుకుని చూసుకునే వాడు. అనవసరంగా జీవితం పాడుచేసుకు న్నావు. నిన్ను చూస్తోంటే నాకు జాలే స్తోంది.

ఆయన మాటలకి నా కళ్లల్లోంచి జల జలా రాలాయి కన్నీళ్లు.

కన్నీళ్లు తుడుచుకుని అన్నాను. "జాలిపడి ఏం చేస్తారు? నన్నిక్కడనుంచి తీసికె ళ్తారా? నాకెక్కడన్నా ఆశ్రయం కల్పి స్తారా? నాకిష్టంలేదు ఈ జీవితం"

బైట తలుపు చప్పుడైంది. "బాబూగారూ!" దేవమ్మ స్వరం వినిపించింది. ఆయన తల తిప్పి తలుపువైపు చూశాడు. దేవమ్మ స్వరం మళ్ళీ వినిపించింది "బంతీ!"

నేను కళ్లు తుడుచుకుని తలుపువైపు కది లాను. ఆయన తన చేయి అడ్డంపెట్టి నన్ను ఆగమని చెప్పి తను వెళ్ళి తలుపు కొద్దిగా తీసి, "ఏం కావాలి? " అనడిగాడు. ఆయన స్వరంలో అధికారం ఉంది. కాఠిన్యం ఉంది. నాతో మాట్లాడుతున్న ప్పుడు వినిపించిన మాధుర్యం, మార్దవం లేవు.

దేవమ్మ గొణిగినట్టుగా అంది. "ఇంకో కస్టమర్ ఎదురుచూస్తున్నాడు"

"నేను బైటికి వచ్చాక ఇంకో వెయ్యి ఇస్తాను. ఆయన్ని వెళ్ళిపొమ్మను" అంటూ ఠపీమని తలుపు వేసేశాడు.

నాకు చిత్రంగా అనిపించింది. కొంచెం సంతోషంగా కూడా అనిపించింది. "హమ్మయ్య... ఈయన ఈ రాత్రి ఇక్కడే ఉంటే నాకు ఛండాలపు పని చేసే బాధ ఒకరాత్రి తప్పినా తప్పినట్టే..."

ఆయన నా దగ్గరకు వచ్చాడు. చేయి పట్టుకుని మంచం దగ్గరకు తీసికెళ్ళి నన్ను భుజం పట్టి మంచంమీద కూర్చోపెట్టి, తానూ కూర్చున్నాడు.

"కావ్యా... నువ్వు నాకు నచ్చావు. నీకు ఇక్కడినుంచి విముక్తి. అంతేనా? ప్రయత్ని స్తాను. ఎలా నిన్ను తీసికెళ్లాలో నాకూ తెలి యదు. బహుశా దేవమ్మని డైరెక్టుగా అడి గితే బాగా డబ్బు డిమాండ్ చేయచ్చు. అలా కాకుండా నేను మరోవిధంగా నిన్ను పంపిస్తాను. సరేనా? ఈలోగా నేను వారా నికి ఒకసారి వస్తాను నీ దగ్గరకు. ఆరోజు నాతో తప్ప ఈ పనికి ఇంకెవరితో ఒప్పుకో కూడదు. నీకంగీకారమేనా? "

నేను మాట్లాడకుండా కళ్లప్పగించి చూశా నాయనవైపు.

"చెప్పు... అంగీకారమేనా? "

నా పెదాలు కదిలాయి. "మీరడగాల్సింది నా అంగీకారం కాదు. దేవమ్మ అంగీకారం. నా శరీరంమీద సర్వాధికారాలు దేవమ్మ సంపాదించుకుని చాలాకాలం అవుతోంది"

"గాడ్" ఆయన నిట్టూర్చాడు. "పిటీ... ఐ పిటీ యూ" అంటూ కొంచెంసేపు ఏదో ఆలోచిస్తూ ఉండిపోయి తరవాత అన్నాడు. "ఒకే దేవమ్మతో నేను మాట్లాడతాను. నేన డిగానని బాధపడకుండా ఒక్కమాట చెప్పు. ఒక్కరాత్రికి ఎంతమంది వస్తారు? "

నేను తలవంచుకున్నాను.

"చెప్పు... దాన్ని బట్టి నేనో నిర్ణయానికి రావాల్సివస్తుంది"

"నలుగురు... లేదా ముగ్గురు"

"ఐసీ..." ఆయన కాస్సేపు పెదాలు కొరు క్కుంటూ ఉండిపోయాడు.

"ఓ.కే...నేను మాట్లాడతాను. ఈరోజు నుంచీ ప్రతి శనివారం నువ్వు నాతో తప్ప ఈ పనికి ఒప్పుకోవద్దు. వీలైతే రోజూ కూడా ఒప్పుకోకు. చిన్నపిల్లవు. ఆరోగ్యం పాడవుతుంది. నీకు తెలుసా! ఈ పనిచేస్తే

ఎయిడ్స్ అనే జబ్బు వస్తుంది. దానికి చికిత్స కూడా లేదు. ఆ జబ్బు వస్తే చని పోతారు"

నేను విరక్తిగా నవ్వాను. "నాకీపాటికి వచ్చి ఉండదా? త్వరలో చచ్చిపోతానేమో"

ఆయన చటుక్కున నా చేయి వదిలే శాడు.

నాకు ఫకాల్న నవ్వొచ్చింది. నాకా జబ్బు ఉందనిపించిందేమో ఎంత భయం! చేయి చటుక్కున వదిలేశాడు. నవ్వు ఆపుకుని తల వంచుకుని కూర్చున్నాను.

ఆయన అలాగే కూర్చుని "రేపు నిన్ను డాక్టర్ దగ్గరకు తీసికెళ్తాను. నాకు నువ్వు నచ్చావు. పదిమందితో తిరిగే తిరుగుబో తుసు కాను నేను. అందుకే నాకు మంచి అమ్మాయి కావాలని అడిగాను. నిన్ను చూపించింది దేవమ్మ. నువ్వు నాకు నచ్చావు. మిగతావాళ్లలా వెకిలిగా లేవు. వికారంగా అలంకరించుకోలేదు. ఎంతో సంప్రదాయకంగా ఉన్నావు. ముఖ్యంగా నీ జడ నన్ను బాగా ఆకర్షించింది. ఐ లైక్ యూ. కాకపోతే, ఇవాళ మనం ఇలా కబుర్లు చెప్పుకుంటూ కూర్చుందాం. రేపు డాక్టర్ దగ్గరకు తీసికెళ్తాను. ఆ తరవాత"

"ఆ తరవాత... ఆ తరవాత" ఆయన మాట పూర్తిచేయలేదు. కానీ నా గుండెల్లో ఎక్కడో, ఏదో పులకింత. ఆ తరవాత ఏం చేస్తాడు? ఈయన నన్ను పెళ్లి చేసుకుంటే బాగుండు. ఇప్పటికిప్పుడు చేసుకుంటే నా దగ్గర తాళిబొట్టు సిద్ధంగా ఉంది. అది కట్టించుకుంటాను. నన్ను పెళ్లి చేసుకుంటే బాగుండు.

ఆయన ఏదో మాట్లాడుతున్నాడు. ఆరోగ్యం ఎలా కాపాడుకోవాలో ఉపన్యా సంలా చెప్తున్నాడు. నేనేం వినడంలేదు. ఆ తరవాత అని వదిలేసిన ఆ వాక్యంలో చివ రిభాగం ఏమై ఉంటుందా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. అలా నెమ్మదిగా కూర్చునే నిద్రలోకి జారిపోయాను.

నాకు మెలకువ వచ్చి చూసేటప్పటికి బాగా తెల్లవారిపోయింది. చటుక్కున లేచాను. మంచం మీద అడ్డంగా పడుకుని నిద్రపోయాను. ఒక్కసారిగా రాత్రి జరిగిం దంతా గుర్తొచ్చింది. ఆయన ఆఫీసర్‌గారు రావడం, ఆయన మాటలు, ఆయన నవ్వు అన్నీ వరసగా గుర్తొచ్చాయి. ప్రతిరోజూ తెల్లవారేటప్పటికి స్నానం చేయడానికి వెళ్ళి పోయే నేను ఈరోజు ఆ అవసరం కలగ నందుకు చాలా సంతోషించాను. అంటే రాత్రి ఆయన నన్నేం చేయలేదు. హమ్మయ్య ఎంతకాలమైంది నన్ను ఏ మగ వాడూ ముట్టుకోకుండా గడిపి హమ్మయ్య. ఈయన రోజూ వస్తే బాగుండు.

వారానికి ఒకరోజు వస్తానన్నాడు. దేవమ్మ ఊరుకుంటుందా? ఇప్పటికే రాత్రంతా ఆయనొక్కడే ఉండిపోయినం దుకు ఏం గంతులేస్తోందో? భయం, భయంగా లేచి కూర్చున్నాను. బిలబిలలా డుతూ దేవమ్మతోపాటు నలుగురు అమ్మా యిలు లోపలికి వచ్చేశారు.

"ఓసి నంగనాచీ... ఎంత నెరజాణవే. ఒక్క రాత్రితో ఆఫీసర్‌ని బుట్టలో వేసుకు న్నావు. ఏం చేశావే? ఏం మాయచేశావు? వాడు నిన్ను గుత్తకు కొనేశాడు. నీ అదృష్టం పండిందిలే. ఈ కొంపలో ఏ ఆడదానికీ పట్టని అదృష్టం నీకు పట్టింది. ప్రతి శని వారం వస్తాట్ట. ఆరోజు ఇంకెవర్నీ ఎంగేజ్ చేయద్దట. చూద్దాం ఈ మురిపెం ఎంతకా లమో! నిన్ను ఉంచుకునేవాడిలాగా మాట్లా డాడు. చూద్దాం ఎంతకాలం నిన్నుంచుకుం టాడో! మహా అంటే ఆరు నెలలు. సంవ త్సరం అంతకన్నా ఏ మగాడు ఉంచుకుం టాడు. మొత్తానికి గార్లబుట్టలో పడ్డావు. లే, లేచి తయారవు. నిన్ను డాక్టర్ దగ్గరకు తీసికెళ్లి చూపిస్తాట్ట" అంటూ నా బుగ్గలు పొడుస్తూ భుజాలు గిచ్చుతూ ఏదేదో మాట్లాడసాగింది దేవమ్మ.

ఉంచుకోడం ఏంటి? నాకేం అర్థం





కాలేదు. అయోమయంగా చూడసాగాను.

అందరూ తలోమాట అంటున్నారు. "ఓ సంవత్సరం నిన్నుంచుకున్నాక నన్నూ ఓ సంవత్సరం ఉంచుకోమని రికమెండ్ చేయి" అంటోంది ఓ అమ్మాయి.

వాళ్ల మాటలేవీ నాకు అర్థం కావడం లేదు. ఆయన నన్ను ప్రేమిస్తున్నారని వాళ్లందరికీ అసూయ కాబోలనిపించింది. వాళ్లందరినీ తప్పించుకొని వెళ్ళిపోవాలని ఉంది నాకు. వాళ్ల మాటలు భరించలేని విగా, రోతగా అనిపిస్తున్నాయి. నా గది ఎదురుగా వరండాలో కనిపించింది రాజశ్రీ. ఆమె కళ్లల్లో ఏదో బాధ కనిపిస్తోంది. నావైపు జాలిగా చూస్తోంది. నేను వాళ్లని తప్పించుకుని ఎలాగో బైటపడి బాత్‌రూం వైపు వెళ్లాను.

గలగల నవ్వుతూ ఏవేవో మాట్లాడుకుంటున్నారు.

మధ్యాహ్నం నన్ను దేవమ్మ గవర్నమెంటు హాస్పిటల్‌కి తీసుకువెళ్ళింది. అక్కడ నాకేవో పరీక్షలు చేశారు. మర్నాడు రిపోర్టు ఇస్తామన్నారు.

ఆ రాత్రి నా అదృష్టం నమ్మలేని అదృష్టం. నా దగ్గరకు ఎవరూ రాలేదు ఆ రాత్రి.

ఒక్కదాన్నే పడుకున్నాను. అయితే నాకు నిద్రపట్టలేదు. రాత్రి వచ్చిన ఆఫీసర్‌గారు, ఆయన అందమైన విగ్రహం, ఆ సమ్మోహనమైన నవ్వు, మృదుమధురంగా ఉన్న స్వరం పదేపదే గుర్తు రాసాగాయి. ఇవాళ కూడా ఆయన రాకూడదా అనిపించింది. ఎంత బాగున్నాడు ఆయన! ఎంత దర్జాగా, గొప్పగా ఉన్నాడు. ఆయన మాటలెంత బాగున్నాయి. మళ్ళీ మళ్ళీ వినాలనిపించింది. ఆయన కేవలం కాస్సేపు నా కుడి చేయి పట్టుకున్నాడు. ఒక్కసారి నా చుబుకం ఎత్తి నా కళ్లల్లోకి చూశాడు. అప్రయత్నంగా ఆయన చేయి తగిలిన ప్రదేశం తడుముకున్నాను. కథలో చదివినట్టు ఆయన ముట్టుకుంటే ఒళ్లంతా విద్యుత్తు పాకినట్టు అయింది. ఇంకాస్సేపు ఆయన చేయి అలాగే ఉంటే బాగుండు అనిపించింది. చేయి పట్టుకుంటేనే అంతగా పరవశించిపోయానే ఇంక ఆయన... ఒక్కసారిగా నా ముహంనిండా వెచ్చటి రక్తం చిమ్మినట్టు అయింది. చెవుల్లోంచి వేడి ఆవిర్లు గాసాగాయి. అబ్బా... గుండె తీయటి బాధతో మూలిగింది. ఆయన పేరేంటో. వారానికి వస్తారుట. అంటే ఈరోజు ఆయన ఇచ్చే సుఖం, మిగతా ఆరురోజులూ తల్చుకుంటూ, ఏడోరోజు కోసం ఎదురు చూస్తూ ఉండాలన్నమాట. కష్టమేమో... ఆయన్ని రోజూ చూడాలనిపిస్తే అవును అనిపిస్తే ఏమో ఆయన నన్ను పెళ్లి చేసుకుంటారు. అలా అనుకున్నాక నాకెంతో నిశ్చింతగా అనిపించింది.

ఏవిటీ ఆలోచనలు ఇంతకాలంనుంచి యంత్రంలా ఉన్న నా మనసు ఒక్క రాత్రితో ఎందుకిలా గందరగోళంగా మారింది. నాకేం అర్థం కాలేదు. ఎప్పటికో ఆలోచనల మధ్య నిద్రపోయాను. అర్థరాత్రి దాటాక గాఢంగా నిద్రపట్టింది. కంటినిండా ప్రశాంతంగా నిద్రపోయాను.

మర్నాడు రాజశ్రీ చెప్పింది మొన్న వచ్చిన ఆఫీసర్ దేవమ్మకి పదివేలిచ్చాట్ట. వారానికోసారి వస్తానని బంతిని తనకోసం తప్ప ఇంకెవరికీ ఎంగేజ్ చేయద్దని చెప్పాట్ట. డాక్టర్ దగ్గరకు తీసికెళ్లి రక్తపరీక్షలని చేయించమన్నాట్ట. అంతా చెప్పి అంది రాజశ్రీ.

"బంతీ! మగాళ్లు చాలా తామాషా అయిన మనుషులు. కొందరు ఆడది దొరికితే చాలని ఆ ఆడది ఎలా ఉన్నా, కనిపిస్తే చాలు మీదపడి కరుస్తారు. కొందరు వెరైటీ కోసం భార్యకాక ఒకళ్లనో, ఇద్దరినో ఉంచుకుని రోజూ ఇంట్లో తింటూ మధ్య మధ్య హోటల్‌కెళ్లినట్టు ఉంచుకున్న వాళ్ళ దగ్గరకు వెళ్ళి గడిపివస్తుంటారు. కానీ ఈ ఆఫీ

సర్ చాలా చిత్రమైన మనిషిలా ఉన్నాడు. ఒకరాత్రి వేశ్య దగ్గరకు వచ్చినవాడు ఆ వేశ్యకి రోగాలేవన్నా ఉన్నాయా? ఆ వేశ్య ఎంతమందితో పడుకుంటోంది? నా ఒక్కడితోటే పడుకోవాలంటే ఎంత తీసుకుంటుంది? వారానికి ఎన్నిరోజులు ఆ వేశ్యని ఎంగేజ్ చేయచ్చు లాంటి తమాషా ఆలోచనలున్నాయి ఆయనకి. అందుకే నిన్ను డాక్టర్ పరీక్షకు పంపించాడు. వారానికో రోజు మాత్రం వస్తాట్ట. అది కూడా శనివారం రాత్రి వస్తాట్ట. ఆరోజు నీతో గడిపి వెళ్తాట్ట. నాకేవిటో అర్థం కావడంలేదు ఈయన మనస్తత్వం" అంది.

"ఏదైతే మనకేం రాజశ్రీ. ఒకవిధంగా అదృష్టమేగా. నలుగురు పశువులు ఒళ్లంతా రక్కివెళుతోంటే కిక్కురుమనకుండా భరించాల్సిన దుస్థితి తప్పిందికదా. నిజంగా ఆయన నాకు ఉపకారమే చేస్తున్నాడు. దేవమ్మకి ఎలా నచ్చచెప్పాడో మరి" అన్నాను.

"డబ్బు... డబ్బు చూస్తే దేవమ్మ ఏంటి? దేవుడు కూడా కన్విన్స్ అవుతాడు. నెలకి పదివేలకి కాంట్రాక్టు మాట్లాడుకుని వెళ్ళాడు. చూశావా. ఆడదాన్ని ఎన్ని రకాలుగా ఎక్స్ప్లాయిట్ చేయగలరో మగవాళ్లు. ఇదోరకం మోజు. ఏదైనా ఆడదాన్ని డబ్బుతో కొనేయాలన్న కోరిక. కొనేయగలమన్న ధీమా... ఛీ... ఏం జన్మ మనది. ఆడదానిలా పుట్టేకన్నా ఏ అడవిలోనో జంతువుగా పుట్టి వుంటే ఇంతకన్నా సుఖంగా, స్వేచ్ఛగా బతికేవాళ్లం. వేశ్యల బతుకులను బాగుచేయాలి. వృత్తి విద్యలు నేర్పించి, సమాజంలో గౌరవనీయమైన స్థానం కల్పించాలి అంటూ ఉపన్యాసాలిచ్చే రాజకీయనాయకులు, ఇలాంటి ఆఫీసర్లు రాత్రి కాగానే వేశ్యవాటికల్లో దూరతారు. మరి ఎందుకలా ఉపన్యాసాలిస్తారో అర్థం కాదు. ఏదిఏమైనా నాకు మాత్రం ఆ ఆఫీసర్ నిన్ను కొనేసుకోవడం నచ్చలేదు. వాడు ఏ ఆరునెలలు ఉంచుకుంటాడో, సంవత్సరం ఉంచుకుంటాడో నీమీద ఈ విధంగా అధికారం సంపాదిస్తున్నాడు. నీ స్వేచ్ఛని హరిస్తున్నాడు. నీ ఇష్టాలమీద, నీ అస్తిత్వంమీద వాడు పెత్తనం సంపాదిస్తాడు. నెలకి పదివేలిచ్చి నిన్ను కొంతకాలంపాటు కొనుక్కుంటాడు. నీకు తెలుసా? కొంతకాలం ఓ మగాడికి ఉంపుడుగత్తెగా ఉన్న ఆడదాని విలువ మార్కెట్లో పడిపోతుంది"

రాజశ్రీ మాటలు నాకు చాలా మొరటుగా, భయంకరంగా అనిపించాయి. చెవులు మూసుకుంటూ అన్నాను. "దయుంచి ఇంకేం మాట్లాడద్దు రాజశ్రీ నాకు మాత్రం ఆయన చేసిన పని బాగా నచ్చింది. ఆయన్ని చూశాక ఆయన స్పర్శలో తీయదనం అనుభవించాక ఇంకో మగవాడి స్పర్శ భరించే శక్తిగానీ, సహనంగానీ నాకు లేవు కూడా. బహుశా నా మనసు గ్రహించే ఆయనీ నిర్ణయం తీసుకున్నాడో నా మనసు గ్రహించిన భగవంతుడు ఆయన ఈ నిర్ణయం తీసుకునేలా అనుగ్రహించాడో కానీ నాకు మాత్రం ఇదే బాగుంది. ఆయన నన్ను ప్రేమిస్తున్నారు రాజశ్రీ"

రాజశ్రీ ఏం మాట్లాడలేనిదానిలా నావైపు కళ్లప్పగించి చూస్తూ ఉండిపోయింది.

నేను ఎదురుచూసిన శనివారం వచ్చింది.

దేవమ్మ చెప్పకుండానే సాయంకాలం ఆరు కాగానే స్నానంచేసి అందంగా ముస్తాబయినాను. పూలదండ తీసుకుని నా దగ్గరకు వచ్చిన దేవమ్మ నన్ను చూస్తూనే బుగ్గలు నొక్కుకుంది. "ఏవే... వారంనుంచీ మాడిస్తే తెలిసిందా ఈ ఆకలి సంగతి. ఇవాళ అప్పుడే రెడీ అయ్యావు" అంది.

ఇప్పుడు నాకామె మాటలు కోపం తెప్పించలేదు. నవ్వేసి ఊరుకున్నాను. ఆమె చేతిలోంచి పూలదండ లాక్కున్నాను. జడలో తురుముకుంటూ లోపలికి వెళ్ళాను. ఒళ్లంతా పౌడర్ రాసుకున్నాను. గులాబీ దగ్గర రకరకాల సెంట్లుంటాయి. దాని దగ్గ




రకెళ్లి ఓ సెంటు తెచ్చుకుని కొద్దిగా బట్టలకి పూసుకున్నాను.

అన్నం తిని ఆయన కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. ఆరోజు తొమ్మిది నుంచే కొందరు రావడం మొదలైంది. అందరూ లైట్లార్పేసి గదుల్లోకి వెళ్లి తలుపేసుకున్నారు.

నేనెన్నడూ ఎరగని మధురమైన కొత్త కొత్త ఊహల్తో ఆయనకోసం ఎదురుచూస్తున్నాను. కాస్సేపటికి బూట్ల చప్పుడైంది. చటుక్కున చెవులు రిక్కించాను.

"రండి బాబూ... రండి. మీ కోసమే ఎదురుచూస్తోంది బంతి" దేవమ్మ ఆహ్వానిస్తోంది.

బూట్ల చప్పుడు దగ్గరైంది. నా అణువణువూ ఏదో భయంతో జలదరించసాగింది. ఏదో వణుకు.

ఆయన లోపలికి వచ్చారు. దేవమ్మ గుమ్మందాకా వచ్చి "ఏదన్నా కావాలంటే అడగండి. బాబూ" అంటూ కాస్సేపు అక్కడే నిలబడిపోయింది.

ఆయన గదిలోకి అడుగుపెట్టి ఓ మూలగా తన బూట్లు విప్పి పెట్టారు. "నువ్వు వెళ్లు దేవమ్మా" అన్నారు దేవమ్మని ఉద్దేశించి,

దేవమ్మ చేతులు నలుపుకుంటూ ఏదో సణుగుతోంది.

"ఏంటి? ఏం కావాలి? " అడిగారాయన.

"ఏంలేదు బాబుగారూ! వారం రోజుల పాటు దాన్ని యాపారం లేకుండా మీకోసం అట్టిపెట్టాలంటే నాకు బోల్డంత నష్టం వస్తొంది. డబ్బులు బొత్తిగా సరిపోవడం లేదు..."

ఆయన జేబులోంచి ఓ నోట్లకట్ట తీసి దేవమ్మ చేతుల్లోకి విసిరేశారు.

దేవమ్మ కిందపడకుండా ఆ కట్టని జాగ్రత్తగా పట్టుకుని కళ్లకద్దుకుని చేటంత మొహంతో బయటకి వెళ్లిపోయింది.

ఆయన నావైపు చూస్తూ "ముందా తలుపేసి రా" అన్నారు.

నేను తడబడే అడుగులతో వెళ్లి తలుపేసి వచ్చాను.

"కూర్చో" అన్నారు మంచంకోడు పట్టుకుని నిలబడిన నన్ను చూస్తూ.

మౌనంగా మంచం చివర అంచుమీద కూర్చున్నాను.

"ఇంకా సిగ్గేనా? " అడిగారు.

సిగ్గా? నాకా? ఫకాల్న నవ్వొచ్చింది. మాకే సిగ్గూ, శరమూ ఉంటే ఈ వృత్తి ఎందుకు చేస్తాం? అనుకున్నాను. కానీ పైకి ఏమీ అనలేకపోయాను.

"ఇవాళ చాలా బాగున్నావు. ఆరోజు కూడా బాగున్నావు కానీ ఏదో తేడా కనిపిస్తోంది. ఇవాళ మొహంలో చిత్రమైన వెలుగు వచ్చింది. ఏంటి స్పెషల్? " అడిగారు.

ఇప్పుడొచ్చింది నాకు సిగ్గు. నేను బాగున్నానని ఒక మగవాడి నోటివెంట, అదీ నాకెంతో నచ్చీ నన్ను మానసికంగా కలవరపరచిన మగవాడి నోటివెంట వింటోంటే ఓ మధురమైన అనుభూతి నిలువునా పాకింది. వెచ్చటి రక్తం మొహంలోకి చివ్వున చిమ్మింది. తల వంచుకున్నాను.

ఆయన కుడిచేతి చూపుడు వేలితో నా చుబుకం పట్టుకుని మొహం పైకెత్తి కళ్లల్లోకి చూస్తూ "కావ్యా! వేశ్యల్లో నీలాంటి అమ్మాయిని మొదటిసారి చూస్తున్నాను. నేను చాలాసార్లు వేశ్యల దగ్గరకు వెళ్లాను. కానీ వాళ్ల ప్రవర్తన, వాళ్లు మాట్లాడే అసభ్యకరమైన మాటలు, వాళ్ల వేషధారణ నాకు చాలా ఏవగింపు కలిగించేది. డబ్బులు ఇచ్చి వెనక్కి వెళ్లిపోయేవాడిని. ఇక్కడ కూడా అలాంటివాళ్లే ఉంటారేమో, ముందు నాకు నచ్చిన వాళ్లు కనిపిస్తేనే డబ్బులివ్వాలి అని నిర్ణయించుకున్నాను. కానీ నిన్ను చూశాక నీకోసం ఎంత డబ్బిచ్చినా ఫర్వాలేదు, ఖర్చు పెట్టచ్చు అనిపించింది. వేశ్యలంటే వాడిపోయిన పూలదండల్లా ఉంటారనుకున్నాను.

నువ్వు ఇప్పుడే పూసిన పువ్వులా ఉన్నావు. నాకు బాగా నచ్చావు. నీకు నేను నచ్చానా? ”

అతని మాటలు వింటుంటే నా గుండెల్లో సన్నాయివాయిద్యం మోగుతున్నట్టుగా అనిపించసాగింది. ఆ మాటలు పన్నీటి జల్లుల్లా నా శరీరాన్ని తడిపేస్తుంటే మంత్రముగ్ధురాల్నై వింటూ కూర్చుండిపోయిన నేను ఆయన చివరగా వేసిన ప్రశ్నకి అప్రయత్నంగా తలూపాను.

నీకు నేను నచ్చానా? ఎంత బాగుందీ మాట? నన్నెవరడిగారీమాట? నేను నచ్చానో లేదో కూడా ఆలోచించకుండా దేవమ్మ చేతిలో డబ్బులు పెట్టి, చీకట్లోంచి నడిచొచ్చి చివాల్న మీదపడి కోరిక తీర్చుకుని వెళ్లిపోయే కామపిశాచులకు తను అనుభవించే ఆడది అందంగా వుందా, లేదా? దానికి మనసుందా, లేదా? అని ఆలోచించే తీరిక, ఓపిక, సహృదయత ఉన్నాయా? ఆడదైతే చాలు, ఆడదాని ఆకారంలో ఓ మాంసంముద్ద నిలబడి, దానికి చీర కడితే చాలు, అనుభవించే బండమనసులు. వాళ్లెప్పుడన్నా నీకు నేను నచ్చానా? అని అడిగారా? ఇవాళ ఈయన వేసిన ప్రశ్నకి నిజంగా నాకాయన నచ్చకపోయినా నచ్చారని చెప్పాలన్నంత ఉద్వేగం నాలో కలిగింది. నచ్చారు. నాకెంతో నచ్చారు. మీరంటే నాకిష్టం. అనుభవించండి నన్ను. మీకెలా కావాలంటే అలా అనుభవించండి. ఆనందించండి అని చెప్పాలని అనుకున్నాను. కానీ, నా నోట్లోంచి మాట పెగల్లేదు. జీవితంలో మొదటిసారిగా శరీరం యావత్తూ తీయని ప్రకంపనలతో నిండిపోగా మొహానికి చేతులు అడ్డం పెట్టుకున్నాను.

ఆయన గట్టిగా నవ్వారు. ఆ నవ్వు తమాషాగా, ఎంతో మధురంగా వినిపించింది. నేనెన్నడూ సంగీతం వినలేదు. బహుశా ఆయన నవ్వు తీయని సంగీతంలా ఉందేమో. నేనెన్నడూ జలపాతాల హోరు వినలేదు. బహుశా ఆయన నవ్వు ఆ హోరులా ఉందేమో. ఆయన మాటలు, ప్రవర్తన నా పట్ల చూపిస్తున్న ప్రేమ ఇదంతా చూస్తోంటే నన్ను ఆయన తప్పకుండా పెళ్లి చేసుకుంటారనిపించింది ఎందుకో. ఎలాగైనా ఇవాళ నన్ను పెళ్ళి చేసుకుని ఇక్కడినుంచి తీసికెళ్లిపోతారేమో అడగాలి అని నిశ్చయించుకున్నాను.

ఆయన నా చేతులు మొహం మీదనుంచి తీసి ముందుగా నా నుదుటిమీదనుంచి ప్రారంభించి అణువణువూ ముద్దులు పెట్టుకోసాగారు. ఆ తరవాత ఏం జరిగిందో నాకు తెలియదు. నిలువునా నన్ను మైకం ఆవరించింది. ఆ మైకంలో మొదటిసారిగా స్త్రీ, పురుషుల సంగమంలో ఉన్న మధురానుభూతిని ఆస్వాదించాను.

దాదాపు రెండు గంటల తరవాత మైకం చల్లారింది. ఆయన వెల్లకిల్లా పడుకుని సిగరెట్ వెలిగించుకుని రింగులు, రింగులుగా పొగవదుల్తుంటే నెమ్మదిగా అడిగాను. “మీరు మీరు నన్ను పెళ్లి చేసుకుంటారా? ”

ఆయన నావైపు చూశారు. ఆ చూపులో ఆశ్చర్యంగాని, కోపంగానీ లేవు. కానీ ఏదో నాకు అర్థంకాని భావం కనిపించింది. అదేమై ఉంటుందో! అని ఒక్కక్షణం వణికిపోయాను. అదిరే పెదాలతో మళ్ళీ అన్నాను. “దేవమ్మ నన్నిలా ఎక్కువకాలం ఉండనివ్వదు. మళ్ళీ ఎవరినో ఎక్కువ డబ్బులకి తీసుకువస్తుంది. నాకిష్టంలేదు. మీ ఇంట్లో నన్ను పనిమనిషిగా ఉండనిచ్చినా సరే... నన్ను తీసుకెళ్లండి. నాకు తాళి అంటే ఇష్టం. నా మెడలో తాళి కట్టండి. నాకీ సమాజం గౌరవం ఇస్తుంది. కడతారా? ”

ఆయన అలాగే చూస్తూ అడిగాడు. “నీకెవరు చెప్పారు? తాళి కడితే సమాజం గౌరవం ఇస్తుందని”

“మా అమ్మ... ఆడదానికి పెళ్లి, తాళి




బొట్టు రక్షణనీ, గౌరవాన్ని ఇస్తాయి అని చెప్పింది"

"ఎక్కడుంది మీ అమ్మ...?"

"చెప్పాగా... చచ్చిపోయింది. లేదు"

"అరె... అలాగా. తాళికడితే పెళ్లి అయినట్టా"

నేను సందేహంగా చూశాను.

నా మౌనం చూసి నవ్వుతూ "మంచి మాట అడిగావు" అన్నారు.

నా కళ్లల్లో కొద్దిగా వెలుగు పాకింది. హమ్మయ్య ఆయనకి కోపం రాలేదు అనుకుని నిట్టూర్చాను. ఆ తరవాత మా మధ్య సంభాషణ జరగలేదు.

తెల్లవారుజామున ఐదింటికి ఆయన లేచి, నన్ను నిద్రలేపి, చివరిసారిగా మరోసారి ముద్దు పెట్టుకుని శనివారం వస్తాను అని చెప్పి వెళ్ళిపోయారు.

శనివారం వస్తానని అన్నారేకానీ, నన్ను తీసికెడతానని కానీ, నేనడిగిన తాళి కడతాననిగానీ అనలేదు. అయినా నాలో ఏదో వెర్రి ఆశ. శనివారం వస్తాను అంటే వచ్చి తాళికట్టి తీసికెడతాను అని అర్థం కాబోలు. ఆఫీసర్లు అలాగే మాట్లాడతారు కాబోలు అనుకున్నాను.

నేను ఆయనతో అన్నట్టు నేను అనుకున్నట్టు దేవమ్మ ఆయనతో ఏర్పరుచుకున్న ఒడంబడికకి ఎక్కువకాలం నిలబడలేకపోయింది. రోజూ నసపెట్టడం మొదలుపెట్టింది. "యాపారం చేసుకునేదాన్ని ఉంచుకోడం ఏంటి? ఉంచుకోడానికి బైట ఈడికెవరూ దొరకలేదా? శనివారందాకా ఆడిపెళ్లాన్ని ఉంచినట్టు పవిత్రంగా ఉంచాలంటే కుదురుద్దా" అంటూ.

రెండు రోజులు గడిచాక మామూలుగా గదిలోకి వెళ్లి పడుకున్నాను.

అయితే, ఆ శనివారం ఆయన రాలేదు. ఆ శనివారమే కాదు. చాలాసార్లు రాలేదు.

అందరూ ఎగతాళి చేయసాగారు. దేవమ్మ సరేసరి. "బాగైందా? ఆడేదో ఉంచుకుని నిన్నుద్ధరిస్తాడనుకున్నావు. చూశావుగా. సానిదాన్ని ఏ మగాడూ ఉద్ధరించడు. అనవసరంగా బతుకు పాడుచేసుకోకు. చెప్పినట్టు ఇను" అంటూ నా భవిష్యత్తు నిర్ణయించేసింది.

కానీ ఆయన తప్పకుండా వస్తాడని నా మనసులో అనిపిస్తుంటే ఆయన కోసం ఎదురుచూడసాగాను.

ఎదురుచూసి, ఎదురుచూసి అలసిపోయాయి నా కళ్లు. రాత్రి పన్నెండైంది. ఆయన రాలేదు. ఎందుకు రాలేదు? ఏం జరిగింది? నన్ను ఇక్కడినుంచి తీసికెళ్తా నన్న పెద్దమనిషి ఇంతవరకూ ఆ ప్రయత్నాలు ఏం చేయలేదు. పైగా, తను రావాల్సిన శనివారం కూడా రాలేదు. ఎందుకని? ఆయనకేం అపకారం జరగలేదుకదా! దేవుడా ఆయన రావాలి. ఆయన రావాలి. ఏడుకొండలమీద ఉన్న విగ్రహాన్ని స్మరించుకుంటూ వేడుకున్నాను.

ఆయన రాలేదు కానీ, దేవమ్మ ఎవరినో వెంట పెట్టుకొచ్చింది.

తలుపు కొట్టింది.

ఆయనేమో అనుకుని తీశాను. మరెవరితోనో దేవమ్మ.

"నాకొద్దు. వీల్లేదు" తలుపు వేయబోయాను. దేవమ్మ కాలు అడ్డం పెట్టింది. నన్ను తోసుకుంటూ లోపలికి వచ్చింది. "రండిబాబూ" అంది. యాభైఏళ్ల వయసున్న ఓ వ్యక్తి లోపలికి వచ్చాడు.

నా జబ్బ పట్టుకుని ఆయనమీద పడేలా తోసింది దేవమ్మ.

రెండు చేతుల్తో గట్టిగా అదుముకున్నాడు. మందు వాసన గుప్పున కొట్టింది.

"వదులు" గట్టిగా అరిచాను.

"ఏయ్... నోర్మూయ్" గదిమింది దేవమ్మ.

"ఇవాళ శనివారం... ఆయనొస్తారు" అరిచాను మళ్లీ.

"ఎవరే ఆయన... పెద్ద తాళి కట్టిన

మొగుడికోసం చూస్తున్నట్టు చూస్తున్నావు. ఇదిగో ఎవడూ రాడు. ప్రతి శనివారం వస్తాడనేనా నీ ఆశ. మగాడికి రోజుకో రుచి కావాలి. నీ కోసం ఎవరూ రారు. ఇంకా ఎంతకాలం నీమీద మోజుంటుంది అనుకుంటున్నావు. నోరు మూసుకుని పడుకో. వెళ్లు. దీన్ని మెత్తగా వంగదీయ లేరు బాబుగారూ. వంగకపోతే ఏయండి రెండు" అంటూ బైటకి వెళ్ళిపోయి విసురుగా తలుపేసింది.

నా ఆక్రందన అరణ్యరోదన అయింది. ఆయన స్పర్శతో పావనమైందనుకున్న నా శరీరం అపవిత్రం అయింది. ఆయనకాక మరెవరో నా శరీరాన్ని ఇష్టం వచ్చినట్టు అనుభవించారు.

కుప్పకూలి ఏడవసాగాను.

దేవమ్మని చూస్తుంటే రాక్షసికన్నా భయంకరమైనదిగా అనిపించసాగింది.

ఆమెని చూస్తోంటే ఆ వస్తాదులను పిలిపించి మమ్మల్నందరినీ కొట్టినట్టు దేవమ్మని కొట్టండి అని చెప్పాలనిపిస్తోంది. చేతికి దొరికిన రాయితో దేవమ్మ తల పగలగొట్టాలని, కత్తితో పరపర కోసేయాలని అనిపిస్తోంది. రాక్షసి దేవమ్మని కిరోసిన్ పోసి తగలబెట్టాలనిపిస్తోంది. దేవమ్మ నావైపు చూస్తుంటే ఆ గుడ్లు పీకేయాలని అనిపిస్తోంది. మా శరీరాలతో వ్యాపారం చేస్తూ మా యవ్వనాన్ని కరెన్సీ కట్టలుగా మార్చుకుంటోన్న దేవమ్మని చర్మం ఊడదీసి అస్థి పంజరంగా మార్చాలనిపిస్తోంది. కానీ ఏమీ చేయలేని నిస్సహాయతతో ఆమె రాక్షసత్వానికి బలి అవుతూ ఆ నరకంలో మరో పది రోజులు గడిచాయి.

ఆయనొచ్చి ఆరు నెలలైంది. దేవమ్మ ఆయన సంగతి మర్చిపోయింది.

ఆయనకోసం ఏడుస్తోన్న నాతో రాజశ్రీ అంది "చూశావా బంతీ! ఆయనేదో నిన్ను ఉద్ధరిస్తాడనుకున్నావు. నిన్నేదో ప్రేమిస్తున్నాడనుకున్నావు. ఇప్పుడు తెలిసిందా? ఏ మగాడు మనల్ని ప్రేమించడు. మనల్నే కాదు. అసలు ఆడదాన్ని మగాడు ప్రేమించాడంటే దాని శరీరం మీద ఉన్న కోరికతో, మోజుతో. ఆ మోజు తీరాక అన్నం తిన్నాక విస్తరాకుని పారేసినట్టు పారేస్తాడు. మనం ఎంగిలి విస్తారాకులం. మనల్ని ఎవరూ ఉద్ధరించరు" అంటూ వెక్కివెక్కి ఏడవసాగింది.

నాకు జాలేసింది. బాగా ఏడుపు వచ్చింది. "లేదు ఆయన తప్పకుండా వస్తారు. నన్నిక్కడనుంచి తీసికెళ్తారు. ఏదన్నా అర్జంటు పని ఉండి రాలేదేమో. నేను వెళ్లిపోయాక నిన్ను కూడా ఇక్కడి నుంచి తీసికెళ్లిపోతాను" అన్నాను నమ్మకంగా.

"తీసికెళ్లి... ఆ తరవాత" అడిగింది.

"ఆ తరవాత ఆ తరవాత..." నేను తెల్ల మొహం వేశాను.

"నా సంగతి సరే. నిన్ను ఎక్కడికి తీసికెళ్తాడు ఆయన? " అడిగింది.

"వాళ్లింటికి"

పగలబడి నవ్వింది రాజశ్రీ. నవ్వి నవ్వి ఆఖర్న అంది "ఎంత అమాయకురాలివి! ఒక వేశ్యను, ఓ పోలీసాఫీసర్ వాళ్లింటికి తీసికెళ్తాడా? అసలెక్కడన్నా జరుగుతుందా ఇది? "

"ఏం? ఎందుకు జరగదు? ఆయనకి నేనంటే ప్రాణం. రెండుపూట్లా అన్నం పెడితే చాలు ఎంతసేవ అయినా చేస్తానని చెప్పాను"

"ఏం సేవ చేస్తావు? నీ సేవలు ఏవిధంగా కావాలి ఆయనికి? పవళింపు సేవ తప్ప మరే సేవా కోరుకోడు"

"పోనీ అదే చేస్తాను"

"ఎక్కడ? "

"చెప్పాగా వాళ్లింట్లో"

"పిచ్చిదానా ఆ ఆలోచన మానెయ్. నిన్ను తీసికెళ్లి ఏ ఇరుకు సందులోనో ఓ చీకటి గదిలో పెట్టి ఆ గది దాటి రాకుండా





నీ చుట్టూ సమాజం అనే కోటగోడని అడ్డుగా పెట్టి తన కోసం కేవలం తనకోసం నిన్ను పోషిస్తాడు. తనకి అవసరం ఉన్నంతకాలం తనకి యవ్వనం ఉన్నంతకాలం, తనకి సెక్సువల్ సామర్థ్యం ఉన్నంతకాలం, తనకి నీ మీద మోజు ఉన్నంతకాలం నీకు రెండుపూట్లా అన్నం పెడతాడు. ఆ తర వాత నీ గురించి పట్టించుకోడు. నీకు రోగ మొచ్చినా, రొస్టువచ్చినా, నిన్ను వదిలే స్తాడు. అక్కడ నీ అతీగతీ పట్టించుకునే నాధుడుండడు. ఇక్కడుంటే కనీసం నీకు తలనొప్పి వచ్చిందంటే అమ్మో తలనొప్పి వచ్చింది. ఇది కళ్లు మూసుకుపడుకుంటే ఓ వేయి రూపాయలు నష్టపోతాను అనుకు నైనా దేవమ్మ ఓ మాత్ర తెచ్చిస్తుంది. తల నొప్పి తగ్గిందా? ఎలా ఉన్నావు? అని ఈ రాజశ్రీ నిన్ను పలకరిస్తుంది. నీకక్కడ ఎవరూ ఉండరు. రోజులో ఓ గంట వచ్చి పోతాడు"

రాజశ్రీ మాటలు నమ్మబుద్ధికాలేదు. ఆయన గురించి తనకేం తెలియదు. ఆయ నకి నేనంటే ఎంత ప్రేమో రాజశ్రీకి తెలి యదు కాబట్టి ఇలా మాట్లాడుతోంది అనుకు న్నాను. ఆయన తప్పకుండా వస్తారు. అనే ఓ బలమైన నమ్మకం నాలో ఏర్పడింది.

ఆరోజు రాత్రి సరిగ్గా పది గంటలకు మా లోగిలి అంతా శృంగార సామ్రాజ్యపు తలు పులు బిగించుకుని ఉన్న వేళ బైట జీపు ఆగింది. బైట తలుపులు ఎవరో దబదబ బాదుతున్నారు. దేవమ్మ కంగారుగా అమ్మా యిల గదుల తలుపులు కొట్టింది. అందరూ తలుపులు తీశారు. అర్ధనగ్నంగా ఆడా మగా అంతా బైటకి వచ్చారు. "ఏం జరి గింది? " అడిగారు.

నా పక్కన పడుకున్న వ్యక్తి ఆ అలజ డితో భయంగా లేచి అస్తవ్యస్తంగా బట్టలు కట్టుకుని బైటకి రాబోతుంటే ఒక లేడీ కాని స్టేబుల్ విసురుగా లోపలికి వచ్చి బూతులు తిడుతూ లాఠీతో కొడుతూ నన్ను బైటకి ఈడ్చుకొచ్చింది. ఇదంతా నాకు తెలుసు. అనుభవపూర్వకంగా తెలుసు. నెలకో, రెణ్ణెల్లకో పోలీసులు రెయిడ్‌చేసి దేవమ్మ దగ్గర డబ్బులు వసూలు చేసుకుని వెళ్లడం నాకు తెలుసు. నేనీ నరకంలో సంతోషించే విషయం ఏదన్నా ఉందంటే అదే. పోలీసులు రావడం, దేవమ్మ ఖంగా రుపడడం, ఉసూరుమంటూ వాళ్లకి డబ్బులు ఇవ్వడం నాకు వినోదంగా ఆనం దంగా అనిపిస్తుంది. కానీ ఈవేళ ఈ కాని స్టేబుల్ మోటుగా ప్రవర్తించడంతో చాలా అవమానంగా అనిపించింది. నేనేదో ఇష్టంగా ఈ పని చేస్తున్నట్టు ఆమె మాట్లాడ్డం నాకు చాలా బాధని, వేదననీ కలిగించింది.

దేవమ్మ మగాళ్లందరినీ వెనకాల ఉన్న గదిలోకి పంపించి తలుపులు వేసేసింది. అమ్మాయిలను లోపలికి వెళ్లిపొమ్మని చెప్పి తను వెళ్లి బింకంగా తలుపులు తీసింది. బిలబిల్లాడుతూ నలుగురు పోలీసులు లోప లికి వచ్చారు.

వాళ్లని గుమ్మంలోనే అడ్డుకుని మామూ లుగా మాట్లాడ్డానికి ప్రయత్నించింది.

వాళ్లు ఆమె మాటలు పట్టించుకోకుండా అక్కడ ఉన్న నాలుగు గదుల్లోకి దూరి అమ్మాయిలను రెక్కపుచ్చుకుని బైటకి లాక్కొచ్చారు.

దేవమ్మ వాళ్లకి అడ్డం వెళ్లి "ఏయ్... ఎందుకిప్పుడు వాళ్లని తీసికెడుతున్నారు. ఇక్కడెవరన్నా ప్యాసింజరు ఉన్నాడా? వాళ్ల మానాన వాళ్లు పడుకుంటే ఎందుకు తీసికె ళ్తున్నారు? " అంటూ దబాయించసాగింది.

లేడీ కానిస్టేబుల్ దేవమ్మని పక్కకి తోసి గబగబా నడుస్తూ నా దగ్గరకు వచ్చి రెక్క పట్టుకుని మిగతా పోలీసులవైపు తోసింది. నేను బిత్తరపోయాను. భయంతో నా కాళ్లు వణకడం మొదలుపెట్టాయి. కెవ్వుమని అరిచాను. "ఏయ్! అరిచావంటే చంపేస్తా" గదిమాడు కానిస్టేబుల్.



"నాకేం తెలియదు. నన్ను వదిలేయండి" బతిమాలాను.

"ఏం తెలియదే నంగనాచివి. ఏం తెలియకుండానే ఇక్కడ ఉన్నావా? " అంటూ నా జబ్బమీద బలంగా గిల్లాడు.

కెవ్వుమన్నాను. ఈలోగా రాజశ్రీని కూడా తోసుకుంటూ వచ్చిన లేడీ కానిస్టేబుల్ ఆమెని కూడా మిగతా పోలీసులమీదకు తోసి దేవమ్మ దగ్గరకు వెళ్లి "ఆ గది తాళం చేతులివ్వవే" అంది.

"లేవు, పోయాయి. అయినా ఆ గది ఎందుకు నీకు. అది స్టోర్‌రూం" అంది దేవమ్మ కోపంగా.

"ఓ స్టోర్ రూమా? చెప్తా" అంటూ చెంపమీద లాగిపెట్టి కొట్టింది దేవమ్మని.

దేవమ్మ మండిపడుతూ చూసింది. హమ్మయ్య దేవమ్మని కొట్టిన ఆ కానిస్టేబుల్‌వైపు అభినందనగా చూశాను అంత దుఃఖంలో కూడా.

కొంత ఘర్షణ తరవాత దేవమ్మ బొడ్లో దోపుకున్న తాళంచేతులు లాక్కుని గది తాళం తీసింది ఆమె.

లోపలికి వెళ్లి అక్కడ నక్కి ఉన్న మగాళ్లను లాక్కొచ్చింది. కాస్సేపట్లో అందర్నీ జీపులో ఎక్కించింది దేవమ్మతోసహా.

పోలీస్ స్టేషన్‌లో అందరం తలవంచుకుని కూర్చున్నాం. కొందరు ప్రత్యేకించి వచ్చి మమ్మల్ని చూసి వెళ్తున్నారు. వాళ్ల మొహాల్లో కనిపిస్తోన్న ఎగతాళితో కూడిన నవ్వు, కొందరి మొహాల్లో కనిపిస్తోన్న అసహ్యం గమనిస్తోంటే అవమానంతో మనసు దహించుకుపోసాగింది.

ఇంకా సిఐగారు రాలేదు. ఆయన వచ్చిందాకా మమ్మల్ని అక్కడే కూర్చోమన్నారు.

పదకొండు అవుతుండగా సిఐగారు వచ్చారని హడావుడి చేశారు.

ఆయన హుందాగా నడుచుకుంటూ మా ముందునుంచే లోపలికి తన గదిలోకి వెళ్లాడు. నేను తలతిప్పి కూర్చున్నాను నా మొహం కనిపించకుండా. యూనిఫాం వేసుకుని బూట్లు టకటక లాడిస్తూ పొడుగ్గా ఉన్న ఆకారం అస్పష్టంగా కనిపించింది.

దేవమ్మని పిలిచి బాగా తిట్టారు. వాళ్లిద్దరికీ మధ్య కొద్దిసేపు చిన్నపాటి ఘర్షణ జరిగింది "ఏంటే ఏం చేస్తున్నావు నువ్వు లైసెన్సుందా? " అని అడిగాడు.

"లైసెన్సు ఇస్తాం ఇస్తాం అన్నారు ఇచ్చారా? " నిరసనగా అంది దేవమ్మ.

"కోర్టుకి వెళ్లి జరిమానా కట్టండి" అన్నాడు.

కాస్సేపటికి అందర్నీ కోర్టుకి తీసికెళ్లడానికి జీపు రెడీ అయింది. బిలబిల్లాడుతూ అందరూ జీపు వైపు బయలుదేరారు. నాకు లేవడానికి శక్తి చాల్లేదు. అందరూ వెళ్లి జీపులో కూర్చున్నారు.

ఎప్పుడూ పోలీసులు వచ్చి దేవమ్మ దగ్గర డబ్బులు తీసుకుని వెళ్లడం మాత్రం తెలుసు. నేనెప్పుడూ స్టేషన్‌కి రాలేదు. పైగా కోర్టుకెళ్లి జరిమానా కట్టడం అంటే నేను వేశ్యని, తప్పు చేసినందుకు జరిమానా కడుతున్నాను అని చెప్పడం అంటే నేను చెడ్డదాన్ని అని నాకు నేనుగా చెప్పుకోడం అనిపించింది. అలా చేయడానికి నాకు మనసొప్పలేదు. కదలలేకపోయాను. లేడీ కానిస్టేబుల్ వచ్చి నా రెక్కపట్టుకుని పైకిలాగి, "నీకు బొట్టూ కాటుకా పెట్టి చెప్పాలా" అంటూ ఒక తోపు తోసింది.

అవమానంతో, సిగ్గుతో ప్రాణం పోతున్నట్టుగా అనిపించింది. గుండెల్ని ఎగదన్నుకుంటూ దుఃఖం ఉప్పెనలా వచ్చింది. అమ్మానాన్నా గుర్తొచ్చారు. 'డాక్టర్ అవ్వాలన్న మీ కూతురు చూశారా నాన్నా! ఏమయిందో! నేను బతుకుతున్న బతుక్కి ఇది పరాకాష్ట. ఇంక నేను బతక్కూడదు చచ్చిపోవాలి. నాకు ఆత్మహత్య చేసుకునే అవకాశం కలిగించండి నాన్నా!' అనుకుంటూ రెండు చేతుల్తో మొహం కప్పుకుని ఏడుస్తూ "నన్ను రక్షించండి. నాకేం తెలి




యదు. నాకీ వృత్తి ఇష్టంలేదు. నన్ను కాపాడండి" అంటూ అరవసాగాను.

"ఏంటి నీకీవృత్తి ఇష్టంలేదా? " అడిగింది.

"ఎవరన్నా ఇష్టంగా చేస్తారా? " రోషంగా అడిగాను. ఆమె నవ్వింది. పగలబడి నవ్వింది. తిరిగి లాఠీతో నన్ను పొడుస్తూ "పెద్ద పత్తిత్తువి కదా! ముం... పదవే" అంది.

నాకు మరింత ఉధృతంగా ఏడుపు వచ్చింది. గట్టిగా ఏడవడం మొదలుపెట్టాను. "నన్ను రక్షించండి. నాకు మళ్ళీ అక్కడికి వెళ్లడం ఇష్టంలేదు. దయుంచి నన్ను కాపాడండి" అంటూ ఆవిడ కాళ్లు పట్టుకుని బతిమాలసాగాను. ఆవిడ నన్ను లాక్కుని తీసుకువెళ్లింది సిఐ దగ్గరకు.

మేమక్కడకు వెళ్లగానే "ఏయ్, ఏంటే నీ గోల? పారిపోతావా? " విసుగ్గా అడిగారు.

నేను చటుక్కున ఆయన పాదాల మీద పడ్డాను. "సార్ నన్ను కాపాడండి. నాకు అక్కడికి వెళ్లడం ఇష్టంలేదు. నేనీ వృత్తి మానేస్తాను. నాకేదన్నా పనిప్పించండి. నేను వెళ్లిపోతాను. సార్ ప్లీజ్... నన్ను కాపాడండి" అంటూ ఏడవసాగాను.

"వేషాలేయకు. ఎన్నాళ్లనుంచీ చేస్తున్నావు ఈ వృత్తి? " అడిగారు.

నేనేం మాట్లాడలేదు.

"మానేస్తానని చెప్పి వదిలేయంగానే ఇంకెక్కడికో వెళ్లి చేస్తావీ పని. నీ సంగతి నాకు తెలుసు. వెళ్లెళ్లు"

"నా మాట నమ్మండి సార్. నిజంగానే నేను పనిచేసుకుని బతుకుతాను. నన్ను వదిలెయ్యండి"

"ఏం పనిచేస్తావు నువ్వు? నీకెవరు పనిస్తారు? " అన్నాడాయన.

"ఏదన్నా చేస్తాను సార్! అక్కడికి మాత్రం వెళ్లను. దయుంచండి సార్"

నేనెంతకీ రాకపోడంతో దేవమ్మ వచ్చింది. నా రెక్క పట్టుకుని లాక్కుపోడానికి ప్రయత్నిస్తుంటే సీఐగారు ఉరిమినట్టు అరిచారు. "ఆ పిల్లని వదిలెయ్"

"అదికాదు బాబుగారు" దేవమ్మ నసిగింది.

"నేను చూసుకుంటాను దాని సంగతి నువ్వెళ్లు" ఆజ్ఞాపించారు.

"దాన్ని వదిలివెళితే నా యాపారం..."

"ఏయ్ వెళ్తావా లేదా? " మరోసారి ఉరిమారు.

దేవమ్మ నా వైపు చూసి బూతులు తిడుతూ వెళ్లిపోయింది.

"ఎక్కడికి వెళతావు నిన్ను వదిలేస్తే" అడిగాడాయన.

"ఎక్కడికన్నా ఈ ఊరు వదిలి వెళ్లిపోతాను. వేరే ఊరు వెళ్లి పాచిపని చేసుకుని బతుకుతాను. నన్ను పంపించండి సార్! మీకు దణ్ణం పెడతాను" అన్నాను ఏడుస్తూ.

"నీకే ఊరు తెలుసు? మీ వాళ్లు ఎవరన్నా ఉన్నారా? "

"లేరు నాకెవరూ లేరు. కానీ వెళ్లిపోతాను. ఎక్కడికైనా వెళ్లిపోతాను. నన్ను పంపించెయ్యండి"

ఆయన కాస్సేపు ఆలోచించి కానిస్టేబుల్ని పిలిచారు. "సరే నువ్విక్కడే ఉండు సాయంత్రంకానీ రేపుకానీ నిన్నేదన్నా హాస్టల్‌కి పంపిస్తాను" అన్నారు.

నాకు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయింది. చివాల్న ఆయన కాళ్లమీద పడి "మీ ఋణం తీర్చుకోలేను సార్" అన్నాను.

ఆ సాయంకాలం దాకా స్టేషన్‌లో ఉండిపోయాను. వాళ్లే నాకు భోజనం తెప్పించి పెట్టారు.

మర్నాడు ఉదయం సిఐగారు చెప్పారు "హైదరాబాదులో స్టేట్‌హోంకి పంపిస్తున్నాను నిన్ను. కానిస్టేబుల్ తోడుగా వస్తాడు. అక్కడ ఒళ్లు దగ్గరపెట్టుకుని జాగ్రత్తగా ఉండు"

"చాలు నాకీ ఆశ్రయం చాలు. దేవమ్మ దగ్గర్నించి విముక్తి దొరికితే చాలు ఎక్కడికన్నా వెళతాను. ఎంత కష్టమైన పనైనా

చేస్తాను"

"నీ అదృష్టం బాగుంది. ఇంత తొందరగా ఇంత సులభంగా ఎవరికీ ఈ దేవమ్మ దగ్గ ర్నించి విముక్తి దొరకలేదు. జాగ్రత్తగా వెళ్లు పొరపాటున దాని మనుషుల కంటపడ్డా వంటే నీ బతుకు మళ్లీ మొదటికి వస్తుంది. ఇంకనుంచీ ఇట్టాంటి పనులు చేయకుండా కష్టపడి పనిచేసుకుని బతుకు" అంటూ నీతులు చెప్పి వెళ్లిపోయాడు.

★ ★ ★

సాయంకాలానికి కానిస్టేబుల్ వెంట నేను హైదరాబాదు రైలెక్కాను.

దేవమ్మకానీ ఆమె మనుషులుకానీ కనిపించకూడదని దేవుడిని వేడుకుంటూ బిక్కుబిక్కుమంటూ కూర్చున్నాను. గుండె దడదడలాడుతోంది. ఏ క్షణంలోనైనా దేవమ్మగానీ వస్తాదులుగానీ నన్ను వెతుక్కుంటూ వచ్చారంటే దొరికిపోతాను. ఎలా? దేవుడా కాపాడవూ. అదేపనిగా వేడుకోసాగాను. దేవుడి దయవలన ఎవరూ కనిపించకముందే రైలు కదిలింది.



హమ్మయ్య ఊపిరిపీల్చుకున్నాను. ఇంక నన్నెవరూ బలవంతంగా ఎక్కడికీ తీసికెళ్ల లేరు. స్టేట్‌హోం.. అక్కడ నాలాంటివాళ్లే ఉంటారని దిక్కులేనివాళ్లకి అది ఒక గుడి లాంటిదని చెప్పింది లేడీ కానిస్టేబుల్. ఆ గుడికి వెళ్లిపోతే నా జీవితాన్ని, మిగిలిన నా భవిష్యత్తునీ, ఆ దేవుడి చేతుల్లో పెట్టి నిశ్చింతగా ఉండచ్చన్నమాట అనుకున్నాను. దాదాపు రెండు గంటలసేపు ప్రయాణించాక రైలు ఓ చిన్న స్టేషనులో ఆగింది. కానిస్టేబుల్ ఇప్పుడే వస్తాను అంటూ లేచి వెళ్లాడు.

అయితే కానిస్టేబుల్ లేచి వెళ్లిన ఐదు నిమిషాలకి రైలు కదిలింది. కానీ ఆయన మాత్రం తిరిగిరాలేదు. పావుగంట, అర గంట, గంట గడిచింది. కానిస్టేబుల్ రాక పోడంతో నా గుండెల్లో భయం ముసురు కోసాగింది. ఎక్కడికెళ్లాడీయన? ఇంకా రాలేదేంటి? లేచి ఒక్కసారి కంపార్ట్ మెంట్‌లో తిరిగి చూడాలి కానీ ఎలా? ఇంతలో వచ్చాడు ఒకాయన తెల్లటి, లాల్చీ పైజామా వేసుకు న్నాడు. చేతిలో బ్యాగు అంటూ ఏంలేదు.

"హైదరాబాదులో ఎక్కడ ఉంటావు? "

ఉలిక్కిపడి చూశాను. యూనిఫాంలో లేకుండా, పైజామా, లాల్చీలో పొడుగ్గా ఉన్న ఆకారం, షాక్... సిఐగారు. గుండె ఒక్కక్షణం ఆగిపోయింది.

★ ★ ★

అది ఊరికి దూరంగా ఉన్న ఓ ప్రదేశం. అప్పుడప్పుడే డెవలప్ అవుతోన్న ఆ ప్రదేశంలో కొందరు మంచిమంచి ఇళ్లు కట్టుకుని నివాసం ఏర్పరచుకుంటున్నారు.

అయితే ఆ ఇళ్లు అక్కడక్కడా విసిరేసినట్టు పల్చగా ఉన్నాయి. చాలా ఖాళీ స్థలం ప్లాట్లుగా చేసి అమ్మేసినట్లున్నారు. ప్రతి ప్లాటుకీ పొడుగాటి రాళ్లు పాతి, వాటికి ఒక దాన్నొకటి కలుపుతోన్న బలమైన ఇనపతీగ

ఒకటి కట్టి ఉంది.

మా జీపు ఆ ప్లాట్లుదాటి సన్నటి సందు లోకి తిరిగింది. ఆ సందు మొదట్లో జీపు ఆపి, "దిగు" అంటూ ఆయన కూడా దిగారు.

దిగి, చుట్టూ పరికించి చూశాను. ఆ సందులో ఇళ్లు ఏమీలేవు. ఆయన ముందు నడుస్తూ "నా వెనకాలే రా" అన్నారు.

నేనాయన్ని అనుసరించాను.

అప్పటికి సంధ్య చీకట్లు ముసురుకు న్నాయి. ఆ ఏరియాలో ఎక్కడా స్ట్రీట్ లైటు కనిపించలేదు. కొంచెం ముందుకు నడవ గానే మరో సందు కనిపించింది. ఆ సందు లోకి మలుపు తిరగగానే వరసగా రెండు వైపులా ఇళ్లు కనిపించాయి.

"సార్! స్టేట్‌హోం ఇక్కడేనా? " అడి గాను.

ఆయనేం మాట్లాడలేదు.

సందు మొదట్లో ఓ ఇంటి ముందు ఆగి, "రాజమ్మా" అని పిలిచారు. ఆ ఇంటి కాంపౌండ్ గోడ బాగా పాతకాలంనాటిది. సగంసగం పెచ్చులూడిపోయి ఉంది. సిమెంటు, సున్నం అంతా పోయి విరిగిన ఇటుకలు కనిపిస్తున్నాయి. బాగా పాతదై పోయి, చెక్కులుగా ఊడిపోతోన్న చెక్క తలుపు ఒకటి ఉంది. ఆ తలుపు తీసుకుని ఓ అరవై ఏళ్ల స్త్రీ బైటకి వచ్చింది. ఆయన్ని చూడగానే "రండి బాబూ రండి" అంటూ పక్కకి తొలగి దారిచ్చింది. ఆవిడ బాగా సన్నగా ఉంది. ఎముకలు కనిపిస్తున్నాయి. ఓ ముతకనేత చీర మోకాళ్లదాకా కట్టు కుంది. వదులుగా ఉన్న జాకెట్టు వేసు కుంది. తలంటుకున్నట్టుంది. తెల్లటి జుట్టు చిక్కులు, చిక్కులుగా వేళ్లాడుతోంది. కళ్లు చికిలించి నావైపు చూస్తోంది. మొహం అంతా ముడతలు. కళ్లు లోపలికి పోయి ఉన్నాయి.

సిఐ గారిని చూడగానే "తమరా బాబూ రండి రండి" అంటూ పక్కకి తొలగి దారి చ్చింది. లోపలికి వెళ్లగానే పేడవాసన గుప్పుమంది. చుట్టూ ఇళ్లు, మధ్యలో ఖాళీ స్థలం. అంతా పేడతో అలికి ముగ్గులు పెట్టి ఉంది.

కుడివైపు వరసగా నాలుగు చెక్క తలుపు లున్న గదులు కనిపించాయి. ఆ గదులకు అన్నిటికీ కలిపి ఇటుకలతో కప్పు ఉంది. ఓ గదిముందు పెద్ద పంపుంది. అక్కడే పెద్ద డ్రమ్ములో నీళ్లున్నాయి. రెండుమూడు ప్లాస్టిక్ బకెట్లు, ప్లాస్టిక్ మగ్‌లున్నాయి. అక్కడే బహుశా వీళ్లు అంట్లు తోముకోడం, బట్టలు ఉతుక్కోడం, స్నానాలు చేయడం లాంటివి చేస్తారేమో అనుకున్నాను.

ఆమె మనవరాలు కాబోలు పాతికేళ్ల మ్మాయి రెండు స్టూల్సు తీసుకొచ్చి వేసింది.

"కూర్చోండి బాబూ" అంది రాజమ్మ. చేతులు వణుకుతోంటే ఒక చేతిలో మరో చేయి వేసుకుని నలుపుకుంటూ నిలబ డింది.

"ఏవన్నా గదులు ఖాళీగా ఉన్నాయా? "

"ఒక్క గది ఉంది బాబూ"

"ఏదీ చూపించు. ఈ పిల్లని ఇక్కడ ఉంచి వెళతాను" అన్నారాయన.

"రండి, చూపిస్తాను" అంటూ ఎడంపక్క చివర ఉన్న ఓ గదివైపు నడిచి తలుపు తెరి చింది. పైన రేకులుండి, చీకటిగా ఉన్న గది లోకి వెళ్లగానే ఆమె వచ్చి గోడకున్న స్విచ్ నొక్కింది. బల్బు వెలిగింది. ఒక్కటే గది. గది లోపలికి ఉన్నట్టుగా ఉంది. గచ్చు ఎర్ర మట్టితో అలికి ఉంది. ఓ మూల పంపుంది. దానిచుట్టూ సిమెంటుతో ఒక నాలుగంగుళాల ఎత్తున సిమెంటుతో గట్టులా కట్టి ఉంది. ఓ పక్కన వంట చేసు కోడానికి పొయ్యి ఉంది. ఆ పొయ్యి కూడా ఎర్రమట్టితో చేసినట్టుగా ఉంది.

ఆమె నా వైపు చూస్తూ "ఒక్కతే ఉంటుందా? " అంది ఎంతో సానుభూతిగా.

ఆయన ఆమె వైపు చూసి సైగ చేసి బైటకి వెళ్లారు. ఆమె కూడా ఆయన వెన

కాలే వెళ్లింది. గది మధ్యలో నేను నిలబడి పోయాను. పైన రేకులు చేతికి అందేంత ఎత్తులో ఉన్నాయి. గోడ మట్టిగోడలా ఉంది. నాకు భయంగా అనిపించింది. ఈ ఇంట్లో నేనుండాలా? నాకు వంట చేసు కోడం రాదు. ఎలా ఉండాలి? నాకేం తెలి యదు. ఎలా ఉండాలి?

నేనాలోచిస్తూ ఉండగానే ఆయనొక్కరు లోపలికి వచ్చారు.

ఆయన నావైపు చూస్తూ అన్నారు, "నువ్విక్కడే ఉండు. నీకు కావలసిన వంట సామాను పంపిస్తాను. వండుకు తిను. నేను అప్పుడప్పుడు వస్తుంటాను. జాగ్రత్తగా ఉండాలి తెల్సిందా? ఎవరితో ఏ విషయం మాట్లాడద్దు. వీలైనంత మటుక్కు ఎవరితో బాతాఖానీ కొట్టకుండా గడుపు.

"అలాగే. కానీ స్టేట్‌హోం...?"

"అక్కడ నువ్వుండలేవులే. ఇక్కడ బాగుం టుంది. రాజమ్మ తోడుగా ఉంటుంది. నువ్విక్కడే ఉండు. నేను వెళ్తున్నాను. వస్తాను. జాగ్రత్త" ఆయన వెళ్లిపోయారు.

ఆ ఇరుకుసందులో, ఆ చీకటి గదిలో నా జీవితం కొత్తగా ప్రారంభమైంది.

మరునాడు ముసలమ్మ నాకు అన్నం, పప్పు పంపించింది తన మనవరాలితో. రాత్రి గమనించలేదు నేను. ఆ అమ్మాయికి కుంటి, కురూపి కూడా. ఆ ముసలమ్మకి ఎవరూ లేరట. కొడుకూ, కోడలూ చచ్చిపో యారట. ఈ మనవరాలు మాత్రం ఉందిట. ఆయన ఈ ముసలమ్మకి తెలు సుట. ఎపుడో చాలాకాలం క్రితం ముసల మ్మకి ఆయనేదో సాయం చేశారుట.

"నీకు అమ్మానాన్న చచ్చిపోయారుటగా. ఎవరూ లేరటగా" అన్నదా అమ్మాయి.

నేను తలూపాను.

"పాపం పోనీలే ఇక్కడే ఉండు" అంటూ వెళ్లిపోయింది.

నేను ఆ నాలుగు గోడలమధ్యా నా కొత్త జీవితాన్ని ప్రారంభించాను. నాకిప్పుడు ఎంతో హాయిగా ఉంది. నేనున్న గది చిన్న దైనా, మట్టిగోడలున్నా, నాకదే పెద్దప్యాలె స్‌లా అనిపిస్తోంది. ఆ గదికంతటికీ నేనే మహారాణిని అనుకుంటే నా ఒళ్లు పులకిం చిపోతుంది. నాకంటూ చిన్నదైనా ఓ గదిని ఏర్పాటుచేసి ఆ నరకం నుంచి శాశ్వతంగా నాకు విముక్తిని కలిగించిన సివగారు నాకం టికి ఇప్పుడు దేవుడులా, కొండమీద ఆరోజు నేను చూసిన వెంకటేశ్వరస్వామిలా కనిపి స్తున్నారు. నాలుగు దర్వాజాలతో ఒక ముఖద్వారంతో ఉన్న ఆ పాడుబడిన ఇల్లు నాకంటికి ఎంతో అందంగా, ఆడంబరంగా కనిపిస్తోంది. నేను పడుకోడానికి ఒక ఈతా కుల చాప, రెండు కొంచెం చినిగిన దుప్పట్లు ఇచ్చింది రాజమ్మ. రెండు పాత పరికిణీలు, ఓణీలు ఇచ్చింది. నా ఒంటిమీది బట్టలు తీసి బైటపారేశాను. రాజమ్మ ఇచ్చిన బట్టలు కట్టుకున్నాను. రెండురో జులు రాజమ్మే నాకు అన్నం, పప్పు ఇచ్చింది. తిని హాయిగా నిద్రపోయాను. నేనిప్పుడు ఎంతో సుఖంగా నిద్రపోతు న్నాను. వంటరిగా నాకేం భయం అనిపిం చడంలేదు. కుంటి అమ్మాయి లక్ష్మి తోడుగా బైట మంచం వేసుకుని పడుకుం టుంది. రాజమ్మ, వాళ్ల ఇంటి తలుపులు తెరుచుకుని గుమ్మానికి అడ్డంగా నులక మంచం వేసుకుని పడుకుంటుంది. ఇంక వంటరితనం ఏం ఉంది. నాకిప్పుడు రాత్రిళ్లు ఎంతో హాయిగా నిద్రపడుతోంది. ఎందుకంటే ఇప్పుడు నా ఒళ్లు నా స్వాధీ నంలో ఉంటోంది. నన్నెవరూ ముట్టుకోడం లేదు. నా శరీరాన్ని ఇష్టం వచ్చినట్టుగా అనుభవించి రక్కి గిచ్చి కొరికి నాశనం చేసే రాక్షసులెవరూ లేరు. నా ఇష్టం వచ్చి నప్పుడు పడుకోవచ్చు. నా ఇష్టం వచ్చినట్టు ఆ గదిలో ఉండచ్చు.

నన్ను దింపినరోజే రాజమ్మకి సివగారు నా ఖర్చులకోసం డబ్బులిచ్చి వెళ్లారుట. రాజమ్మ నాకు కొన్ని వంటపాత్రలు కొని





చ్చింది. బియ్యం, పప్పులు, ఉప్పు, కారంలాంటి కొన్ని సరుకులు కొనిచ్చింది. లక్ష్మి నాకు వంట చేయడం నేర్పించింది. వంట అవగానే అన్నాలు తిని, మధ్యాహ్నం పూట లక్ష్మి, నేనూ గచ్చకాయలు ఆడుకుంటాం.

పదిరోజులు గడిచాయి.

ఒకరోజు రాత్రి అన్నం తినగానే చాపవేసుకుని పడుకున్నాను. రాజమ్మ గుమ్మంలోనే రోజూలా పడుకుంది గానీ, లక్ష్మి మాత్రం లోపల పడుకుంది. లక్ష్మి ఏది అని అడిగితే వంట్లో బాగాలేదని లోపల పడుకుందని చెప్పింది రాజమ్మ. కాబోలనుకుని నేను పడుకున్నాను. పడుకోగానే ఏ మానసికాందోళన లేకపోవడం చేతనేమో నాకు వెంటనే నిద్రపడుతోంది. ఆరోజూ అలాగే గాఢనిద్రలో వున్నాను. హటాత్తుగా అర్ధరాత్రి నామీద ఎవరో పడినట్టుగా అయి ఉలిక్కిపడిలేచాను. నన్ను లేవనీయకుండా రెండు కబంధ హస్తాలు నన్ను నొక్కిపెట్టాయి. అరవబోతే రెండు బండసెదాలు నా పెదాలను మూసేశాయి. ఇన్నాళ్ళకి మళ్ళీ ఎవరో నా శరీరాన్ని చాలా దారుణంగా కసిగా అనుభవించారు. దాదాపు గంట తరువాత ఆ మనిషి పక్కకు జరగడంతో లేచి, నా ఒంటిమీద బట్టలు కూడా సరిచేసుకోకుండా లైటువేశాను. చాపమీదా సిఐ గారు అర్ధనగ్నంగా కూర్చుని సిగరెట్ వెలిగించుకుంటున్నారు.

"మీరా? " అదిరిపడుతూ అడిగాను. ఆయన నవ్వి, "లైటార్పు... బట్టలు వేసుకో" అన్నాడు. చటుక్కున లైటు ఆర్పి, బట్టలు వేసుకుని "మీరెప్పుడు వచ్చారు" అడిగాను.

"ఎప్పుడైతే ఏంలే... హమ్మయ్య ఇన్నాళ్ళకి నాకు ఇక్కడికి రావడానికి తీరింది... వెధవ ఉద్యోగం అక్కడ దొమ్మీ. ఇక్కడ దొంగతనం, మరెక్కడో బాంబు పేలుళ్ళు... ఇదే సరిపోయింది. సర్లేగానీ నీకిక్కడ ఎట్టా ఉంది? హేపీగా ఉన్నావా? "

హేపీనా అంటే ఏవిటో నాకు తెలియదు అయినా తలూపాను.

"నీకేం ఫర్వాలేదులే రాజమ్మతో మాట్లాడాను. ఏం కావాలన్నా ఆమెనే అడుగు"

"మీరిప్పుడు రావడం రాజమ్మ చూసిందా? " అడిగాను.

"దానికి సాయంత్రమే కబురుచేశాలే వస్తానని"

రాజమ్మకి ముందే తెలుసా ఈయన వస్తారని. మరి నాకెందుకు చెప్పలేదు! ఆలోచిస్తూ ఉండిపోయాను. నాకెందుకో ఆయనలా హటాత్తుగా వచ్చి నా మీద తనకేదో సర్వహక్కులున్నట్టు నన్ను అనుభవించడం ఎలాగో అనిపిస్తోంది. ఈ పదిరోజులుగా ఆయన దేవుడనుకున్నాను. కానీ ఇవాళ ఇదేంటి. అంటే ఈ విషయంలో దేవుళ్ళు కూడా మినహాయింపు కారా!

ఆయన ఏదో మాట్లాడుతున్నారు. నాకదేం అర్థంకావడంలేదు. నేను వదిలిపోయిందనుకున్న ఆ దౌర్భాగ్యపు అనుభవం మళ్ళీ వచ్చింది. ఇదిలా సాగుతుందా? ఒక్క సిఐగారేనా. ఇంకెవరన్నా వస్తుంటారా? రాజమ్మ, దేవమ్మ లాంటిదేనా? కానీ సంసారులున్న ఈ వీధిలో రాజమ్మ లాంటివాళ్ళని ఎలా ఉండనిస్తారు? రాజమ్మ అలా కాదేమో.

ఆయన అంటున్నారు "నీకేం భయంలేదింక. నేను రోజువిడిచి రోజు వస్తుంటాను. నీకేం కావాలన్నా నన్ను అడుగు. లేదంటే రాజమ్మని అడుగు" అంటూ లేచి ప్యాంటుజేబులోంచి ఐదువందలు తీసి నాకిచ్చారు. "నీకు మంచి బట్టలు లేవుటగా. కొనుక్కో"

నాకు తీసుకోవాలనిపించలేదు. సరిగ్గా మళ్ళీ అదే పరిస్థితి. నా శరీరంతో బంతాట ఆడుకుని వెళ్ళబోయేముందు వందో రెండొందలో నాకు బక్షీష్.

"ఏంటి ఆలోచిస్తున్నావు? తీసుకో... నా ఒళ్ళో పడేశారు"



కాస్సేపు సిగరెట్ కాల్చి నుసి ఇల్లంతా వేసి లేచి "వెళ్తున్నాను. తలుపేసుకో" అన్నారు.

మర్నాడు ఉదయం రాజమ్మ నా గదికి వచ్చింది. నేనప్పటికి ఇంకా లేవలేదు. రాజమ్మ నా మీదకు వంగి, నన్ను తట్టి లేపితే ఉలిక్కిపడిలేచాను. "లేపిల్లా... ఏంది ఇంక పండుకున్నావు. లెవు" అటూ నా రెక్కపుచ్చుకుని లేవదీసింది. కింద చెల్లాచెదురుగా పడిన వందరూపాయల నోట్లవైపు చూస్తూ, "అయ్యో పైసలు దాచ నీకి రాదా" అంటూ అవన్నీ ఏరి బొత్తిగా పెట్టి నా చేతికిచ్చింది.

"అదృష్టవంతురాలివిలే. మా గిరిబాబు కన్ను నీమీద పడిందంటే నీకేం ఢోకా లేదు. నిన్ను బాగా చూసుకుంటాడు. డబ్బుకేం లోటుండదు" అంది.

"గిరిబాబెవరు? " అడిగాను.

బుగ్గలు నొక్కుకుంటూ "అదేంది పిల్లా... రాత్రంతా వాడితో పడుకుని గిరిబాబెవరు? అని అడుగుతావ్."

"ఆయన సిఐగారు కదా!"

పగలబడి నవ్వింది. "ఎంత అమాయకురాలివే. అది వాడి ఉద్యోగం. వాడికో పేరుంటదిగా. వాడమ్మ అయ్యపెట్టిన పేరు"

నేనేం మాట్లాడలేదు. ఆయన పేరు గిరిబాబన్నమాట. రోజూలాగే అన్నం తినేసి పడుకున్నాను. ఇంకా నిద్రపట్టలేదు. మామూలుగా పడుకోగానే నిద్రపట్టేది. కానీ ఆరోజు సిఐగారు వచ్చి వెళ్లిన దగ్గర్నించీ అలా నిద్రపట్టడంలేదు. నేనింకా నిద్రపోకుండానే బైట చెప్పుల చప్పుడైంది. రాజమ్మ స్వరం వినిపించింది.

"వచ్చారా బాబూ"

"బాగున్నావా రాజమ్మా" ఆయన స్వరం.

"తమరి దయ"

"ఏమంటుంది పిల్ల? "

"ఏం అనదు. గడుసుదికాదు. అమాయకురాలు"

"అందుకేగా తీసుకొచ్చా"

"మీ అండ దొరికింది. అదృష్టవంతురాలు"

"పడుకుందా? "

"లేదు... గిప్పుడే అన్నం తింది"

"సర్లే... చూసుకుంటా... బట్టలు కొనుక్కున్నదా? "

"ఏమో... ఏం చెప్పలే... పైసలు తీసి దాచింది"

"సర్లే..."

మాటలాగిపోయాయి. నేను లేవాల్సిన అవసరంలేదు. తలుపు వేయడం అంటూ ఉండదు.

నేను అలాగే చాపమీద పడుకున్నాను. కాని నిద్ర మాత్రం రాలేదు.

నా జీవితం ఏంటిలా ఉంది? అందరిలా అమ్మా, నాన్న, తమ్ముడూ మా ఇల్లు. అస్పష్టంగా ఏవో జ్ఞాపకాలు నీడల్లా అమ్మా, తేజా, నాన్నా కనిపిస్తున్నారు. అమ్మ వంట చేస్తోంటే నేను అమ్మ వెనకాల చేరి, అది కావాలి ఇది కావాలి. అదెందుకిలా చేశావు? ఇదెందుకిలా చేశావు? అని వేధించడం, నేనూ తేజా, శాంతి మేము ముగ్గురం కలిసి స్కూలుకి వెళ్లడం, ఇంటికి రాగానే హోంవర్కు చేసుకుని ఆడుకుంటూ కూర్చోడం. ఆరోజు నేను పెద్దమనిషి అయినరోజు నాకింకా గుర్తు. ఆడవాళ్లంతా వచ్చి నువ్వులు, కొబ్బరి, బెల్లం దంచడం పాటలు పాడడం. ఏవిటే నీకు అప్పుడే తాళిబొట్టుకావాలా అని అడగడం.

అయ్యో... తాళిబొట్టు నాకు పాపాయమ్మ ఇచ్చిన తాళిబొట్టు. అక్కడే ఆ వేశ్య కొంపలో మర్చిపోయాను. కాదుకాదు మర్చిపోలేదు. అన్యాయంగా పోలీసులు నన్ను స్టేషన్‌కి తీసుకెళ్లారు. అక్కడినుంచి అటే వచ్చేశాను ఇక్కడికి. ఎలా? నాకా తాళిబొట్టు కావాలి. ఎలా? నాకది తెచ్చిచ్చే వాళ్లు ఒకరే ఇప్పుడు. సిఐగారు. మళ్లీ దేవమ్మ కొంపమీద రెయిడ్‌చేసి, సామాను





తీసుకొస్తే అందులో నా పెట్టె కూడా ఉంటే... ఉంటుందా? దేవమ్మ బైటపారే సిందేమో. సిఐగారిని అడగాలి. ఎలాగైనా వెళ్ళి నా పెట్టె తెచ్చిపెట్టమని.

ఆ క్షణం నుంచీ మళ్లీ ఆయన కోసం నా నిరీక్షణ మొదలైంది.

మర్నాడు నేను స్నానంచేసి జడవేసుకుం టుంటే వచ్చింది లక్ష్మి.

"నీ జుట్టు ఎంత బాగుందో. నువ్వు చాలా అందంగా ఉంటావు. అందుకే నిన్ను గిరిబాబుగారు ఉంచుకున్నారు. నాకా అదృ ష్టంలేదు" అంది దిగులుగా.

"గిరిబాబుగారు నన్ను ఉంచుకున్నారా? అంటే" ఆశ్చర్యంగా చూశాను.

"నీకు తెలియదా?" ముసిముసిగా నవ్వింది. "అదే... రోజూ రాత్రిపూట వస్తా రుగా. నీకు బట్టలు కావాలన్నా, ఏం కావా లన్నా కొనిస్తారు. నీ తిండీ, నీళ్లు చూస్తారు. దాన్నే ఉంచుకోవడం అంటారు. అందరికీ తెలిసిపోయిందిలే"

లక్ష్మిని మరింత వివరంగా అడగాలనిపిం చింది. కానీ ఎంతగా అడిగినా అంతకన్నా వివరాలు చెప్పలేకపోయింది.

గబగబా రాజమ్మ దగ్గరకి వెళ్లి అడిగాను. "అవ్వా! ఉంచుకోడం అంటే ఏంటి?"

రాజమ్మ నవ్వింది. "ఎంత గడుసుదా నివే. ఉంపుడుగత్తెవి నీకు తెలియదా? ఉంచుకోడం అంటే ఏమిటో. గిరిబాబుని నీ వయ్యారాలతో వల్లోవేసుకున్నావు. నీకింక ఏం లోటు? తాళికట్టకపోయినా మొగు డిలా అన్ని అమరుస్తున్నాడు. అయినా ఇంక నీకు తాళెందుకులే"

గిరిబాబుగారు నాకు మొగుడా. అంటే ఎదురింటి కమలకి, పక్కింటి రాజ్యంకి, ఆ వాడలో ఉన్న అందరాడవాళ్లకీ ఉన్నట్టు నాక్కూడా మొగుడున్నాడా? మరి పిల్లలు కూడా పుడతారా? నాకు చాలా ఆనందంగా అనిపించింది. "అవ్వా నాకు పిల్లలు పుడ తారా?" అడిగాను.

గలగల నవ్వింది. "పిల్లలా? వాడు ఆప రేషన్ చేయించుకున్నాడు. ఇప్పటికే నలు గురున్నారు వాడికి. అయినా ఉంచుకున్న దానితో పిల్లల్ని కనే మగాడెవరే?" అంది.

నా ఉత్సాహం అంతా నీరుకారిపో యింది. నేను ఉంచుకున్నదానినా? నాకెం దుకో ఆ మాట చాలా కఠినంగా, భయంక రంగా వినిపిస్తోంది.

"ఎందుకుంచుకున్నారు?" అడిగాను.

రాజమ్మ మళ్ళీ నవ్వింది. "ఎందుకేంటి? నీ మీద మోజుపడ్డారు. ఉంచుకున్నాడు. ఎంతకాలం మోజుంటే అంతకాలం వస్తాడు. నిన్ను చూస్తాడు."

"ఆ తరువాత"

"రావడం మానేస్తాడు. అయినా ఎప్పటి సంగతో ఎందుకు నీకు? నీ అదృష్టం బాగుంటే చివరిదాకా ఉంటాడేమో"

నేను అన్యమనస్కంగా నా గదిలోకి వెళ్ళి పోయాను. ఉంచుకోడం అంటే ఏమిటో నాకు ఎంతగా ఆలోచించినా అర్థంకాలేదు.

ఆ రాత్రి నాకు అందమైన కల వచ్చింది. ఆ కలలో నేను పట్టుచీర కట్టుకుని, రెండు చేతులకూ నిండుగా గాజులేసుకుని, పసుపు రాసుకున్న పాదాలకు పట్టాగొలుసులు, కాలి వేళ్లకు వెండి మట్టెలు. నుదుట పెద్ద కుంకు మబొట్టు, నా పెద్ద జడ నిండా పూలమాల. నా మెడలో మిలమిల మెరుస్తున్న గొలుసు. ఆ గొలుసు చివర రూపాయి నాణెం అంత పెద్దగా, అందంగా ఉన్న మంగళసూత్రాలు రెండు, వాటి మధ్య అమ్మ మెడలోలాగా పగడాలు, నల్లపూసలు గుండెలమీద వేళ్లాడుతూ ఎంత బాగు న్నాను!

ఎప్పటినుంచో నేను కోరుకున్న మంగళ సూత్రం ఎంత బాగుంది! "ఆడవాళ్లకి ఈ మంగళసూత్రం ఉంటే చాలు. బోలెడన్ని నగలున్నట్టు" అమ్మ మాటలు గుర్తొచ్చాయి. నా దగ్గర ఇప్పుడు బోలెడన్ని నగలు న్నాయి. నేనెంత అదృష్టవంతురాలిని!



ఆ భావన పూర్తిగా రాకుండానే తెల్లవారింది. పట్టుచీర, మంగళసూత్రం, పసుపూ, కుంకుమా, పూలమాల ఏవీ కనిపించలేదు. అద్దంలో చూసుకున్నాను. నేను ఓ చవక రకం చీరలో, బాగా వాడిపారేసిన పాత వస్తువులాగా వున్నాను. నేను కలలో కనిపించిన నేను లేనిప్పుడు. ఎవరో. ఈ నేను ఎవరో! నిజంగా కలలోలాగా ఒక్కసారి తయారైతే! నాకంత అదృష్టమా? ఈ జన్మకి దక్కుతుందా?

ఒకరోజు తెల్లవారుజామునుంచే మా వాడలో ఏదో హడావిడి కనిపించింది. ఎక్కడినుంచో బ్యాండుమేళం వినిపిస్తోంది. మేళం వినగానే ఉత్సాహంగా వీధిలోకి పరిగెత్తాను. మా ఇంటికి కొంచెం దూరంగా ఉన్న ఇంటిముందు పందిరివేశారు. చాలా కుర్చీలున్నాయి. ఆ పందిరి మధ్యలో కొబ్బరి మట్టలతో అందంగా ఏదో కట్టారు. నా వెనకాలే కుంటుకుంటూ వచ్చిన లక్ష్మిని అడిగాను. "అక్కడ ఏం జరుగుతోంది లక్ష్మి" అని.

"కమలత్త కొడుకు పెండ్లి ఇవాళ" అంది.

"అలాగా పెళ్లా... మనం కూడా వెడదామా? " ఉత్సాహంగా అడిగాను.

"మనం వెళ్లకూడదు. రాజమ్మ వెడుతుంది"

"ఏం? మనం ఎందుకు వెళ్లకూడదు? "

"నేను కుంటిదాన్ని. నన్నెవరూ రానివ్వరు. నువ్వు... నువ్వు... గిరిబాబుగారి ఉంపుడుగత్తెవిగా... అక్కడంతా ముత్తైదువలు, పెళ్ళి అయిన వాళ్లు వస్తారు. నిన్ను రానివ్వరు"

"అదేంటి? నేనెందుకు వెళ్లకూడదు? ఉంపుడుగత్తె అంటే పెళ్ళాంలాంటిదటగా"

"పెళ్లానివా? అయితే నీ మెళ్లో తాళేది? తాళి లేనివాళ్లకి ఎవరూ గౌరవం ఇవ్వరు. అసలు నిన్ను మా వాడలో ఉండనిచ్చేవాళ్లు కాదు కానీ గిరిబాబుగారికి భయపడి ఉండనిస్తున్నారు. ఈ వాడలో వీళ్లంతా ఇళ్లు కట్టుకోడానికి గిరిబాబుగారు సాయం చేశారు"

"ఎలా? ఎప్పుడు చేశారు"

"అప్పుడెప్పుడో ఆయన తిరుపతి వెళ్లక ముందు హైదరాబాదులోనే ఉండేవాళ్లు. ఈ స్థలంలో వీళ్లంతా ఎప్పటినుంచో ఉంటున్నారు. ఒకసారి గుండాలు వచ్చి ఈ స్థలం మాది అని కొట్లాడారు. అప్పుడు గిరిబాబు గారే వీళ్లందరికీ సాయంచేసి స్థలం గుండాలకి పోకుండా కాపాడారు. ఆ తరువాత గవర్నమెంటునుంచి పట్టాలు కూడా ఇప్పించారు. అందుకే గిరిబాబుగారి మనిషివని నిన్ను ఇక్కడ ఉండనిచ్చారు. లేకపోతే ఎప్పుడో తన్ని తగలేసేవాళ్లు"

లక్ష్మి వెళ్ళిపోయాక కూడా ఆమె మాటలు నన్ను వెంటాడాయి. నేను ఎలాంటి కుటుంబంలో పుట్టాను! ఎలా పెరిగాను? ఏం పాపం చేశాననీ నా జీవితం ఇలా అయింది?

ఆ తరువాత గిరిబాబుగారు పదిరోజులు కనిపించలేదు. నాకు చాలా భయంవేసింది. రాజమ్మ ఓరోజు ఉదయమే అడిగింది. "గిరిబాబు వస్తలేదు. ఏమైంది? ఊరికిపోయిండా"

"నా నాకు తెలియదవ్వా" అన్నాను భయంభయంగా.

"ఏందో ఎన్నడొస్తడో పైసల్లేవు. వస్తే పైసలడిగి తీసుకో"

"అలాగే"

మర్నాడు నాకు అన్నంలోకి కూర రాలేదు. నేను వండుకున్న అన్నం పప్పువేసుకుని తిన్నాను. బియ్యం కూడా నిండుకున్నాయి. రాజవ్వకి చెప్పాను బియ్యం నిండుకున్నాయని.

"నేనేం చేయాలె పైసల్లేవు. గిరిబాబు రావాలె కదా" అంది.

అంటే ఆయన రాకపోతే ఆయన డబ్బివ్వకపోతే నాకు తిండిలేదన్నమాట. తిండి కోసం నేనిలా జీవితాంతం ఆయన చెప్పి




నట్టు వింటూ ఇలాగే బతకాలి. నేనిలా బతుకుతున్నందుకు ఆయన డబ్బిస్తున్నారు. ఆ డబ్బుతో నాకు తిండీ, బట్టా గడిచిపోతు న్నాయి. దేవమ్మనుంచి తప్పించుకుని వచ్చి బతుకుతున్న ఈ బతుక్కీ, ఆ బతుక్కీ పెద్ద తేడా ఏంలేదు. ఇక్కడ ఒకే వ్యక్తిపస్తు న్నాడు. అనుభవిస్తున్నాడు. అనుభవించి నందుకు డబ్బిస్తున్నాడు. నా పోషణ చూసుకుంటున్నాడు. అక్కడ దేవమ్మకి ఇచ్చేవాడు. ఇక్కడ రాజమ్మకి ఇస్తున్నాడు. దేవమ్మ చేస్తున్నదీ, ఇక్కడ రాజమ్మ చేసేది ఒకటే వ్యాపారం. నేను చేసిందీ అదే వ్యాపారం. అక్కడ ఎందరో అనుభవిం చారు. ఇక్కడ గిరిబాబుగారు మాత్రం అను భవించారు. అప్పుడూ వేశ్యనే. ఇప్పుడూ వేశ్యనే. కానీ ఈ వేశ్యకి మరో పేరు ఉం... ఇంక ఆలోచించలేకపోయాను. ఆలోచించ డానికి భయంవేసింది. మెడలో మంగళ సూత్రం లేకుండా నన్నెవరు అనుభవించినా అది నేను వృత్తిచేయడం కిందేలెక్క అనిపిం చింది.

నేనెందుకిలా బతకాలి? అకస్మాత్తుగా ఈ ప్రశ్న నా మనసులో ఉద్భవించింది. అవును నేనెందుకిలా బతకాలి? నా తిండీ, బట్టా గడవాలంటే నేను బతకాలంటే ఇలా మగవాడికి శరీరం అమ్ముకుని బతకాలా? పనిచేసుకుని, కష్టపడి సంపాదించుకుని నేనెందుకు బతక్కూడదు! అలా అనుకు న్నాక రాజమ్మ దగ్గరకు వెళ్ళి అడిగాను. "అవ్వా... నాకేదన్నా పనిప్పిస్తావా?"

అవ్వ చిత్రంగా చూసింది. "ఎందుకే? ఏమైంది? మంచిగ సల్లగ బతక్క ఏమైంది? గిరిబాబు వస్తున్నడుగదా" అంది.

"నాకీ బతుకు ఇష్టంలేదు. నేను పనిచేసు కుని బతుకుతాను"

రాజమ్మ నవ్వింది. ఆ నవ్వు చాలా భయంకరంగా అనిపించింది.

"ఎందుకు నవ్వుతావు?" అడిగాను.

"నీకు పనివ్వడమంటే ఆ పని తప్ప ఏ పనీ ఇయ్యరీమగోల్లు. ఆడోల్లు నిన్ను ఇంట్లకే రానియ్యరు" అంది.

ఆ మాట పదునైన కత్తిలా గుచ్చుకుంది. ఏడుస్తూ కూర్చుండిపోయాను. అంతకన్నా ఏం చేయలేను కనుక.

నాలుగు రోజులు గడిచాయి. గిరిబాబు గారి జాడలేదు. ఆ రోజే ఆఖరి గుప్పెడు బియ్యం వండుకున్నాను. పప్పులేదు, కూర లేదు, డబ్బుల్లేవు. గుప్పెడు మెతుకులు తప్ప మరేంలేవు. తూచితూచి వండుకు తింటున్నానేమో ఆకలి తీరడంలేదు. మర్నాడు నిద్రలేవగానే నీరసం ముంచుకొ స్తోంది. అలాగే నీరసంతో లేచి ఆ గుప్పెడు మెతుకులు వండుకుని రాజమ్మ దగ్గరకు వెళ్ళి అడిగాను. "అవ్వా కొంచెం కూర కావాలి"

రాజమ్మ కఠినంగా అంది. "చెప్పినకద. పైసల్లేవు. కూరలు, పప్పులు ఏడికెల్లి వస్తయి"

"ఆకలేస్తోంది..." ఏడుపు దిగమింగు కుంటూ అన్నాను.

"నేనేం చేయాలె" అంటూ చీదరింపుగా లోపలికి వెళ్ళిపోయింది. నాకు చాలా అవ మానంగా అనిపించింది. ఆఖరికి నా బతు కులో ముష్టిపర్వం మొదలైందన్నమాట అనిపించింది. మౌనంగా నా గదిలోకి వెళ్ళి పోయి ఏడుస్తూ కూర్చున్నాను. కొన్ని నిమి షాలకి బైట అడుగుల చప్పుడైంది. లక్ష్మి లోపలికి వచ్చి చెంగుచాటున దాచుకున్న చిన్న పింగాణీ కప్పు ఇస్తూ అంది. "జల్ది తిను. టమాటకూర చేసింది. తెచ్చిన"

నాకు ఏడుపొచ్చింది. లక్ష్మి నాపట్ల చూపించే ఆత్మీయత, స్నేహం నా మన సుని కదిలించివేశాయి. చటుక్కున లక్ష్మి ఒళ్లో వాలిపోయి బాగా ఏడ్చాను.

"నేను వెళ్ళిపోతాను లక్ష్మీ. ఇంకో వారం రోజులు చూస్తాను. గిరిబాబుగారు రాక పోతే వెళ్ళిపోతాను" అన్నాను.

"పోవాలి... నువ్వు పోకున్నా రాజమ్మ ఉండనియ్యదులే. పైసలేకపోతే ఉండనియ్యదు. మా అన్న పంపిస్తున్నాడు కాబట్టి నన్నుండనిస్తుంది. లేకుంటే నేను కూడా పోయేదాన్ని" అంది.

"మీ అన్న ఏం చేస్తున్నాడు"

"మా అన్న మిలట్రీలో ఉన్నాడు. రెండు నెలలకొకసారి వేయి రూపాయలు పంపిస్తుండు"

"అలాగా... అదృష్టవంతురాలివి" నిట్టూరుస్తూ అన్నాను. "నీకు అన్నయ్య ఉన్నాడు నాకెవరూ లేరు"

"నా సొంతన్నకాదు. మా పెద్దమ్మ కొడుకు. మా పెద్దమ్మ కరీంనగర్‌లో ఉంటుంది. మేమిద్దరం చిన్నప్పుడు ఒకే దగ్గర పెరిగాం. మా అమ్మానాన్నా చచ్చిపోయినంక మా పెద్దమ్మ నన్ను ఇంట్లనుంచి వెళ్లగొట్టింది. అన్ననే ఈడకు తీసుకొచ్చి పనిలో పెట్టిండు"

మా మాటలు పూర్తి అవుతుండగానే బైట నుంచి మగవాళ్ల స్వరం వినిపించింది "లక్ష్మీ" అంటూ. ఒక్కసారిగా మేమిద్దరం నిశ్శబ్దంగా అయిపోయాం. "గిరిబాబుగారు వచ్చారు" అంటూ లేవబోతుంటే లక్ష్మి అంది. "కాదు మా అన్న గొంతులాగుంది" అంటూ నెమ్మదిగా చేయి నేలకాన్చి లేచింది. కుంటుకుంటూ బైటకి వెళ్లిన లక్ష్మి స్వరంలోంచి చిన్న కేక వినిపించింది "అన్నా" అంటూ.

నేను కూడా లేచి ఆమె వెనకాలే బైటకి వెళ్లాను. అప్పటికే లక్ష్మి అతడిని కౌగలించుకుని "బాగున్నావా అన్నా" అంటోంది.

"నువ్వు బాగున్నవా చెల్లె" అడిగాడు అతను.

"బాగున్నానన్నా. ఎప్పుడొచ్చినావన్నా?" ఆప్యాయంగా అడిగింది లక్ష్మి.

"నిన్న వచ్చిన. అమ్మతానకి పోయి ఇయాలనే వస్తున్న. రాజమ్మ బాగుందా?"

ఇతనా లక్ష్మి పెద్దమ్మ కొడుకు. మిలట్రీలో పనిచేస్తున్నవాడు. పెద్దమ్మ కొడుకా? నాకూ పెద్దమ్మలు, పిన్నిలు ఉండి ఉంటే వాళ్ల పిల్లలు నన్నిలాగే చూసుకునేవాళ్లేమో! వేదనతో కూడిన ఓ ఊపిరి వెలువడింది. ఎందుకోగానీ అతను చాలా మంచివాడనిపించింది. ఆరాధనగా అతడినే చూస్తూ నిలబడ్డాను. అతను వేసుకున్న ప్యాంటు, షర్టు ఒకేలా ఉన్నాయి. పెద్దపెద్ద పూలున్నాయి. నాలుగైదు రంగులు కలిసి ఉన్నాయి. బాగా సన్నగా, పొడుగ్గా ఉన్నాడు. నల్లగా ఉన్నాడు.

అతను చటుక్కున నావైపు చూశాడు "ఈమెవరు?" అన్నాడు లక్ష్మితో.

లక్ష్మి నా దగ్గరకు వచ్చి నా చేయి పట్టుకుని "ఈమె గిరిబాబు లేడు... పోలీసాయన ఆయన మనిషి" అంది.

"అట్లనా" అన్నాడు.

"ఇప్పుడే చెప్పినకదా! మా పెద్దమ్మ కొడుకు అని వీడే నర్సిమ్మ" అంటూ చెప్పింది నాకు. నేను మౌనంగా అతడివైపు చూశాను.

"రా అన్నా స్నానం చేద్దువు" అంటూ అతడిని లక్ష్మి లోపలికి తీసికెళ్లిపోయింది. వెడుతూ, వెడుతూ అతను నా వైపు ఓసారి చూసి లక్ష్మి వెంట వెళ్లాడు.

సాయంత్రం లక్ష్మి, అతనూ కలిసి నా గదికి వచ్చారు. లక్ష్మి చేతిలో పింగాణీ కంచం ఉంది "అన్నం తిను" అంటూ ఆ కంచం నా ముందు పెట్టింది.

నేను మొహమాటంగా చూశాను. "తిను... మా అన్న పైసలిచ్చాడు. రాజమ్మ ఏమనదు" అంది.

"రాజమ్మ అన్నం పెడితే ఏమన్నా అంటదా?" అడిగాడు.

"అవునన్నా ఈ మజ్జెన గిరిబాబుసారు వస్తలేడు. పైసలేవని ఈమెని వెళ్లగొడతానంటుంది రాజమ్మ. పాపం! ఏడకిపోతది. నువ్వు చెప్పు" జాలిగా అంది.

"గట్లనా... నువ్వేం పికరుపడకు. నేనిస్తా




# ఏరిన ముత్యాలు

* రాయిలో చైతన్యం చూడగల మనం మనిషిలో చైతన్యాన్ని చూడలేకపోతున్నాం.

-సాయిబాబా

* భయాన్ని ధైర్యంతో కాదు ఆసక్తి ద్వారా జయించవచ్చు.

-జేమ్స్ స్టీఫెన్

* ఉన్నతాత్ములకు లక్ష్యం ఉంటుంది. సామాన్యులకుండేవెప్పుడూ కోరికలే.

-ఇర్వింగ్

* నిన్ను కన్న అమ్మను వదలి రాతిబొమ్మలోని అమ్మను కొలవడం వృథా.

-మీరావలి బాబా

* మనం సుఖపడుతున్నామా? లేదా? అని ఆలోచింపచేసే విరామ సమయమే మానసిక రుగ్మతలకు మూలం.

-జార్జి

* సోమరితనం వల్లకంటే కూడా చాలామంది అధిక శ్రమవల్ల కూడా ఆరోగ్యాన్ని కోల్పోతారు.

-గ్రీల్‌ఫోయిల్

* పనులను చేసేటప్పుడు పరిపక్వత మీ లక్ష్యంగా ఉంచుకోండి.

-పోర్టియస్

* ఎవరికైనా తమను కన్నవాళ్లకంటే తాము కన్నవాళ్లమీదే ఎక్కువ ప్రేమ.

-అమ్మ

* గొప్పగా చేసిన పని ఎప్పుడూ సమసిపోదు.

-చార్లెస్ డికెన్స్

* ఇతరులకు ఉపయోగపడే పనులను మీ లక్ష్యంగా పెట్టుకున్నప్పుడే మీకు నిజమైన ఆనందం లభిస్తుంది.

-సత్యసాయిబాబా

* గాయం మానుతుంది. నరికిన కొమ్మ చిగురిస్తుంది. కానీ కటువుగా పలికిన మాటవల్ల ఏర్పడిన గాయం మానదు.

-మహాభారతం

* నీటిచుక్కల వల్ల కుండ నిదానంగా నిండినట్లే జ్ఞానము, సంపద ఆర్జించాలి.

-హితోపదేశం

సేకరణ: పి.వి. రమణకుమార్

పైసలు" అన్నాడతను ఓదార్పుగా. లక్ష్మి కళ్లల్లో వెలుగు కనిపించింది. ఎందుకీ కుంటిపిల్లకి నేనంటే ఇంత అభిమానం! అని పించింది నాకు. లక్ష్మి పట్ల కృతజ్ఞతతో మనసంతా నిండిపోయింది.

"నీ పేరేంటి? " అడిగాడు నర్సిమ్మ.

"నా పేరా? " నాకు పొలమారింది. లక్ష్మి నా తల మీద చేత్తో కొడుతూ "అవును... నాక్కూడా తెలియదు. నీపేరేంటి? " అంది.

ఏం చెప్పను? నాకు తెలియనిది. జీవితాంతం నా దగ్గర సమాధానం లేనిది ఆ ఒక్క ప్రశ్నే... నేనేం చెప్పలేదు.

"ఏదో ఒక పేరుతో పిలవండి" అన్నాను.

"నీకు పేరులేదా? " అన్నాడు.

లేదన్నాను.

"సరే నేను నిన్ను చిట్టీ అంటాను సరేనా" అన్నాడు.

చిట్టీనా? అది పేరా? అడగాలనుకున్నాను. అడగలేదు. కాస్సేపు కూర్చుని వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

రాత్రి పొద్దుపోయిందాకా వాళ్ల స్వరాలు వినిపిస్తూనే ఉన్నాయి సన్నగా. వాళ్లలా బోలెడన్ని కబుర్లు చెప్పుకుంటుంటే నాకు హఠాత్తుగా నేనెంతో ఒంటరిదాన్ని అయిపోయినట్టు అనిపించింది.

ఘర్నాటి నుంచీ నర్సిమ్మతో నాకూ మంచి స్నేహం కలిసింది. నర్సిమ్మ వారం రోజులున్నాడు. ఈ ఊళ్లో ఏదో పనిమీద వచ్చాట్ట.

"నిన్ను ఆ గిరిబాబు సారు ఉంచుకున్నడంట కదా! ఎందుకొప్పుకున్నవు? " అని అడిగాడు.

"ఒప్పుకోడం ఏం ఉంది? నన్ను అడగలేదుగా"

"నీకిష్టంలేదా? "

"లేదు. నాకిష్టం లేనివి చాలా జరిగాయి.. అయినా ఆయన చెప్పినట్టు వినకపోతే నాకు తిండీ, నీళ్లు దక్కవు. పైగా ఈ ఇంట్లో నన్ను తీసుకొచ్చి ఉంచింది గిరి బాబుగారే"

"నీకూ ఆయనకి ఎట్ల పరిచయం? " అడిగాడు.

నేను చెప్పలేదు "నాకెవరూ లేరు" అన్నాను.

"పాపం నీకు అయ్యాఅమ్మా లేకుంటే తెచ్చినాడు. బద్మాష్‌గాడు. వాడికి పెండ్లి అయింది. పెండ్లాం, పిల్లలు ఉన్నారు. నువ్వు నాకన్నా చిన్నదానివికాదూ" అన్నాడు.

"ఏమో!"

"నీ వయసెంత? "

"తెలియదు"

"పాపం నీకం తెలియదు. అందుకే ఆ బద్మాష్‌గాడు నకరలు చేస్తుండు"

అలా వారం రోజులూ నా మీద తనకెంతో ప్రేమ, సానుభూతి ఉన్నట్టుగా మాట్లాడాడు.

అతను వెళ్లేరోజు నా దగ్గరకు వచ్చి అన్నాడు... "నిన్ను చూస్తుంటే బాదగుంది. నువ్వేం పికరుపడకు. నీకోసం కూడా నేను పైసలు పంపిస్త. నేనియాల పోతున్న. మల్లవస్త. వారం దినాలైనంక"

"నాకేదన్నా ఉద్యోగం చూపిస్తావా నర్సిమ్మా? " అడిగాను.

"ఉద్యోగమా? ఏం ఉద్యోగం చేస్తవు? "

"ఏదైనా నాకన్ని పనులూ వచ్చు అంట్లు కూడా తోమగలను"

"ఛీ..ఛీ నువ్వు బాసాన్లు తోమడమేంది? సినిమా ఈరోయిన్ లెక్కుంటవు. నువ్వు గసొంటి పనులు చేయద్దు. నేనియాల బొంబాయి పోతున్న మా దోస్తుతోని. మా దోస్తు దుబాయ్ పోతుండు. మల్ల వారమైనంక వస్త. వచ్చినంక ఏదన్న చేస్త. అప్పటివరకు జర అడ్జస్టుకా" అన్నాడు.

"నాకు ఉద్యోగం చూపిస్తావా? " ఆశగా అడిగాను.

"చెప్పినకద... ఏదన్న ఆలోచిస్త"

నర్సిమ్మ వెళ్లిపోయాడు. నాకు భోజనా





నికి లోటు లేకుండా చేసి వెళ్లిపోయాడు. అతను వచ్చి వెళ్లిన దగ్గర్నించీ లక్ష్మి అతని గురించే మాట్లాడడం ప్రారంభించింది. అతనెంతో మంచివాడని, చిన్నప్పుడే మిలట్రీకి వెళ్లాడని, సంవత్సరానికోసారి వస్తుంటాడని, వచ్చినపుడల్లా తనకోసం ఏమన్నా తీసుకువస్తాడని, అతనికి తను తప్ప స్వంత చెల్లెలు లేదని, నా కోసం కూడా రాజమ్మకి డబ్బులిచ్చాడు కాబట్టి అతను దేవుడని, అలా ఏదో ఒకటి మాట్లాడుతోంటే నా దృష్టిలో నర్సిమ్మ హీరో అయిపోయాడు. అతను వారం రోజుల తరవాత వచ్చి నా జీవితానికేదన్నా ఆధారం చూపిస్తాడన్న నమ్మకంతో అతని కోసం ఎదురుచూస్తూ అతని గురించిన పొగడ్తలు వింటూ కాలక్షేపం చేయసాగాను.

వారం రోజులు గడిచాయి.

చలికాలం, ఇప్పుడు రాజమ్మ కూడా లక్ష్మితోపాటు లోపల పడుకుంటోంది. ఆరోజు కూడా అలాగే పడుకుంది. నేను తలుపులు దగ్గరగా వేసుకుని పడుకున్నాను.

అప్పుడప్పుడే నిద్రపడుతోంది. హఠాత్తుగా తలుపు చప్పుడైంది. గబుక్కున లేచి కూర్చున్నాను. నర్సిమ్మ లోపలికి వచ్చాడు. నా దగ్గరగా వచ్చి రహస్యంగా చెప్పాడు "నీ బట్టలు, సామాను తీసుకుని ఎస్టీడీ బూత్ కాడికిరా. నేనక్కడ వెయిట్ చేస్తుంటా"

"ఇప్పుడా? " ఆశ్చర్యంగా చూశాను.

"అవును, లేకుంటే అందరికీ తెలుస్తది. జల్దిరా" అంటూ వచ్చినంత వేగంగా చీకట్లోకి మాయమైనాడు.

నేను ఆలోచించలేకపోయాను. నర్సిమ్మ నాకు ఉద్యోగం ఏదో చూసి ఉంటాడనిపించింది. అందుకే రమ్మంటున్నాడని గబగబా ఉన్న నాలుగు చీరలు సంచీలో పెట్టుకున్నాను. అంతకన్నా అక్కడ నాది అనే వస్తువులేవీ లేవు. నెమ్మదిగా లేచి బైటకి వచ్చాను. లక్ష్మికి చెప్పి వెళితే బాగుంటుందనిపించింది. నాకెంతో సాయం చేసి ఎంతో ఆత్మీయంగా కలిసిపోయింది. ఇన్ని రోజులనుంచీ ఎలా ఉన్నా, ఇక్కడ నాకు దాదాపు ఎనిమిది నెలల అనుబంధం పెనవేసుకుపోయింది. ఈ వాడ, ఇక్కడి మనుషులు, ఈ వాతావరణం వదిలి వెళ్లాలంటే బాధగా అనిపించింది. కానీ తప్పదు. ఇప్పుడు నర్సిమ్మ ఎంతోకొంత డబ్బిచ్చాడు కాబట్టి రాజమ్మ నన్నిక్కడ ఉండనిచ్చింది. గిరిబాబుగారైతే అయిపులేరు. ఆ రోజు తరువాత ఇంతవరకూ రాలేదు. రెండు నెలలైంది ఆయన కనిపించి. ఇంక వస్తారన్న ఆశ కూడా లేదు. రాజమ్మే అంది. "ఇంకేమొస్తడు. రాడు" అని. మరి నేనెలా బతకాలి? నేనిప్పుడు నర్సిమ్మ సాయం తీసుకోకపోతే బతకడం చాలా కష్టం.

మౌనంగానే లక్ష్మి దగ్గర వీడ్కోలు తీసుకుని బైటకి చీకట్లోకి నడిచాను. మా వాడ సందు దాటితే మరో సందు చివర ఈమధ్యే ఒక ఎస్టిడి బూతు పెట్టారు. ఒక గుడ్డి అమ్మాయి నడుపుతుంటుంది. అక్కడికి వెళ్లాలి. చీకట్లో నిర్మానుష్యంగా ఉన్న ఆ సందులోంచి మొట్టమొదటిసారిగా అడుగులు భయం, భయంగా వేస్తూ ఎలాగో బూత్ చేరాను.

నర్సిమ్మ నాకోసం ఎదురుచూస్తున్నాడు. అసలే నల్లటి మనిషి. చీకట్లో కనిపించలేదు. అతడే నన్ను చూసి దగ్గరగా వచ్చి "దా జల్దీ ఆటో ఉంది" అంటూ రోడ్డుమీదకు నడిచాడు. పది అడుగులు వేసి రోడ్డు మీదకు వచ్చాక ఆటో కనిపించింది. ఆటోలో కూర్చున్నాక అడిగాను "ఎక్కడికి వెడుతున్నాం నర్సిమ్మా? "

"మా దోస్తు రూం కాలీ చేసిండు. ఓల్డ్ సిటల. మనం ఆడ కొన్ని దినాలున్నంక, ఏడికన్న పోదం" అన్నాడు.

"నాకేదన్నా ఉద్యోగం చూశావా? "

నవ్వాడు, చీకట్లో ఆ నిశ్శబ్దంలో ఆ నవ్వు విచిత్రంగా ధ్వనించింది. "ఏం పని చేస్తవు? నీతోని పనిచేయిస్తనా? నిన్ను నేను పెండ్లి చేసుకుంటా"

అదిరిపడ్డాను. "కానీ ఎలా? పెళ్లి ఎలా చేసుకుంటావు నర్సిమ్మా? "

"ఎట్ల ఏంది? తాళికడత. పెండ్లాంని చేసుకుంట"

'తాళికడతా' నా ఒళ్లంతా ఆ మాటతో పులకరించింది. "నిజంగానా... నిజంగా నువ్వు నా మెడలో తాళి కడతావా? " అడిగాను.

"అరె కడతనన్నకదా"

చాలు కోరకుండా నా మెడలో తాళికడతానంటున్నాడు. ఒక్కసారిగా నాకు వచ్చిన కల గుర్తొచ్చింది. పట్టుచీర, పసుపుపాదాలు, వేళ్లకు మట్టెలు, మెడలో పసుపుతాడు, గుండెలమీద వేళ్లాడే మంగళసూత్రాలు. ఆ క్షణంలో అతని రూపం కానీ అతని యాసకానీ నాకేదీ కూడా అభ్యంతరకరంగా గానీ అయిష్టంగా గానీ అనిపించలేదు. తాళి కడతా అన్న పదం మాత్రం పెళ్లిమంత్రంలాగా చెవుల్లో పదేపదే మోగసాగింది.

ఆటో చాలా దూరం ప్రయాణించింది.

పాతబస్తీలో ఓ సందులోకి తీసికెళ్లాడు. చిన్న ఇనపగేటుంది. ఆటో దిగి, డబ్బులిచ్చి గేటు తోసి "రా లోపలికి" అన్నాడు. తడబడే అడుగుల్తో లోపలకి నడిచాను. అంతా మట్టితో అలికి గట్టిగా ఉంది గచ్చు. చల్లగా ఉంది. చీకట్లో తెల్లటి ముగ్గులు చిత్రంగా మెరుస్తున్నాయి. నాలుగైదు తలుపులు వరసగా ఉన్నాయి. అన్నీ మూసుకుని ఉన్నాయి. కుడిచేతి పక్క కాంపౌండ్‌వాల్‌కి దగ్గరగా ఉన్న తలుపు దగ్గరకి నడిచి జేబులోంచి తాళం చెవి తీసి తాళం తీశాడు. లోపలికి నడిచి లైటు వేసి "రా లోపలికి" అన్నాడు.

"ఎవరిది ఈ ఇల్లు? " అడిగాను. అంతా కలయచూస్తూ.

"దుబాయ్ పోలే మా దోస్తు, వాడిదే. వాడు వచ్చిందాకా మనం ఇక్కడ ఉండచ్చు" అన్నాడు తలుపేసి.

ఒకటే గది ఒక ఇనపమంచం ఉంది. దానిమీద పరుపు, దుప్పటి పరిచి ఉన్నాయి. రెండు దుప్పట్లు కాళ్ల దగ్గర పెట్టి ఉన్నాయి. రెండు దిండ్లు కూడా ఉన్నాయి. వాటి గలీబులు మాసి నూనె కంపు కొడుతున్నాయి. ఓ మూల ఓ చెక్క టేబుల్ ఉంది. ఆ టేబుల్‌మీద కిరోసిన్ స్టవ్, కొన్ని వంటపాత్రలు ఉన్నాయి. గూట్లో కొన్ని సత్తుడబ్బాలున్నాయి. ఓ అరలో పాత న్యూస్‌పేపర్లున్నాయి.

"అన్నం తిన్నావుకదా" అడిగాడు చొక్కా విప్పి మేకుకి తగిలిస్తూ.

"తిన్నాను"

"ఇంక పండుకో" అన్నాడు లైటార్పి మంచంమీద వాలుతూ.

"ఎక్కడ పడుకోను? " అడిగాను బిడియంగా.

"ఇంకేడ. ఈడనే" అంటూ నా చేయిపట్టి బలంగా తన పక్కకి లాక్కున్నాడు.

"పెళ్లిచేసుకుందాం అన్నావుగా నర్సిమ్మా"

"చేసుకుందాం, కాదన్ననా? "

"మరి పెళ్లి చేసుకున్నాకే కలుసుకోవచ్చుగా" అతని చేతులు ఎక్కడెక్కడో స్పృశిస్తుంటే కంపరంగా అన్నాను.

"పెండ్లి చేసుకునేటోల్లం పండుకుంటే తప్పేముంది? తెల్లారినంక చేసుకుంట" అన్నాడు నా శరీరాన్ని ఆక్రమించుకుంటూ.

తెల్లవారి లేస్తూనే నర్సిమ్మ బైటకి వెళ్లాడు. నేను ఆ గదినానుకుని ఉన్న బాత్‌రూంలోకి వెళ్లి స్నానం చేశాను. కాస్సేపటికి నర్సిమ్మ రెండు కిలోల బియ్యం, కందిపప్పు, కొంచెం పోపుసామాను, ఉప్పు, కారం తెచ్చాడు. వాటితో వంట చేయమన్నాడు.

అలాగే చేశాను. భోజనం చేశాక "సాయంత్రం వస్తా. జాగ్రత్తగా ఉండు" అని చెప్పి బైటకి వెళ్లిపోయాడు.

తలుపులు వేసుకుని కిటికీలోంచి కనిపిస్తోన్న జనాన్ని చూస్తూ ఆ నాలుగు గోడల





మధ్యా కూర్చుండిపోయాను.

ఆడవాళ్లు, మగవాళ్లు అందరూ హడావుడిగా తిరుగుతున్నారు. ఇద్దరు, ముగ్గురు పిల్లలు కూడా కనిపించారు. ఏవో పనులు చేసుకుంటూ ఇద్దరు, ముగ్గురు ఆడవాళ్లు వాకిట్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్లందరినీ చూస్తుంటే ఇది మంచి కుటుంబాలవాళ్లుండే ఏరియాలా అనిపించింది. తలుపులు తీసుకుని బైటకి వెళ్లి వాళ్లతో మాట్లాడాలన్న కోరిక బలవంతంగా అణచుకుని నర్సిమ్మ వచ్చిందాకా అలాగే కూర్చున్నాను. రాత్రి పొద్దుపోయాక వచ్చాడు. అతను రాగానే బ్రాందీవాసన గుప్పుమంది. వస్తూనే "అన్నం పెట్టు" అంటూ త్వరపెట్టాడు. ఇద్దరం కలిసి అన్నం తిన్నాం. మామూలుగా తన స్వంత భార్యనే అనుభవిస్తున్నంత దర్జాగా నామీద పడ్డాడు. ఎంతగా వారించాలన్నా నాకు సాధ్యం కాలేదు.

అరగంట తరవాత లేచి కూర్చుని అన్నాను. "దయచేసి పెళ్లి చేసుకో నర్సిమ్మా. నాకీ జీవితం అంటే భయంగా ఉంది"

"అరే చేసుకుంట అన్నకదా"

"ఎప్పుడు? "

"ఎప్పుడంటే ఏం చెప్పాలె. తాళి కొనాలె కదా"

"త్వరగా కొనచ్చుగా"

"పైసలొద్దా? వాటి గురించే పనికిపోతున్న. జీతం వచ్చినంక కొంట. నేనేమన్నా పారిపోతున్ననా" అన్నాడు.

ఎక్కువగా విసిగిస్తే ఏమంటాడో అని భయంవేసి మాట్లాడకుండా ఊరుకున్నాను.

పదిరోజులు గడిచాయి. నర్సిమ్మ పెళ్లిచేసుకోలేదు కానీ నన్ను పెళ్లాంలా చూసుకుంటున్నాడు. వంటచేయమని చెప్పడం, సేవలు చేయించుకోడం, గదమాయించడం, విసుక్కోడం వగైరా. నామీద తనకు సర్వ హక్కులున్నట్టు ప్రవర్తిస్తున్నాడు. ప్రతి రోజూ తాళి కట్టమని అడుగుతూనే ఉన్నాను. కడతా, కడతా అంటూనే ఉన్నాడు. ఉదయమే అన్నం తిని వెళ్లిపోతాడు. రాత్రి పొద్దుపోయాక వస్తాడు. రోజూ తాగుతాడు. అతను ఎక్కడికి వెడుతున్నాడో, ఏం ఉద్యోగం చేస్తున్నాడో నాకేం తెలియదు. అడిగితే కసురుకున్నాడు. నేను మాత్రం ఆ గదిగోడల మధ్య, మూసి ఉన్న తలుపుల వెనక సూర్యచంద్రులను కూడా చూసే అవకాశం లేకుండా ఆ గదిలో మగ్గిపోసాగాను.

ఆ ఇంటికి వచ్చి నెల రోజులైంది. ఈ నెల రోజుల్లో నర్సిమ్మ పదిరోజులు రాత్రి పూట ఇంటికి రాలేదు. బిక్కుబిక్కుమంటూ అలాగే ఆ గదిలో కూర్చుని, చీకట్లోకి కళ్లు చికిలించి ఎదురుచూస్తూ కూర్చుంటే తెల్లవారిపోయేది. తెల్లవారాక వచ్చేవాడు. "ఎక్కడికెళ్లావు నర్సిమ్మా. ఒంటరిగా ఉండడానికి నాకు భయం వేసింది" అన్నాను మొదటిరోజు.

"ఎందుకు? రాజమ్మ దగ్గర ఉన్నప్పుడు నీతోని ఎవరుండె? గప్పుడు నువ్వు ఒంటరిగా లేవా? " అన్నాడు.

"అప్పుడు లక్ష్మి స్నేహం ఉండేది" అనాలనుకున్నాను కానీ నాకా అవకాశం ఇవ్వలేదతను. మరెప్పుడూ అది కూడా అడగలేదు.

వంటరితనం నెమ్మదిగా అలవాటు అవుతోంది. అప్పుడప్పుడు మాత్రం నేను కేవలం గేటు బైటకి వెళతాను. అది కూడా వీధిలోకి ఆకుకూరలు వస్తే కొనడానికి. అప్పుడు చుట్టుపక్కల వాళ్లంతా నావైపు అనుమానంగా చూస్తుంటారు. వాళ్ల చూపులు భరించలేక తలవంచుకుని భూమిలోకి కుంచించుకుపోతూ లోపలికి వెళ్లిపోతాను.

"అసలా ఇంట్లో ఉండే హనుమాన్లు ఎక్కడికెళ్లాడో. వీడు వాడి ఫ్రెండట"

ఆరోజు రాత్రి పక్కన చేరి ఆబగా నామీదికి పాకిన నర్సిమ్మను అడిగాను.

"పెళ్లెప్పుడు చేసుకుందాం"

"అరె ఏంది పెల్లంటూ పరేశాను చేస్తున్నవు. ఇప్పుడేమైంది ఇట్లుంటే" అన్నాడు విసుగ్గా.

"కాదు నర్సిమ్మా. నా మెడలో తాళిలేకపోతే నాకెవరూ గౌరవం ఇవ్వరు" బాధగా అన్నాను.

"మంచిది పెల్లంటే తాలి కట్టుడుకదా! పొద్దుగాల తెస్త" అంటూ ఆక్రమించుకున్నాడు.

మర్నాడు ఉదయం నిద్రలేవగానే మళ్లీ అడిగాను. "ఇవాళ తాళి కడతానన్నావుగా. త్వరగా కట్టు. కట్టి బైటకి వెళ్లు"

"మంచిది తెస్త" అంటూ బైటకి వెళ్లాడు.

ఓ గంట తరవాత వచ్చాడు. జేబులోంచి పసుపు తాడుకి కట్టిన రెండు మంగళసూత్రాలు తీసి, "ఇక్కడికి రా" అంటూ నా చేయి పట్టుకుని దగ్గరకు లాక్కుని చేతుల్లో బంధించి నా మెడలో ముళ్లు వేశాడు. ఎన్ని ముళ్లు వేశాడోకానీ అతనలా బలంగా పట్టుకుని కడుతోంటే ఎందుకో ఉక్కిరిబిక్కిరి అయినట్టు ఊపిరాడనట్టు అయింది.

ఎక్కువసేపు అలా ఉండలేకపోయాను. నెమ్మదిగా విడిపించుకుని నా గుండెలమీద వేళ్లాడుతున్న ఆ తాళిబొట్లని మురిపెంగా చూసుకున్నాను.

"ఏదన్నా గుళ్లో కడితే బాగుండేది నర్సిమ్మా! ఇలా పద్ధతికాదు. దేవుడి ముందు కడితే మనకి ఆ దేవుడి ఆశీర్వాదం ఉంటుంది" అన్నాను.

"ఏంకాదు. ఇంట్లో కడితే ఏంది? గుల్ల కడితే ఏంది? దేవుడు ఏడనైనా ఉంటడు. నీలో లేడా? నాలో లేడా? మన మనసుల్ల ఉంటడు" అన్నాడు.

నిజమే కాబోలనుకున్నా.

ఆ క్షణం నుంచీ నాలో నాకే తెలియని చిత్రమైన మార్పు వచ్చింది. బైటకి వెళ్లడానికి కొంచెం ధైర్యం వచ్చింది. ఇప్పుడు చుట్టుపక్కల వాళ్లంతా నన్ను ఏమడిగినా సమాధానం చెప్పడానికి సిద్ధంగా ఉన్నాను.

"నీపేరేంటి? "

"చిట్టి"

"మీ ఆయన పేరు? "

"నర్సిమ్మ"

"మీ నాన్న పేరు"

"భాస్కర్"

"అమ్మ పేరు"

"నిర్మల... తమ్ముడు తేజ, లేరు యాక్సిడెంటులో పోయారు" ఇలా ప్రశ్నలు, సమాధానాలు నాలో నేనే వేసుకుంటూ మానసికంగా ప్రశ్నల బాణాలను ఎదుర్కోడానికి తయారయాను.

కూరలు కొనడానికి బైటకి వెళ్లినప్పుడు ఇదివరకులా తల భూమిలోకి వంచుకుని కాకుండా కొద్దిగా తలెత్తుకుని వస్తున్నాను.

నా మెడలో బరువుగా వేళ్లాడుతున్న ఆ రెండు మంగళసూత్రాలు పవిటమీదకు వేసుకుని అందరికీ కనిపించేలా తిరగసాగాను.

ఎవరన్నా నన్ను పలకరిస్తే బాగుండు అని ఎదురుచూస్తుండగా ఓ రోజు ఆ అవకాశం లభించింది.

ఎన్నడూ లేనిది పక్కింటి గౌరి పలకరిస్తూ, "మీ ఆయన ఏం చేస్తాడు? " అని అడిగింది ఒకరోజు.

"మా ఆయనా? " నా అణువణువూ పులకించిపోయింది ఆ మాటతో. "మా ఆయన. అంటే నర్సిమ్మ. నా భర్త..." నా కళ్లల్లోకి వెలుగు పాకొచ్చింది. "మా ఆయన... ఆయన" అంటూ తడబడ్డాను. నేను చాలా ప్రశ్నలు వేసుకున్నాను. సమాధానాలు కూడా రెడీగా పెట్టుకున్నాను. కానీ ఈ ప్రశ్న నాకు తోచలేదు. అందుకే సమాధానం కూడా తోచలేదు. మాటలు కూడదీసుకుంటూ చెప్పాను "ఉద్యోగం"

"ఏం ఉద్యోగం? "

ఏం ఉద్యోగం? అవును ఏం ఉద్యోగం?





నాకు తెలిస్తేగా... నేనెప్పుడూ అడగలేదు.
"నా... నాకు తెలియదు"

"అదేంటి? తెలియకపోవడం ఏంటి? మీరు మీ పెద్దవాళ్లకి చెప్పి పెళ్ళి చేసుకున్నారా?"

"పె... పెద్దవాళ్లా... అంటే అమ్మా, నాన్నా...లేరు..."

"ఎందుకని?"

నేనక్కడ నిలబడలేక పారిపోయి ఇంట్లోకి వచ్చిపడ్డాను.

ఇదేంటి? నేను అనుకున్న ప్రశ్నలు వేరు. ఈ ప్రశ్నలకి నా దగ్గర సమాధానం లేదు.

ఆ రాత్రి నర్శిమ్మను అడిగాను. "నర్శిమ్మా... నువ్వు ఏం ఉద్యోగం చేస్తున్నావు?"

విచిత్రంగా చూశాడు. నేనేదో అడగకూడని ప్రశ్న వేసినట్టు చూశాడు. "ఏంది? నా ఉద్యోగం ముచ్చట కావాల్నా నీకు? నీకెందుకే?" అన్నాడు.

"ఎందుకే... ఇదేం పిలుపు? నర్శిమ్మ కూడా ఇలాగే పిలుస్తాడా? దేవమ్మలాగా, దేవమ్మ కొంపకి వచ్చే విటుల్లాగా. కళ్లు పెద్దవి చేసి అలా చూస్తుంటే, "ఏం గట్ల చూస్తున్నావు... రా, రా నిద్దరొస్తుంది" అంటూ ఆక్రమించుకున్నాడు.

రెండురోజులు నర్శిమ్మ ఇంటికి రాలేదు. అలవాటైపోయిందేమో నేను అతని కోసం ఎదురుచూడలేదు. నాలుగు మెతుకులు తిని పడుకున్నాను.

రాత్రి పది అవుతుండగా తలుపు చప్పుడైంది. నర్శిమ్మ వచ్చినట్టున్నాడు అనుకుంటూ తలుపు తీశాను.

ఎవరో అపరిచిత వ్యక్తి... తలుపు తీయగానే లోపలికి వచ్చాడు.

"ఎవరు మీరు?" ఆశ్చర్యంగా అడిగాను.

"నువ్వు నర్శిమ్మతో ఉంటున్నావా ఇక్కడ" అడిగాడు.

"నేను నర్శిమ్మ భార్యను" బలహీనంగా అన్నాను.

అతను నవ్వాడు. చిత్రంగా నవ్వాడు. "మంచిది ఈ ఇల్లు నాది. నర్శిమ్మ కొన్ని రోజులకోసం అడిగితే ఇచ్చాను. నేను ఊళ్లో లేనుకదా అని"

నా గుండె గుభేలు మంది. ఇతను వచ్చేశాడు. ఇంక ఈ ఇంట్లో ఉండలేం. ఎలా? అనుకున్నంతా అయింది. ఇప్పుడు తప్పనిసరిగా వెళ్ళిపోవాలి. ఎలా? వంటరిగానా? నర్శిమ్మతోటా?

భయం భయంగా అన్నాను. "నర్శిమ్మ ఇంకా రాలేదు. వచ్చాక వెళ్ళిపోతాం"

"ఎందుకు పోవడం? నేను ఊరినుంచి వస్తున్నా..."

కొద్దిగా ఊపిరి పీల్చుకున్నాను.

అతను సూట్‌కేసు మంచంకింద పెట్టి, బాత్‌రూంలోకి వెళ్ళిపోయాడు. నేను దుప్పటి తీసుకుని నేలమీద వేసుకుని ముడుచుకుని కూర్చున్నాను. అక్కడ ఎలా ఉండాలో అర్థం కాలేదు. అతని ఇల్లు అతనొచ్చాడు. నేను వెళ్ళిపోవాలి. కానీ ఎలా? నర్శిమ్మ ఇంకా ఇంటికి రాలేదు. అతనికి అన్నం వండిపెట్టాలా? ఇంట్లో బియ్యం లేవు. ఏం లేవు. అతను ఏమీ అడగలేదు. తనపని చేసుకుని, బీరువా తెరిచి బట్టలు తీసుకున్నాడు. పైజమా, లాల్చీ వేసుకుని మంచంమీద కూర్చుని సిగరెట్ కాల్చుకున్నాడు. నేనలాగే కూర్చున్నాను. పడుకోవాలంటే భయంగా ఉంది. బైటికి వెళ్లాలంటే భయం. ఎలా? ఈ అపరిచిత వ్యక్తితో ఈ ఒక్క గదిలో నేను ఎలా? ఇతను అతనేనా?

చీకట్లోంచి అతని స్వరం వినిపించింది. "నర్శిమ్మ రాత్రిళ్లు ఇంటికి వస్తున్నాడా?"

"ఆ వస్తున్నాడు" నెమ్మదిగా చెప్పాను సమాధానం.

"వస్తున్నాడా?" రెట్టించాడు అతను.

"ఆ..."

"రోజూ వస్తున్నాడా?"

"ఆ..."

"మీరిక్కడికి వచ్చి ఎన్ని రోజులైంది?"

లెక్కలు వేసుకుంటూ చెప్పాను. "రెండు నెలలు అవుతోందేమో..."

"అబ్బా...నిన్ను రెండు నెలలు..." ఆగి పోయాడు. బైట తలుపు చప్పుడైంది. హమ్మయ్య. నిశ్చింతగా అనిపించింది నాకు. గభాల్న లేచి తలుపు తీశాను. నర్శిమ్మ ఏదో పాట పాడుకుంటూ లోపలికి వచ్చాడు. అతను లోపలికి రాగానే గుప్పు మంది. పైట చెంగు ముక్కుకి అడ్డం పెట్టు కుని పక్కకి తప్పుకున్నాను"

"నర్శిమ్మ వస్తూనే మంచానికి అడ్డంపడి ఏదో వాగుతూ, పాటలు పాడుకుంటూ నిద్రపోయాడు.

తాగి ఒళ్లు తెలియకుండా పడుకున్న నర్శి మ్మను చూస్తుంటే నాకు చాలా భయం వేసింది. నావైపు జాలిగా చూస్తూ "పడుకో" అన్నాడతను కూడా మంచంమీద ఓ పక్కకి పడుకుని లైటార్పుతూ.

నేను అలాగే నేలమీద పాతచీర ఒకటి వేసుకుని బిక్కుబిక్కుమంటూ పడుకు న్నాను. తెల్లవారితే ఆశ్రయం ఉండదన్న వాస్తవాన్ని జీర్ణించుకోవడానికి ప్రయత్నిస్తూ ఆశ్రయం వెతుక్కోడానికి మేం ఏ ప్రయ త్నాలు చేయాలో ఆలోచిస్తూండగా ఎప్ప టికో నిద్రపట్టింది.

ఎవరో నన్ను కాలితో తన్నుతున్నారు. "పండుకుంటే నీ బాబొచ్చి వండుతాడా లెగు" అంటూ బూతులు తిడుతున్నాడు. చటుక్కున లేచాను. ఎదురుగా నర్శిమ్మ.

"ఏంది గట్ల పండుకున్నవు? మా దోస్త్ ఒచ్చిండు దుబాయ్‌కెల్లి... అన్నమొండు లెవ్వు..." అన్నాడు.

రాత్రి బాగా పొద్దుపోయి పడుకున్నందు కేమో కళ్లు ఓ పట్టాన తెరిపిడి పడడంలేదు. రెప్ప తెరిస్తే మంటలు వస్తున్నాయి. బల వంతంగా కళ్లు తెరిచి చూశాను. ఇద్దరూ మంచంమీద లుంగీలు కట్టుకుని కూర్చు న్నారు. అప్పుడుగానీ, రాత్రి ఏం జరిగిందో నాకర్థం కాలేదు.

లేచి బాత్‌రూంలోకి వెళ్లి చల్లటి నీళ్లతో కళ్లు, మొహం కడుక్కుని వచ్చాను. కిరోసిన్ స్టవ్ వెలిగించి టీ డికాషన్ పెట్టాను. నర్శిమ్మ పాలు లేకపోతే టీడికాషన్ తాగే స్తాడు.

అన్నం వండుదామని బియ్యం కోసం చూస్తే డబ్బా ఖాళీగా ఉంది. ఏంచేయాలో తోచలేదు. నర్శిమ్మవైపు చూశాను. సీరియ స్‌గా తన స్నేహితుడితో కబుర్లు చెప్తు న్నాడు. వాళ్లిద్దరూ నా ముందే కూర్చుని ఏవేవో మాట్లాడుకుంటున్నారు.

అతను దుబాయ్‌లో ఉన్నకాలంలో ఎంత డబ్బు సంపాదించాడో వివరంగా చెప్తు న్నాడు. రూం ఖాళీ చేస్తున్నాట్ట. పర్మినెం ట్‌గా దుబాయ్ వెళ్లిపోతున్నాట్ట. సామాను తీసికెళ్లిపోదామని వచ్చాను అన్నాడు. నర్శిమ్మ తెగ ఆశ్చర్యపోతూ వింటున్నాడు. "ఏందీ... గంత పైస కమాయించినావు. ఏం నౌకరీ చేస్తున్నవన్న అరే నాకుబీ చెప్ప రాదు. నేనొస్త. ఈడ నౌకరీ దొరకనీకి కష్ట మైతున్నది" అన్నాడు.

"దుబాయ్ వెళ్లడం అంటే జనగామ పోవడం కాదు. చాలా కష్టం" అన్నాడు అతను.

నేను నెమ్మదిగా నర్శిమ్మను దగ్గరకు పిలిచి చెప్పాను. "బియ్యం లేవు"

"లేవా? లేకుంటే నేనేం చేయాలి?"

"తీసుకురా... అన్నం వండాలికదా" అన్నాను.

"పైసలేడికెల్లొస్తయి"

నేనేం మాట్లాడలేదు. నర్శిమ్మ వెనక్కి తిరిగి అతని దగ్గరకు వెళ్లి "అన్నా! పైసలే మన్న ఇయ్యే" అన్నాడు.

అతను కొక్కానికి తగిలించిన ప్యాంటు తీసి, జేబులోంచి నోట్లకట్ట తీసి, "ఎంత కావాలి?" అన్నాడు నావైపు చూస్తూ. నేనేం మాట్లాడకుండా తలతిప్పేసుకున్నాను. అత





# ఏరినముత్యాలు

* మనం మన భాషలో మాట్లాడే అతి చిన్న విలువైన పదాలు అవును, కాదు.

— సర్వేపల్లి రాధాకృష్ణన్

* మంచి నిర్ణయం ప్రతిఫలమే విజయం. అనుభవం ప్రతిఫలమే మంచి నిర్ణయం. కానీ ఒక చెడు నిర్ణయం ప్రతిఫలమే అనుభవం.

— ఓ.వెర్‌బరీ

* నిత్యం సంతోషంగా ఉండాలంటే నువ్వు విన్న విషయాలను అన్నిటినీ నమ్మకు, నువ్వు కోరుకున్న కోరికలను తీర్చుకోకు! నీకు తెలిసిన సంగతులన్నీ ఇతరులకు చెప్పకు. నీకు ఉన్న వాటిని అన్నిటినీ ఉపయోగించకు.

— గోరాస్

* మనిషికన్నా కుక్కలు గొప్పవి. అవి మనిషి తెలివితేటలు మాత్రమే నేర్చుకుని, అతని పాడుబుద్ధుల్ని, స్వార్థాన్ని మాత్రం నేర్చుకోవు.

— లారెల్

* సుఖజీవితాన్ని పొందాలంటే రోజూ మంచి పుస్తకాలను చదవడం, నిజమైన స్నేహితులతో కలిసిమెలిసి సంచరించడం, హాయిగా నిద్రపోగలగడం.

— మార్క్ ట్వైన్

* భాష భావాలకు దుస్తులు లాంటిది.

— బైనాసామెత

* మార్పు చేయకూడని చట్టమంటూ లేదు. వివేకం, విజ్ఞానం చట్టానికి ప్రాతిపదిక.

— నెహ్రూ

* యుద్ధం ఖరీదైనది. ప్రేమ మాత్రమే చవక.

— పెరల్‌బుక్

* అతిముఖ్యమైన విషయాలలో అనుమానం వచ్చినపుడు ఆడవారి సలహా తీసుకోవడం ఉత్తమం. వారు హృదయంతో ఆలోచిస్తారు.

— రోగల్స్

* ఓర్పు అన్నిటికీ మూలం. గుడ్డు పొదిగినప్పుడే కోడిపిల్ల వస్తుంది. కానీ బద్దలు చేయడంవల్లకాదు.

— అర్నాల్డ్‌గ్లాసగో

సేకరణ: పట్నం శేషంశెట్టి

నలా నావైపు డబ్బు చూపిస్తూ అలా అడిగితే నాకెలాగో అనిపించింది. దేవమ్మ కొంపకొచ్చి వెళ్లే విటులు గుర్తొచ్చారు.

నర్శిమ్మ ఆ నోట్ల కట్టలవైపు ఆశగా చూస్తూ అన్నాడు. "ఇయ్యరాదే ఎంతనో గంత..."

అతను కొన్ని నోట్లు తీసి నర్శిమ్మ చేతికిచ్చాడు.

కొన్ని క్షణాల తర్వాత ఇద్దరూ కలిసి బైటకి వెళ్లారు. గంట తర్వాత రెండు కిలోల బియ్యం, స్వీటు పాకెట్టు, మిక్చర్ తీసుకుని వచ్చారు.

అన్నం, పప్పు వండాను. వాళ్లిద్దరూ అన్నంతోపాటు స్వీటు, మిక్చర్ తిని బైటకి వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లాక హాయిగా ఊపిరి పీల్చుకున్నాను. హమ్మయ్య రూం ఖాళీ చేయనవసరంలేదు. రోడ్డున పడనవసరం లేదు. అలా అనుకున్నాక మనసు తేలికైంది. ఈ కాస్త గూడా పోతే నా బతుకు ఏమవుతుందోనన్న దిగులు నా గుండెనిండా నిండిపోయి రాత్రంతా నిద్ర పట్టలేదు. ఏదైతే ఏం ఇప్పుడు అతను తిరిగి దుబాయ్ వెళ్లిపోతున్నాడన్న సంగతి నాకెంతో శాంతినిచ్చింది.

వాళ్లు తిని వెళ్లాక మిగిలిన అన్నం, పప్పు తినేసి రాత్రంతా నిద్ర లేకపోవడంతో వెంటనే పడుకున్నాను. మంచి నిద్ర పట్టింది. తలుపు చప్పుడవడంతో లేచాను.

నర్శిమ్మ, స్నేహితుడు ఇద్దరూ లోపలికి వచ్చారు. వాళ్ల చేతుల్లో ఏదో కవర్ ఉంది. వస్తూనే మంచంమీద తిష్ట వేసుకుని కూర్చుని కవర్‌లోంచి రెండు బాటిల్స్ తీశారు. ఏవో తినుబండారాలు తీశారు. చిప్స్, మిక్చర్, ఇంకా ఏవో ఉన్నాయి. నాకు అర్థమైపోయింది. వాళ్లిప్పుడు ఇక్కడ కూర్చుని తాగుతారు కాబోలు. ఒక్కసారిగా ఒళ్లంతా జలదరించింది. అక్కడినించి వెళ్లి కూర్చోవడానికి మరో గది లేదు. ఎలా? ఎక్కడికి వెళ్లాలి? నేను ఆలోచిస్తూ ఉండగానే "ఏంది గట్ల నిలబడ్డవు? గిలాసులు తేపో" అన్నాడు నర్శిమ్మ గదమాయిస్తూ.

పక్కనే టేబుల్‌మీద పెట్టిన రెండు స్టీలు గ్లాసులు తీసుకొచ్చి ఇచ్చాను.

"కూసో" అన్నాడు నర్శిమ్మ.

నేనేం మాట్లాడలేదు. నాకు తెలుసు... ఈ కార్యక్రమం తర్వాత ఏం జరగబోతోందో. భగవంతుడా! మళ్లీ నాకో అగ్ని పరీక్షా? ఎంతకాలం ఇలా? ఈ పరీక్షలతో ఈ చిత్రహింసలతో బతికేకన్నా చచ్చిపోతే ఎంత బాగుంటుంది? అవును నాకింత కాలం ఈ ఆలోచన ఎందుకు రాలేదు? బతకడానికి నాకు ఎవరో ఒకరి తోడు కావాలి. చావడానికి ఏమీ అవసరం లేదే. నర్శిమ్మ బయటకి వెళ్లగానే వెళ్లిపోయి ఏ రైలుకిందో తలపెట్టచ్చు ఏ చెరువులోనో దూకేయచ్చు అవును చచ్చిపోవచ్చుగా. అమ్మా, నాన్న, తేజ అందరూ ఉన్న చోటుకి వెళ్లిపోవచ్చు

"ఏయ్! ఏంది గట్ల నిలబడినవు. దా" అన్నాడు గదమాయిస్తూ నర్శిమ్మ.

ఉలిక్కిపడ్డాను. అప్పటికే వాళ్లిద్దరూ రెండు రౌండ్లు పూర్తి చేశారు. మళ్లీ గ్లాసులు నింపుతున్నాడు నర్శిమ్మ. అతని స్నేహితుడు ఎర్రని కళ్లతో నాకేసి చూస్తున్నాడు. చేతిలో చిప్స్ పాకెట్ నావైపు చూపిస్తూ... "తీసుకో" అన్నాడు. నేను బొమ్మలా నిలబడి చూస్తున్నాను. నర్శిమ్మ "తీసుకో" అన్నాడు గట్టిగా. నేను తీసుకోలేదు. వీళ్ల నుంచి తప్పించుకోవడం ఎలా అని ఆలోచిస్తున్నాను. నేను గట్టిగా అరిస్తే చుట్టుపక్కల వాళ్లు వస్తారు. నన్ను రక్షిస్తారా? తిడతారా? ఇంట్లోంచి ఈ అర్ధరాత్రి వెళ్లగొడతారా?

"ఏంది నకరలు చేస్తున్నవు?" అంటూ నర్శిమ్మ గభాల్న లేచి నా చేయి పట్టుకుని విసురుగా మంచంమీదకి తోశాడు. సరిగ్గా




వెళ్లి హనుమాన్లు ఒళ్లో పడ్డాను. ఘనకార్యం చేసినట్టు విరగబడి నవ్వాడు నర్సిమ్మ.

"తీసుకో... ఖుషీచేయి. నేను పోతా" అంటూ తూలుతూ తలుపు గడియ తీసుకుని బైటకి వెళ్ళిపోయాడు.

నేను గట్టిగా "నర్సిమ్మా ఆగు" అని అరిచాను. నర్సిమ్మ ఆగలేదు. నేను హనుమాన్ల పట్టు విడిపించుకుని పరిగెత్తాను.

"నర్సిమ్మా" నర్సిమ్మ వీధిలోకి వెళ్లిపోయాడు.

"నర్సిమ్మా! ఆగు" గట్టిగా గొంతు చించుకుని అరిచాను.

చుట్టుపక్కలవాళ్ళంతా తలుపులు తీసుకుని బైటికి వచ్చారు.

ఏడుస్తూ అన్నాను. "చూడండి... వాడు వాడు ఎంతపని చేస్తున్నాడో... నన్ను నన్ను"

"ఏదో... మొగుడూ, పెళ్ళాల గొడవ... మనకెందుకు? " అందరూ మళ్ళీ లోపలికెళ్ళి తలుపులు వేసుకున్నారు.

హతాశురాలిని అయ్యాను. మొగుడు... ఎవరు మొగుడు? స్నేహితుడికి నన్ను డబ్బుకోసం తార్చేవాడు నా మొగుడా? వీడినేనా బతిమాలి, బామాలి, కాళ్లు పట్టుకుని తాళి కట్టించుకున్నాను.

అందరూ తలుపులు వేసుకోగానే హనుమాన్లు విసురుగా వచ్చి నన్ను లాక్కెళ్ళసాగాడు. వదులు... వదులు. నా ఆక్రందన ఎవరికీ వినిపించలేదో, వినిపించినా మొగుడూ, పెళ్లాల గొడవ అనుకుని బైటకి రాలేదో ఎవరూ నా అరుపులకి స్పందించలేదు. హనుమాన్లు బలవంతంగా లోపలికి తోసి, తనూ వచ్చి తలుపువేసి గొళ్లెం పెట్టాడు. విసురుగా మంచంమీదకి తోశాడు. నేను లేవబోతుంటే అతను రెండు చేతుల్తో గట్టిగా పట్టుకున్నాడు. నేను పెనుగులాడాను. "వదులు... నన్ను వదులు..." అరిచాను. అతను తన పెదాలతో నా పెదాలు గాట్లు పడేలా కొరికాడు. బాధగా అరిచాను. ఎవరికీ వినిపించలేదు. వినిపించినా రారు. నర్సిమ్మ భార్యను అని చెప్పుకున్నందుకేగా నాకీ శిక్ష... ఈ శిక్షనే నన్ను రక్షించే ఆయుధంలా ఉపయోగించాలనుకున్నాను.

"వదులు... నీకు దణ్ణం పెడతాను. నన్ను వదులు. నేను నర్సిమ్మ భార్యను" అన్నాను ఏడుస్తూ.

అతను పగలబడి నవ్వాడు.

"భార్యా... అంటే ఏంటి? "

"మేము పెళ్ళి చేసుకున్నాం. నా మెడలో తాళి ఉంది"

అతను మళ్ళీ నవ్వాడు. నవ్వుతూనే ఉన్నాడు. ఆగి ఆగి నవ్వాడు. నవ్వీ నవ్వీ దగ్గు వచ్చి మెలికలు తిరుగుతూ సీసాల్లో మిగిలిన రెండు చుక్కల బ్రాందీ నోట్లో పోసుకున్నాడు. సీసాలు తీసి మంచం కిందికి నెట్టాడు. మంచం మీదనుంచి చిప్స్ పాకెట్లు, మిక్చర్ పాకెట్లు కిందికి విసిరేశాడు. ఇవన్నీ ఒకచేత్తో నన్ను పట్టుకునే మరో చేత్తో చేశాడు. వదిల్తే నేను పారిపోతానన్నట్టుగా అలా పట్టుకునే అన్ని పనులూ చేశాడు. మంచంమీద దుప్పటి దులిపి నన్ను మంచంమీదకి తోశాడు. నేను చివ్వున దిగబోతుంటే నా మీద పడ్డాడు. నా మొహంలో మొహం పెట్టి అన్నాడు. "తాలికట్టినోళ్లందరూ నీకు మొగుళ్లయితారా? కావాలంటే పట్టు నేను కూడా కడతా పది తాళిబొట్లు"

నా ఒళ్లంతా ముచ్చెమటలు పట్టింది. గొంతు తడారిపోయింది. గొంతు పెగిలి మాట రావడంలేదు. అరుద్దామంటే స్వరం రావడంలేదు. గుండెనిండా దుఃఖం... గడ్డ కట్టుకుపోయిందేమో. గుండె బరువుగా అనిపిస్తోంది. కళ్లనుంచి ఒక్కచుక్క కూడా కన్నీరు రాలడంలేదు. కానీ భోరున ఏడవాలనిపిస్తోంది. ఈ రాక్షసుడి కబంధహస్తాల నుంచి తప్పించుకోవాలని శాయశక్తులా ప్రయత్నిస్తూ నీరసించిన స్వరంతో బతిమా

లసాగాను. "దయచేసి నన్ను వదిలిపెట్టు. నీకు పుణ్యం ఉంటుంది. వదిలిపెట్టు" అంటూ పెనుగులాడుతోంటే విసుగ్గా అన్నాడు.

"ఏందే... వదిలిపెట్టేది. వాడికి ఐదువేలిచ్చాను. ఊరికినే ఇచ్చానా?"

నామీద యావత్ప్రపంచం విరిగిపడింది.

నా శరీరం, మనసు ముక్కలు, ముక్కలైనాయి.

వెక్కి వెక్కి ఏడుస్తూ ఉండిపోయాను.

అతనికి, ఆ పశువుకి నా కన్నీళ్లతో ఏం సంబంధం లేనట్టు తన కోరిక తీర్చుకున్నాడు.

నేను ఏడుస్తూ అలాగే పడుకున్నాను. ఆ పశువు భీకరంగా గురకపెడుతూ పడుకున్నాడు.

★ ★ ★

తెల్లవారాక నర్శిమ్మ లోపలికి వచ్చాడు. నేను లేవలేదు. నిశ్శబ్దంగా ఏడుస్తూ బోర్లా పడుకున్నాను గచ్చుమీద.

హనుమాన్లు ఆవలిస్తూ లేచి విసుగ్గా అన్నాడు.

"ఏంటిరా నీ పెళ్ళాం నేనో, నువ్వో చచ్చినట్టు ఏడుస్తోంది. ఏం మజాలేదు. ఏంలేదు. బేవార్సుదాన్ని తీసుకొచ్చావు"

నర్శిమ్మ కోపంగా కాలితో నా నడుంమీద ఒక్కతాపు తన్నాడు. "అబ్బా..." అని కెవ్వుమన్నాను.

"లెవ్వు..." రెక్క పుచ్చుకుని బలవంతంగా లేపాడు. "ఏందే నకరలైనయ్యా. ఇంక పోనీ అని మంచోల్లకే ఇస్తున్న నిన్ను. రేపటిసందీ రోజు పోవాలె లాడ్జికి. ఎక్కువ, తక్కువ నకరలు చేసినవంటే బొక్కలిరగదంతా" అంటూ బూతులు తిడుతూ ఆ చెంపా, ఈ చెంపా వాయించాడు.

అతని దెబ్బలకి తలతిరిగి సొమ్మసిల్లి పడిపోయాను.

వాళ్లిద్దరూ కొంతసేపటి తరవాత బైటకి వెళ్లడం లీలగా అర్థమైంది. కానీ నేను మాత్రం లేవలేదు. వాళ్లు కూడా నన్ను లేపేందుకు ఏమీ ప్రయత్నించలేదు. ఆ తరవాత కళ్లు మూసుకుపోయాయి.



నాకు తిరిగి మెలకువ వచ్చేటప్పటికి అంతా నిశ్శబ్దంగా ఉంది. తలుపు ఓరగా వేసి ఉంది. ఒళ్లు తూలుతోంటే నెమ్మదిగా లేచాను.

తాళికట్టిన సానికొంపలో చీకట్లో వచ్చి వెళ్లే విటుడికీ, నన్ను కొంతకాలంపాటు తిండీ, బట్టా ఇచ్చి పోషించినవాడికి పెద్ద తేడా ఏంలేదు. వాళ్లిద్దరూ డబ్బుల్తో నన్ను కొన్నారు. వీడు ఈ నర్శిమ్మ నన్ను డబ్బుకోసం అమ్ముతున్నాడు వాడు కట్టిన తాళి వాడికి ఆ హక్కునిచ్చినట్టుగా, నా శరీరంమీదా, నా బతుకుమీదా గుత్తాధిపత్యం ఇచ్చినట్టుగా.

పైట వెనకాల ఉన్న పసుపుతాడు బైటకి లాగాను. మొన్నటిదాకా అంతో ఇంతో మెరుస్తూ ఉన్న తాళిబొట్లు నల్లగా అయ్యాయి. మకిలిపట్టినట్టుగా ఉన్నాయి. అంటే... ఇవి గిల్టువి. ఎంత మోసం! చటుక్కున బలంకొద్దీ లాగాను. పుటుక్కున తెగిపోయింది పసుపుతాడు. విసిరి మూలకు పడేశాను. నేరుగా వెళ్ళి ఓ మూల గోడకానించి పెట్టిన చీపురుకట్టమీద పడింది




ఇంక ఇక్కడ ఉండే అవసరం, అగత్యం నాకేం కనిపించలేదు. నేను నమ్మి వచ్చిన వ్యక్తి రాక్షసుడు, నీచుడు, దుర్మార్గుడు. వాడికి ఎదురుచెపితే నా రక్తం కళ్లచూస్తాడు. ఎదురు చెప్పకపోతే నా రక్తం అమ్ముకుని బతుకుతాడు. నేను బతకడానికి వాడి దయా ధర్మంమీద ఆధారపడాల్సిన అవసరం ఏంటి? నాలో ఓ తెగింపు కలిగింది. నాకాక్షణంలో బైటకి అడుగుపెడితే నేనెక్కడికి వెళ్లాలి? అన్న భయం కలగలేదు. ఆ స్థానంలో ఎక్కడికైనా వెళ్ళిపోవాలి. ఎలాగైనా బతాకలి? లేదంటే చావాలి. అంతేగానీ, ఈ రాక్షసుడితో ఇంక కలిసివుండే ప్రసక్తిలేదు. ఉండకూడదన్న బలమైన నిశ్చయం కలిగింది.

బలవంతంగా లేచి బాత్‌రూంకి వెళ్ళి చన్నీళ్లతో మొహం కడుక్కున్నాను. కడుపు నిండా మంచినీళ్లు తాగాను. ఎటూ తిరిగి చూడలేదు. నెమ్మదిగా అడుగులేస్తూ తల ఎత్తుకుని, ధైర్యంగా మనోనిబ్బరంతో బైటకి వచ్చాను. వాకిట్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న ఆడవాళ్లు నావైపు చిత్రంగా చూస్తున్నారు. వాళ్ళవైపు చూడలేదు నేను. సూటిగా చూస్తూ వీధిలోకి వచ్చాను.

నా ఎదురుగా కనిపిస్తోన్న విశాలమైన రోడ్డువైపు అడుగులు వేశాను.

ఎటు వెళ్లాలి? ఏం చేయాలి? అనే ఆలోచనలు ఇప్పుడు నాకు లేవు. ముందు ఈ నరకం నుంచి వెళ్ళిపోవాలి. అంతే... నా అడుగుల్లో భయంలేదు. తొట్రుపాటు లేదు. సందేహంలేదు. చాలా నిబ్బరంగా పడుతున్నాయి. మెయిన్‌రోడ్డుమీదికి వచ్చాను. ప్రవాహంలా కార్లు, స్కూటర్లు, బస్సులు, అంతకన్నా వేగంగా మనుషులు పరిగెడుతున్నారు. నావైపు ఎవరూ చూడడంలేదు. నువ్వెవరు? నీ పేరేంటి? అని నన్నడగడంలేదు. కానీ నర్సిమ్మ? అవును నర్సిమ్మకి నేనెవర్ని? ఏమవుతాను?

"ఏయ్... కళ్లు కనిపించడంలేదా? చస్తావా? " ఎవరో గట్టిగా అరిచారు.

ఉలిక్కిపడ్డాను. స్కూటర్‌మీద ఓ పెద్దాయన తిడుతూ స్కూటర్ బలంగా లాగిస్తూ వెళ్ళిపోయాడు.

ఎప్పుడూ అంత రద్దీలో తిరగకపోవడంతో ఎటు వెళ్ళాలో రోడ్డు ఎలా దాటాలో నాకర్థం కాలేదు. ఒక్కసారి చుట్టూ చూశాను.

ప్రవాహం. వాహనాల ప్రవాహం. జనప్రవాహం. ఇప్పుడు నేను ప్రవాహానికి ఎదురీదాలి. తప్పదు. తెగించాను. పరిగెత్తాను. రోడ్డుకి మరోపక్కకి వచ్చాను. మరికొంత దూరం నడవాలి. కనిపించింది. బ్రిడ్జికింద పారుతోన్న కాలువ.

కొన్ని నిమిషాలపాటు అలాగే ఆ బ్రిడ్జి మీద నిలబడి ఆ కాలువలోకి చూస్తూ నిలుచున్నాను. ఇందులోకి దూకితే! చుట్టూ చూశాను. జనం, జనం వాహనాలమీదా, కాలినడకనా ఎటుచూసినా జనం

వాళ్లంతా నావైపు చూడడంలేదు. కానీ నేను ఆ కాలువలోకి దూకితే మాత్రం చూస్తారు. రక్షిస్తారు. ఇది పట్టపగలు. చీకటి పడిందాకా ఎక్కడన్నా తలదాచుకుంటే రాత్రికి వచ్చి ఇందులో దూకొచ్చు

అక్కడినుంచి కదిలి ముందుకి నడిచాను. నీరసంతో కాళ్లు తేలిపోతున్నాయి. తలంతా దిమ్ముగా, భారంగా ఉంది. కళ్లు మంటలు పుడుతున్నాయి. అలాగే మరికొన్ని గజాలు నడిచాను. ఎదురుగా సందు కనిపించింది. ఓపిక తెచ్చుకుని ఆ సందులోకి నడిచాను. కొంచెం దూరం వెళ్లేటప్పటికి కళ్లు తిరుగుతున్నట్టుగా అయింది. అలాగే మరికొంత దూరం నడిచాను. అప్పుడు కనిపించింది ఓ గుడి.

నా కాళ్లు అటు నడిచాయి. తడబడే అడుగులతో గుడిమెట్లు ఎక్కాను. లోపలికి అడుగుపెట్టబోతుంటే గుండె దడదడలాడింది. నేను గుడిలోకి వెళ్లచ్చా. గుడి అంటే ఎంతో పవిత్రమైంది అంటారు. అలాంటి పవిత్రమైన చోటికి నాలాంటి వేశ్య అడుగుపెట్టచ్చా? దేవుడు నన్ను శపిస్తాడా? ఏమని

శపిస్తాడు? వచ్చేజన్మలో కూడా ఆడదానినై పుట్టు. ఆకలేస్తే కష్టాలు తిను. దాహమేస్తే కన్నీళ్లు తాగు అని శపిస్తాడా?

నెమ్మదిగా, మొండిగా కుడిపాదం లోపల పెట్టాను. ఎవరో భక్తులు గంటకొట్టారు.

రెండోపాదం కూడా పెట్టాను. మరోసారి గంట మోగింది. పూజారి హారతిస్తున్నాడు. హారతి వెలుగులో కాషాయవస్త్రాల్లో, తల పాగాతో నిరాడంబరంగా, నిర్మలంగా, ప్రశాంతంగా కూర్చున్న బాబా విగ్రహం కనిపించింది.

రెండుపాదాలు బలంగా నేలకానించి, అడుగులు ముందుకేసి, మోకాళ్లమీద ఆ విగ్రహం ముందు మోకరిల్లాను.

"బాబా... ఎందుకు పుట్టానో, ఎలా పుట్టానో నాకు తెలియదు. ప్రతి మనిషి జన్మకీ ఓ పరమార్ధం ఉంటుందంటారు. నా జన్మకి ఉన్న పరమార్ధం ఏమిటి? నాకెదురైన ప్రతి మగవాడికీ శారీరకసుఖం ఇవ్వడమా? అదేనా నా ఈ జీవితానికి పరమార్ధం. ఒకవేళ ఒకవేళ అదే నిజమైతే నాకా జీవితం వద్దు. నన్ను ఈ బతుకు నుంచి విముక్తిరాలిని చేయి"

"అమ్మాయి ప్రసాదం తీసుకో"

నెమ్మదిగా లేచాను.

పూజారి చేతిలో పటికబెల్లం పట్టుకుని నిలబడ్డాడు.

అపవిత్రం అయిన నా చేతులు ముందుకు చాపాను.

పటికబెల్లం నా అరచేతిలో వేశారాయన.

ఆ పటిక బెల్లం నోట్లోవేసుకుని, తూలుకుంటూ గర్భగుడి వెనక్కి వెళ్లాను. అక్కడికి నాలుగడుగుల దూరంలో దూలాలతో ఉన్న విశాలమైన అరుగు కనిపించింది. ఆ అరుగు మీద స్వామివారి రథం ఉంది. ఆ రథం వెనక్కి నడిచి, ఖాళీగా ఉన్న ఆ నేలమీద వాలాను. ఇంకొక్క అడుగువేసే ఓపికకూడా లేదు నాకు. నా ఓపికంతా నశించిపోయింది. నెమ్మదిగా నా కళ్లు మూతలుపడ్డాయి.

"అమ్మాయి! లేమ్మా... ఎవరు నువ్వు? లే" ఎవరో లేపుతున్నారు.

మెలకువ వచ్చినా నాకళ్లు మాత్రం తెరిపిడి పడడంలేదు. బలవంతంగా కళ్లు తెరవడానికి ప్రయత్నించాను. కానీ నా వల్లకాలేదు. "దా...దాహం" నా నోట్లోంచి ఆ ఒక్కమాటే వచ్చింది. దాహంతో నాలుక పిడచకట్టుకుపోయింది.

నన్ను లేపుతూన్న ఆయన ఖంగారుగా "రాజ్యం! మంచినీళ్లు తీసుకురా" అని కేకేశారు.

అరక్షణం తరువాత ఎవరో నా గొంతులో నీళ్లు పోశారు. చల్లటి నీళ్లు... గొంతులోంచి గుండెలోకి జారిపోతూ, మండిపోతూన్న నా గుండెకి చల్లదనాన్ని చేకూరుస్తున్నాయి.

నెమ్మదిగా కళ్లు తెరిచాను. పార్వతీ, పరమేశ్వరుల్లాంటి దంపతులు. పూజారిగారు. ఆయన భార్య. ఆవిడ కుచ్చిళ్లమధ్య దాక్కుని రెండేళ్ల బాబు. అప్రయత్నంగా రెండు చేతులూ జోడించాను.

"ఎవరమ్మా నువ్వు?" ఆయన స్వరం ఎంతో ఆర్ద్రంగా ఉంది. ఆయన కళ్లలో కరుణ సముద్రంలా పొంగుతోంది. ఆయన్ని చూస్తుంటే ఆ బాబాయే లేచి వచ్చినట్టుగా అనిపిస్తోంది. నాకళ్లు నీళ్లతో నిండాయి.

"ఎందుకమ్మా బాధపడుతున్నావు? ఎక్కడనుంచి వచ్చావు" ఆవిడ పార్వతీదేవిలా ఎంతో ఆప్యాయంగా అడిగింది.

బొటబొట రాలాయి కన్నీళ్లు. ఆపైన వెక్కివెక్కి ఏడవసాగాను.

ఆవిడ మోకాళ్లమీద కూర్చుని నా తల తన ఒళ్లో పెట్టుకుంది. "ఏడవకమ్మా... ఎందుకు ఏడుపు? నీకొచ్చిన కష్టం ఏమిటి? స్వామి సన్నిధిలో ఉన్నావు. బాధార్తులను ఆదుకొనడానికే ఆ స్వామి ఉన్నాడిక్కడ. చెప్పు ఆయనా వింటాడు నీ బాధ చెప్పమ్మా"

"నేను... నేను... అపవిత్రురాలిని. నాకు




చచ్చిపోవాలనుంది" అతి కష్టంమీద నా నోరు పెగిలింది.

"తప్పు... అంతమాటనకూడదు. మానవ జన్మ అనేది ఆ దైవం ఇచ్చిన వరం. బలవన్మరణం పొందడం అంటే ఆ వరాన్ని అపహాసించడం. కష్టాలు, కన్నీళ్లు లేనిది జీవితానికి పరిపూర్ణతలేదు, ఉండదు"

"నా శరీరం మలినమైపోయింది స్వామీ. కుళ్ళిపోయింది. పురుగులు పట్టింది. మీకు తెలియదు. నేను నేను"

"నాకంతా అర్థమైందమ్మా. నువ్వేం చెప్పద్దు. నువ్వు చేసిన తప్పులో నీ ప్రమేయం ఏదీ లేదు అని నాకు తెలుసు. కావాలని తప్పుచేసేవాళ్లలో ఈ పశ్చాత్తాపం, ఈ ఆవేదన ఉండదు. మలినం అయింది నీ శరీరమే. మనసు కాదుకదా! బురదలో కాలు జారిపడ్డాక ఆ బురద వంటికి అంటుకుందని చనిపోతావా? లేదుగా! మంచినీటితో ఆ బురద కడుక్కుని నిన్ను నువ్వు పరిశుభ్రం చేసుకుంటావుగా! అలాగే ఇప్పుడు కూడా నీ ఈ శరీరాన్ని స్వామి సేవ అనే భక్తిప్రవాహంలో ముంచి ప్రక్షాళనం చేసుకో. నీ ఆత్మలాగే శరీరం కూడా మాలిన్యాన్ని తొలగించుకుని ముత్యంలా ప్రకాశిస్తుంది. లే... ఈరోజు నుంచీ ఈ గుడి శుభ్రంచేసి స్వామి పూజకి మడినీళ్లు తెచ్చే పనితోపాటు, అనేక పనులు నువ్వు చేయాలి. నువ్వు అనుకుంటున్న మాలిన్యం ఇప్పటికే నీ కన్నీటితో కొట్టుకుపోయింది. లేమ్మా"

"స్వామీ!" సంభ్రమాశ్చర్యాలతో పిలిచాను.

"సందేహించకమ్మా... లే... ఈ సూర్యోదయం నీ జీవితంలోని అంధకారాన్ని తొలగించి, సంతోషం అనే వెలుగు రేకల్ని నింపుతుందిలే"

"నేను... నేను పతితను స్వామీ. దేవుడి సేవ చేసే అర్హత నాకుందా? నేను భ్రష్టురాలిని, పాపిని. అలాంటి నేను దేవుడి సేవ..."

"కాదమ్మా... నువ్వోశక్తివి... నువ్వో అద్భుతానివి... నీ జీవితం ముగిసిపోలేదు. నువ్వు నిర్వర్తించవలసిన కర్తవ్యాలు ఎన్నో ఉన్నాయి. అవేమిటో నేను చెప్తాను. రా నాతో రా" ఆవిడ చేయి అందించారు.

మంత్రముగ్ధురాలిలా లేచాను. ఆవిడ పసిపాపని లేపినంత జాగ్రత్తగా నన్ను లేపారు. మెల్లిగామెల్లిగా ఆవిడ చేయి అందుకున్నాను. బాబు అమ్మ చీరకుచ్చిళ్లలో సగం దాక్కుని నావైపు దొంగచూపులు చూస్తూ నిలుచున్నాడు.

నాకంటికి ఇప్పుడు వాళ్లు ముగ్గురూ అమ్మా, నాన్న, తేజాలాగా కనిపిస్తున్నారు. గుండెనిండా తృప్తి, సంతోషం, నెమ్మదిగా అడుగులు వేస్తూ ఆత్మవిశ్వాసంతో వారి ఎదురుగా నిలబడ్డాను. వారి స్పర్శసోకి, ప్రక్షాళనం అయిన మనశ్శరీరాలతో వారి ఎదురుగా నిలబడ్డాను.

"అదిగో అదే నువ్వు నడవవలసిన మార్గం" కుడిచేయి చాచి దూరంగా చూపించారు.

గుడి ద్వారం దాటి, రోడ్డుకి అవతలపక్క నల్లని బోర్డుమీద తెల్లని అక్షరాలు కనిపించాయి.

"శ్రీసాయిబాబా అనాథాశ్రమం"

"ఈ దేవాలయం ట్రస్టువారు నడిపిస్తున్న ఆశ్రమం... ఆ ఆశ్రమంలో ఉన్న చిన్నారులకు, అభాగ్యులకు నీ సేవలు చాలా అవసరం. పద నిన్ను అక్కడికి చేరుస్తాను"

అప్పుడే తూర్పునుంచి ప్రసరిస్తోన్న సూర్యుడి నులివెచ్చని కిరణాలు నా అణువణువునీ చైతన్యంతో నింపాయి.

పవిత్రమైన ఆ దేవాలయంవైపు నా పయనం సాగింది.

ఇప్పుడు అర్థమైంది నేనెవరో! నా పేరేంటో! నా ఉనికి ఎక్కడో! ఈ ప్రపంచంలో నా స్థానం ఏమిటో!

"ఇప్పుడు నా పేరు సేవిక"

*

# ఏరిన ముత్యాలు

✤ నరలోకమంటూ ఉంటే అది స్వార్థమానవుని హృదయంలో దర్శనీయం

-పబ్లిమస్ పైరస్

✤ నవ్వడం మరిచిపోయినవాడు నిరాశావాది. మరచిపోవడానికి నవ్వేవాడు ఆశావాది.

-ఇ. డేవిస్

✤ మనం పుట్టింది మళ్ళీ పుట్టకుండా ఉండడానికి. మరణించేది మళ్ళీ మరణించకుండా ఉండడానికి.

-శ్రీశ్రీ

✤ మానవులను ఏకంచేసే శక్తులు రెండే రెండు వున్నాయి. అవి ఒకటి భయం, రెండు ప్రయోజనం.

-నెపోలియన్ బోనాపార్ట్

✤ సచేతన జీవులను మిక్కిలి హింసించుటయే జీవితపు విలువ అయినప్పుడు ఆ విధమైన జీవితమును జీవించుటకు నిరాకరించవలెను.

-గాంధీజీ

✤ పొగడ్తలకు పొంగిపోయేవాడు సులభంగా అవమానాలకు కూడా గురౌతాడు.

-సి.నా.రె.

✤ శాంతిని సాధించటానికై మనం అరుపులు, పెడబొబ్బలు పెట్టాలా?

-లావోస్

✤ మన మంచిగుణాలను మనం మరిచిపోవచ్చు. కానీ దేవుడు మాత్రం మరువడు.

-సుందరచైతన్య

✤ ఎవరి హృదయంలో నిరంతరం ప్రేమ, భక్తి వుంటుందో, అతడెవరో కాదు, అతడే దేవుడు.

-రామకృష్ణ పరమహంస

✤ దైవం అంటే మహత్తరమైన శక్తుల సాగరం. నీవేదైనా అవగుణంతో దహింపబడుతుంటే ఆ సాగరంలో స్నానంచెయ్యి

-బైబిల్‌సూక్తి

✤ మన ప్రయాణంలో మంచి స్నేహితులుంటే మనకు మార్గాయాసమే కనిపించదు. జీవితం కూడా ఒక ప్రయాణమే

- ఐజాక్ మిల్టన్

✤ మనసులో సంఘర్షణ ఆరంభమైతేగానీ జీవితపు విలువని తెలుసుకోలేము.

-బ్రౌనింగ్

సేకరణ: ***అనంతప్రభాకర్‌దత్తు***

# 'స్వప్నసౌధం' పై సమీక్షలు

జూన్ చతురలో ప్రచురితమైన తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి నవల 'స్వప్నసౌధం' పై మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువన ప్రచురిస్తున్నాం

## అసలైన పాత్ర

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

'స్వప్నసౌధం' నవల సింప్లీ సూపర్బ్ అయితే హృద్యంగా చూపించాలనుకున్న వసుంధర పాత్ర దయనీయమైనది కాదు. ఒకవైపు ఆమెకు తగిన శాస్తి జరిగింది అనిపిస్తుంది. హద్దులుదాటి ప్రేమించడం అనేది సమంజసం కాదు. అలాంటి ప్రేమలు మనసులో కలగకుండా జాగ్రత్తపడాలి. కానీ తెలివైన వసుంధర ఈ విషయంలో అతి తెలివిగా ప్రవర్తించింది. ముఖ్యంగా చిన్నప్పటినుండీ కటిక పేదరికంలో పెరిగిన వసుంధర ఆశతో, అత్యాశతో చిన్నదొరపై కన్నేసింది. అతడ్ని పెళ్ళి చేసుకుని తన పేదరికాన్ని దూరం చేసుకుని, తనవాళ్ళని ఆదుకోవాలని కలలు నిర్మించుకొంది. ఈ నేపథ్యంలో ఆమె ప్రేమ నిజమైనదైనప్పటికీ, ఆ ప్రేమలో స్వార్థం కూడా కనిపిస్తుంది. కాగా తన కలలన్నీ కల్లలు అయిపోయిన తర్వాత కూడా వసుంధర పాత్రలో రచయిత్రి మార్పు తీసుకురాలేదు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకున్నట్లు, చిన్నదొర తన ప్రేమను కాకుండా తన శరీరాన్ని మాత్రమే అక్రమంగా ఆశిస్తున్నాడని పూర్తిగా తెలిసివచ్చిన తర్వాత ఆమె వాస్తవ స్థితిగతులను ఆకళింపు చేసుకుని, ప్రేమపొరల్ని తొలగించుకుని సాధారణ మనిషిగా మారుతుంది. అయితే భర్త అమాయకత్వాన్ని, ప్రేమని,



మంచి మనసుతో మొదటే అర్థం చేసుకుని తన పరిధిలో మొదటినుండే మెలిగివుంటే పరిస్థితి ఇంతగా విషమించకపోయేది అనిపిస్తుంది. చిట్టచివరిలో, చిన్నదొరలోని పైశాచిక స్వభావం పూర్తిగా తేటతెల్లమయ్యాక "చిన్నజాతి వాళ్ళలో కూడా మానాభిమా

నాలు వుంటాయి. నీలాంటి పెద్ద జాతివాళ్ళు మమ్మల్ని కాటేయాలని చూస్తే మేం సహించబోము" అని చెప్పినట్టు అతణ్ణి హతమార్చడానికి ప్రయత్నించినా ఆ వేటు మల్లేశంపై పడడంతో ఆమె పాఠకుల సానుభూతిని కోల్పోతుంది. ఆమెకు తగిన శాస్తి జరిగింది అనిపిస్తుంది. అందరికీ వసుంధర కథానాయికలా కనిపించవచ్చుగానీ, భర్త మంచితనాన్ని అర్థం చేసుకోలేని ఆమె విష సౌందర్యం ఆ పాత్రను నాయికగా నిలబెట్టదు. పోతే భార్యని నిజాయితీగా అర్థం చేసుకుని, స్వచ్ఛంగా ప్రేమించి, చివరికి ఆమె చేతుల్లోనే అశువులు బాసిన 'మల్లేశం' పాత్ర ఆ కథ మొత్తానికి హైలైట్.

**– శశిధర శెట్టి,**
మదనాపురం.

## ప్రేమకు నిర్వచనం

***(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)***

"నవం లా ఇతి నవలా" అని విమర్శకులు నవలకు నిర్వచనం చెప్పారు. ఆ నిర్వచనానికి నిలువుటద్దంలా సాగిన నవల తంగెళ్ళ శ్రీదేవిరెడ్డిగారి 'స్వప్నసౌధం'. విషయం సాధారణమైనదైనా దానిని మలిచిన తీరు అత్యద్భుతం. నవల ఒక రసఝరిలా, అనియతంగా సాగిన సెలయేరులా, మరంద బిందు సందోహం జిహ్వాగ్రాన్ని చేరి ఆనంద తరంగితం చేసినట్లు ఏకబిగిన చదివించడం రచయిత్రి రచనా పాటవాన్ని రుజువు చేస్తుంది. 'కల'గా కట్టుకున్న ప్రేమ సౌధం 'కల'గానే మాయమవడం నవలకే మకుటాయమానంగా శోభించింది.

నేటి యువత ఆంగికమైన 'ఆకర్షణే' ప్రేమగా భ్రమపడుతున్నారు. అయితే అందుకు భిన్నంగా 'ఒక సైడ్ లవ్'గా సాగిన వసుంధర ప్రేమ మానసికమైనది, నిష్కల్మషమైనది. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంతో యువత 'ప్రీ మారిటల్ లవ్' అంటూ శారీరక సుఖం పొంది, ప్రేమను దులిపేసుకుంటున్న ఈ రోజులలో ప్రేమకు నిర్వచనంలా వసుంధర పాత్రను తీర్చిదిద్దడం ప్రశంసనీయం.

'వసుంధర' పెదబాబును ప్రేమించింది, పిచ్చిగా ఆరాధించింది. అయితే సామాజిక అసమానతలు ఆమె ప్రేమను మనసులో అణచుకొనేటట్లు చేశాయి. సమయం చూసి ప్రేమను వెల్లడించి పెళ్ళి చేసుకోవాలని నిష్కల్మషంగా భావించింది. పరిపూర్ణమైన స్త్రీత్వానికి, ప్రేమైక మూర్తికి ప్రతీక వసుంధర. కానీ పేదరికం ఆమెకు పతితగా ముద్రవేసి బలవంతపు పెళ్ళి చేసి హంతకురాలుగా చేసింది.

పెదబాబు పాత్ర మొదటినుండీ ఎంతో గంభీరంగా, సౌకుమార్యంగా ఉండి చివరలో తన నిజస్వరూపాన్ని, ధనాహంకారాన్ని చూపించి పాఠకులకు ఒక 'కుదుపు' నిచ్చింది. ఆ పాత్రను రచయిత్రి నిర్వహించిన తీరు అనితర సాధ్యం. ముగింపు కూడా మామూలు కథలాగా జరుగుతుందనుకుంటే అమాయకుడైన మల్లేశాన్ని బలి చేసి కొత్తదనం చూపారు రచయిత్రి.

నా మనసుకు నచ్చిన నవల 'స్వప్నసౌధం' రచయిత్రికి అభినందనలు.

**– సి. హెచ్. శేషయ్య,**
*ఒంగోలు - 523 001*

## స్థాయికి తగ్గ కోరిక

***(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

గొప్పవాళ్ళ మనసుల్లోని కుత్సిత భావాలకు, బడుగు వర్గాలకి చెందిన మనుషుల మనసుల్లోని గొప్ప భావాలకు అద్దం పడుతుంది స్వప్నసౌధం. రచయిత్రి ధీరేంద్ర కుత్సితాన్నీ, మల్లేశం మంచితనాన్ని రెండు వైపులనుంచీ బాగా చూపించారు.

బడుగువర్గానికి చెందిన చిన్నారి పాత్ర,




ఆమె ఎదుర్కొనే కష్టాలు, అపవాదులు చివరికి ఆమె తండ్రి సైతం తన స్వార్థంకోసం ఆమె జీవితంపై మచ్చ వేసినపుడు ఆమె బాధల్ని దిగమింగిన వైనం... చిత్రీకరణ చాలా బాగుంది. కానీ ఆమె (వసుంధర) కోరుకున్న కల ధీరేంద్రతో వివాహం. అది యుక్తాయుక్త విచక్షణ లేకుండా తీసుకున్న నిర్ణయం కావడం, చివరకి ఆ చిన్ని కోరికను అదుపులో ఉంచుకోకపోయినందువల్ల జరిగిన దుష్పరిణామాల వర్ణన అద్భుతం.

ఫోన్‌లో తన స్నేహితురాలితో మాట్లాడించడం, తరువాత మళ్ళీ మళ్ళీ ఆ అమ్మాయి ఫోన్ చేసిందని చెప్పడంవల్ల ఒరిగిందేమిటో రాయలేదు. మేడిపురుగు వంటి ధీరేంద్ర కోసం మేలిమి బంగారమైన భర్తని నిర్లక్ష్యం చేసి అతన్ని సాధ్యమైనంత మానసికంగా హింసించి, చివరకు చేతులారా చంపుకొనే పరిస్థితి ఏ అమ్మాయికీ రాకూడదు.

గొప్పవాళ్ళు వేరనీ, గొప్ప మనసున్నవాళ్ళు వేరనీ తెలుసుకున్న కథానాయిక తన భర్తను కూడా చంపుకున్న తరువాత ఎవరి కోసమైతే తన భర్తనిసైతం నిర్లక్ష్యం చేసిందో 'అతనిని చంపేయాలి' అన్న నిర్ణయం తీసుకొన్న వైనం అత్యద్భుతంగా ఉంది. పెంచుకున్న ప్రేమని పగగా మార్చుకొని ఆమె కథలో నాయిక అయితే అయ్యింది కానీ నిజజీవితంలో గొప్పవాళ్ళవల్ల నష్టపోయి, దగాపడిన పేదవారికి ఈ పరిష్కారం వర్తించదు.

ఏది ఏమైనప్పటికీ మన స్థాయికి తగ్గట్టు మన కోరికలు ఉండాలి అన్న సందేశాన్ని అంతర్లీనంగా ఇచ్చారు రచయిత్రి తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి.

*-బి.వి. మనోహర్‌బాబు,*
*మంగళగిరి.*

## మంచి వంటకం!

***(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

చాలారోజుల తర్వాత చతురలో వండిన మంచి వంటకం స్వప్నసౌధం. ఈ దేశంలో సగటు మధ్యతరగతి కుటుంబంలోని కన్యలు కన్న కలలను రసవత్తరంగా రచించారు రచయిత్రి తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి. దూరపుకొండలు నునుపు అనుకునే కథానాయిక వసుంధర, గానుగెద్దులా చచ్చీచెడి సంసారాన్ని లాక్కొచ్చే ఆమె తల్లి, తాగుడికి తల తాకట్టు పెట్టే ఆమె తండ్రి, బూర్జువాలకి ప్రతినిధులుగా దొరబాబు దంపతులు, డబ్బులోపుట్టి డబ్బులో పెరిగి జీవితాన్ని విలాసవంతంగా గడపడంలో ఆరితేరిన ప్రతికథానాయకుడు పెదబాబు పాత్ర... ఇవన్నీ నిజజీవితంలో నిత్యం చూస్తున్న పాత్రధారులే. ప్రఖ్యాత నవల 'లే మిజరబుల్స్'లో కేవలం ఒక రొట్టెకోసం జీవిత ఖైదీ అవ్వాల్సిన కథానాయికుడిలా ఈ నవలా నాయికమణి తను చెయ్యని తప్పుకు పెద్దశిక్ష అనుభవించింది. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళనుకొన్న ఆ అమాయక ముగ్ధ కళ్ళెదుట కన్పడుతున్న పెదబాబు మేకవన్నె పులని తెలుసుకోలేకపోయింది. కథాకథనం మంచి ఉత్కంఠ కలిగించింది. సన్నివేశాలు సహజంగా ఉన్నాయి. 'స్మాల్ ప్లేస్-బిగ్ షో' లాంటి ఇంపోర్టెడ్ కెమేరా గదిలో అమర్చడం, డాక్టరుకి లేఖ, ఫోన్లో సంభాషణలు అన్నీ సినిమాటిక్‌గా ఉన్నాయి. "ధనానికి పేదైనా, గుణానికి పేద కాదు, వాళ్ళల్లో కూడా మానాభిమానాలున్న స్త్రీలుంటారని తొలిసారిగా అర్థమయింది" అని పెదబాబు అంగీకరించడం నవల్లో ఒక హైలైట్. వసుంధర తననితాను పెదబాబుకి అర్పించుకుంటుందేమో అన్న సస్పెన్స్ పాఠకుడ్ని చివరివరకూ ఉగ్రూతలూగిస్తుంది. చివర్లో తన భర్త రాముడిలాంటివాడని, ఆ కుతంత్రాల కూపం నుండి పారిపోదామని వసుంధర కట్టుకొన్నవాడిని కోరడం, రాత్రిపూట చీకట్లో పెదబాబనుకొని తన భర్త మల్లేశాన్ని చావబాదడం బాలచందర్ సినిమాని గుర్తుకు తెస్తుంది. కథ సుఖాంతం అవుతుందనుకొం

టున్న పాఠకునికి అనుకోని అఘాతం మల్లేశం చావు. రచయిత్రి ముగింపులో వైవిధ్యం చూపడం హర్షదాయకం.

**- ఆనంద్‌రావ్ పట్నాయక్,**
రాయగడ- 765 001

## అందని ద్రాక్షలు

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

పేదకన్య స్వప్నాలు పేకమేడల్లా కూలి పోయి, అనూహ్యంగా కన్యగానే జైలు జీవితం అనుభవించడానికి మూలాలైన ఈ సమాజపు వివిధ రుగ్మతలను వేలెత్తి చూపి, 'తస్మాత్ జాగ్రత్త' అంటూ, 'అందని ద్రాక్ష లను' ఆశించే ఎందరెందరో యువతులకు హెచ్చరికతో కూడిన పాఠం చెప్పింది తంగెళ్ల శ్రీదేవిరెడ్డి నవల 'స్వప్నసౌధం'.

ఊహలు, కలలకు ధనిక, పేద, కుల, మత, లింగ ఇత్యాది బేధాలుండవు. అందుకే అందమైన వసుంధర పేదరిక విష వలయంలో తిరుగాడుతూనే పెదబాబు ప్రేమని, తద్వారా మనువును మనస్ఫూర్తిగా ఆశించింది. అయితే కర్మ కాలి అపవాదుల పర్వం ఆమెను జైలుకెళ్లిన తదుపరి కూడా వెంటాడింది.

హైస్కూలు విద్యార్థినిగానే... కుటుంబ పరిస్థితుల మూలంగా దొర ఇంట్లో బాలకా ర్మికురాలై, ఆతర్వాత పట్నంలోనూ పనివాడి భార్యగా పనిమనిషే అయిపోయి తనకు ప్రేమికుడైన పెదబాబు కామపుకాటుకు బలయ్యే క్రమంలో... లక్ష్యం గురి తప్పి కట్టుకున్నవాడినే కడతేర్చడం... అందం అడవిగాచిన వెన్నెలై జైలుఊచల వెనుక జీవితాన్ని నెమరేసుకోవడం.... వెరసి వసుంధర విషాదగాథ ఆద్యంతం చదివించి పాఠకులను దుఃఖసాగరంలో ముంచి ఆలో చింపచేసింది.

యజమాని-సేవకుల బంధం పరస్పరంగా ఎంత బలమైనదైనా నిస్సహాయత, పేదరికా లను... 'బాస్' లనేవారు ఎలా వాడుకోగలరో కళ్లకు కట్టినట్టు చిత్రించగలిగారు రచయిత్రి.

పోతే నవలలో నాయికను రచయిత్రి పట్టువదలని ధీరవనితగా మలచడానికి చాలా శ్రమపడాల్సివచ్చినట్టు గోచరిస్తుంది. వసుంధర తలపెట్టిన కార్యాలకు అడుగడు గునా అడ్డంకులెదురైనా చివరి అంకాల్లో 'గెలుస్తాను, చూస్తాను, సాధిస్తాను'లాంటి ప్రతినలతో హీరోయిన్‌ను విజయంవైపు నడిపించ యత్నించిన వైనం బాగుంది.

ఇదిలా ఉంటే... చదువుకున్న వసుంధర ఎంత పెదబాబుకు మనసిచ్చినదైనా, అమా యకుడైన భర్త మల్లేశం ఎడల అలా ప్రవ ర్తించిన తీరు నచ్చలేదు.

నవలంతా ఒకవైపు అయితే పాఠకుల ఊహలకి భిన్నంగా వంచకుడైన ధీరేంద్ర స్థానే మల్లేశం చావడం, తద్వారా ఆత్మప్రక్షా ళనతో వసుంధర పశ్చాత్తాపపడడం అనే అంతంలోని ఘట్టం ఒక ఎత్తు. నవల నడి పించిన తీరెంతో ఆకట్టుకుంది.

**- ఎం. రమేష్‌యాదవ్,**
కరంజి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2003-RN1/32186/78